వేమన. ౩. ౨౫౧.

జః నాణెకత్తె, నాణెకాడు.

నాణ్య(ణియ)ము=నాణెము. (చి.ని. బ్రౌ.వా.)

నాతము. వి. బత్తెము.

ఉ...కొల్చినవేదపాదలన్, దప్పనిజీతనాతము లం దన్నుట భూవణ మయ్యెం బుత్రకా. శా. వి. ౨. ౩౪.

నాతి=నాతుక. వి. (క. నాతి. త. నాటి.) స్త్రీ, ఆడుది.

క. ఇమ్మగఁ దద్రూమాఘ్రాణమున గర్భములు దాల్చి నాతులు నవమాసములు నిండుదుఁ గనితె మ్మదమ్మున జంతుప్రముఖసుతప్రకర ముల్. భార. అర. ౩. ౨౧౬.

క. జ్ఞాతుఁ బోరితమును గోవ్రాతము నాక్రమము విప్రవర్గము చనవున్, నాతుల కారించుటయును, బ్రీతిం జననిచ్చునతని పెం పొప్పు న్ప పా. భార. ఉద్యో. ౨. ౧౬.

శ్లో. బ్రాహ్మణేషు చ యే శూరా స్త్రీషు జ్ఞాతిషు గోషు చ, వృంతాదివ ఫలం పక్వం ధృతరాష్ట్ర పతంతి తే. సం.భార.ఉద్యో. ౩౬. ౬౧.

క. అతనువుల లేరు గదా, నాతులు మతిఁ గాక కలిగినన్ వగఁ దిర్యగ్జాతికి నీజాతికిఁ గల, యీతీవ్రత గలదె యెఱుఁగ కిట్లే లంటిన్. ఆము. ౫. ౪౨.

జః నాతుక.

నాతికఠినము. సం. విణ. (అ. ఆ. అ.) అనతి కఠినము, మిక్కిలి గట్టిది కానిది.

నాతిచిరము. సం. విణ. (అ.ఆ. అ.) ౧. అనతి చిరము, అతిచిరము కానిది. ౨. దీర్ఘకాలపుది కానిది, స్వల్పకాలపుది.

నాతిదూరము. సం.విణ. (అ. ఆ. అ.) మిక్కిలిదూరము కానిది, ఇంచుకదూర మైనది. వి. అ. న. అనతిదూరము, కొంచెము దూరము.

నాతివాదము. సం. విణ. (అ. ఆ. అ.) పరుష భాషణము లేనిది. వి. అ. పుం. పరుషభాషణ ములేమి.

నాతుక=నాతి. వి. (నాతి+ఉక. స్వార్థమున.)

ఉ. జాతరవేరు చెప్పి రతిసంజ్ఞఁ దల్లియుఁ దానుగూడి యీ, నాతుక త్రోవ చూపఁగ వ సంబుగఁ దం జని...అవశీకృతమానసమై వడం కుచున్. భోజరా. ౫. ౨౫౭. ౨. ౯౩.

క. వినలే నిటివి మానుఁడు, నను మన్నన జేసి యనుచు నాతుక మ్రొక్కెన్. కళా. ౧. ౬౧.

సీ. నవలా మగువ నాతి నాతుక యాఁడుది లేమ గోల యువిద చాను చాన. ఆం.భా. ౨. ౧౦౪.

నాథము. సం. వి. అ. పుం. (ఎద్దు మొదలగువాని) ముకుద్రాడు.

నాథవంతుఁడు. సం. విణ. (త్. వతీ. త్.) ౧. నాథుఁడు కలవాఁడు. ౨. పరాధీనుఁడు.

నాథహరి. సం. వి. ఇ. పుం. ముకుద్రాడు పోసిన పశువు; పశువు.

నాథాతము. సం.వి.అ.పుం. ఆహారము. (కే.ని.)

నాథాతుఁడు సం.వి.అ.పుం. ప్రజాపతి, బ్రహ్మ. (కే. ని.)

నాథుఁడు. సం. వి. అ. పుం. ౧. స్వామి, యజమానుఁడు. ౨. పెనిమిటి, భర్త. ౩. ఏలిక, ప్రభువు. ౪. ఇంద్రుఁడు. (కే. ని.)

నాదనామక్రియ. సం. వి. ఆ. స్త్రీ. (సంగీ.) ఒకానొకరాగము.

సీ...శంకరాభరణము మేఘరంజి తోడి వరాళి నాదనామక్రియ నాట ..హంస. ౫. ౧౨౪.

**నాదము.** సం. వి. అ. పుం. ౧. ధ్వని, మ్రోత. ౨. (యోగ) అనుస్వారమువలె నుచ్చరింపఁదగు '‿' వర్ణభేదము. ౩. ప్రాణవాయువు నాడులయందు సంచరించుటవలన కలిగినధ్వని, ప్రణవనాదము.

క. ప్రతనుప్రాణమనోగ్ర, స్థితబుద్ధియై బిందు వందుఁ జెలఁగెడియాత్మ, ప్రతిబింబమె కళ పవనోన్నతఘోషమె సుమ్ము ప్రణవనాదము వత్సా.

క. ఆనాదబిందుకళలకు, గానంబను చుండువాని... సీతారా. ౧. ౧౬౪, ౧౬౫.

౪. (వ్యాక.) వర్ణోచ్చారణమందలిబాహ్యప్రయత్నభేదము.

**నాదారు.** విశ. (హిం. నాదార్.) బీద, దరిద్రుఁడు; చిక్కినవాఁడు, కృశించినవాఁడు.

(వ్యవ.) ఇప్పుడు నాదారురయితులు మిక్కిలి చిక్కుపడుచున్నారు.

,, ఆపిల్లవాఁడు చాల నాదారుగా నున్నాఁడు.

**నాదాలాబువు.** సం. వి. ఊ. స్త్రీ. గోరకు తుంబి, కుండానుగుॽ.

**నాదించు.** సం. అ. క్రి. నాదముచేయు, మ్రోఁగు.

గీ. ఘంట నాదించినవితాన గండుఁదేటి, మొఱయుచందాన జలధర ముఱుమురీతి, యురుమగిచినభాతి నై యుత్పలాప్త, నారి రణమున మ్రోసె నా దాఁటి కపుడు. శశాం. ౫. ౫౩.

**నాదు.** వి. (సం. నాదః.) ౧. ధ్వని, చప్పుడు.

మ... చట్టి చుం, యనునా దాఱనికూరగుంపు ...చిఱుపాలవెల్లువుగ నాహారఁ బిడుకు సీ తుసకు. ఆము. ౧. ౮౨.

గీ. నాదు మొలనూలిగంటలనాదు వినక, చంట నీయదు మాసక చంట దగునె. సారంగ. ౨. ౯౭.

ఊ... నూతుఁడుం బదను చేసినరథ్యము లాఁతు గంబుగాఁ, జేసి బళీ యనం దరటుచేసిననాదును బర్వ... కవి. ౫. ౧౩౦.

౨. (గానరూపమగు) ధ్వని.

ఆ. శ్రోత్రభావ మొంది సొలయక శబ్దంబు, నాలకించి యంతకంత కుబ్బి, వేటకానినాదు విన నాసచేసి లోఁబడినమృగమువోలెఁ జెడకు మనస. వా. రా. ౪. ౧౪౪.

జ: నాదుకొను, నాదుకొల్పు.

**నాదుకొను.** అ. క్రి. (√నాదు.) ధ్వనిచేయు. (చూ. నాదుకొల్పు.)

**నాదుకొల్పు.** స. క్రి. (√నాదుకొను.) ౧. (పిరంగులు మొదలగువానిని.) ప్రేలించు, ధ్వనింపఁజేయు.

మ. జినినీ దీర్చి ఫిరంగుదారులు సమత్రిస్థాంతుకస్తోమ్ములై, యనలజ్వాలలు కోలల న్దమిచి హాహారావ మువ్పొంగఁ ద.ద నవప్రోరకవాటపాటనకళా గాఢోద్యమ ల్లుభ్యద్వ్యాప్తిని యుక్కుమడి నాదుకొల్పిరి దిశాశ్రేణుల్ కదుం బెగ్గిలక్. రంగా. ౩. ౫౩.

**నాదేయము.** సం. విశ. (అ. ఈ. అ.) ౧. నదీసంబంధమైనది. ౨. నదీభవము. (నదియందు పుట్టినది - నదియం దున్నది.) ౩. గ్రహింపఁదగనిది. ౪. ఆదేయము కానిది, ఇయ్యఁదగినది. వి. అ. పుం. ౧. కాశము, రెల్లుॽ. ౨. వానీరము, ప్రబ్బॽ. ౩. కైవడిముస్తెॽ. న. ౧. సైంధవలవణము. ౨. సౌవీరాంజనము.

**నాదేయి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. జలవేతసము, నీరుప్రబ్బॽ. ౨. భూమిజంబుక, నేలనేరేడుॽ. ౩. వైజయంతిక, తక్కిలిॽ. ౪. నాగరంగము, నారింజॽ. ౫. జప, దాసనముॽ. ౬. కాకజంబువు, కాకినేరేడుॽ.

నాథము. సం.వి.అ. పుం. ముకుఁద్రాడు. (శ.ర.)

నాథవంతుఁడు. సం=నాథవంతుఁడు.

నాథుఁడు. సం=నాథుఁడు.

నాన. వి. (సం. జ్ఞానం. ప్రా. జాణం, ణాణం. క. త. నాణ్.) ౧. సిగ్గు, లజ్జ.

ఉ. ...నలినానన గోలతనాన సేల లో, నానఁ జలంబు నీకు మరునాన సుమీ విడు నాన యింకిటన్. విజ. వి. ౨. ౨౮.

క. నాన యిటు లేమిటికి నల్వి నానన కెమ్మోవి పంట నానఁగ నిడి వ్యన్నానననవిల్తుని చెయువుల, నానందింపఁగ నొనర్చి యలరింపఁగదే. రసిక. ౫. ౧౬౯.

గీ. నాన యింతయు మదిలోన నానఁబోక. నీలా. ౨. ౯౪.

గీ. నాన యనఁ బుచ్చడీ కనఁగాను లజ్జ. ఆం. భా. ౧. ౧౩౨.

౨. (తగనిపనిచేసినవారికి పరులను జూచునపుడు గాని పరులతో మాటాడునపుడుగాని మనస్సున కలిగెడి) సంకోచము; సంకోచము, వెనుదీయుట.

క. మాయయ్యలకుఁ బాయక పని సేయుచు దీవించి ప్రియము సేయుచు నుండుక్, మీయయ్య వెండిమహిమలు, నాయొద్దన పలుక నీకు నానయు లేదే. భార. ఆది. ౩. ౧౩౮.

ఉ. వలలుఁ డనన్ విరాటుకడ వంటలవాఁ డయి భీముఁడున్ బృహన్నల యన నాఁడు పేడి వయి నాన యొకింతయు లేక నీవు న, గ్గల మగు దైన్య మొంది కడుఁ గాసియ నొందితిరి... భార. ఉద్యో. ౪. ౨౦౦.

మత్తకోకిల. నాకనూభవుఁ డీతఁ డంచును నాన యించుక లేక యోమాత నీ విది యేమి సేఁ డిటు మాతృభావము మాని సంప్రీతిఁ గామినిభంగిఁ జేసెదు... భాగ. ౧౦[illegible]. ౧౨.

ఉ. సైనికు లెల్ల నంత కనుసన్నను నాఁడె పిలిపించి పొత్తికన్, నానయు నచ్చెలంబు మని నాఁటుకొనంగ...ఇంద్రుఁ డుపేంద్రునిఁ బాఁకె నుదతిన్. పారి. ౫. ౧౫.

౩. అవమానము.

చ. హితుఁ డని నమ్మఁగాఁ దగునె యాతనిఁ గార్యపు మాట లెట్టిదే, పతిదెసఁ [illegible] వాపునకుఁ బట్టుగ నెక్కొన తప్పు గాచు నున్నతు లగు మేదినీశులను నానగఁ బట్టుటగాక... భార. ఉద్యో. ౪. ౨౪౦.

ఆ. పట్టువడ్డ మున్ను పగిదిఁ బాంచాలభూమీశు కుండు దనకు నాఁ చేటు, గాక సమ్మతించి యేకాంతమునఁ బత్ని, యొక్కొ తెరువు గొల్వ నూరకుండె. భార. ఉద్యో. ౪. ౩౯౨.

జః నానగండ.

నానఁబ్రాలు[1]. వి. (√నాను[1].) ౧. నానబియ్యము.

గీ. ...ఆర్ద్రితండుల మ్రమసు నానఁబ్రాలు నాఁగ ...ఆం. భా. ౨. ౨౫౩.

౨. భక్ష్యవిశేషము.

వ. ...గంధతోయంబులు నుండ్రాలు నానఁబ్రాలు ననుములు మినుములు...కాశీ. ౪. ౧౭౫.

చ. ...కొబ్బెరపప్పు నానఁబ్రా, లటుకులు దేనె పండు లాడియంబులు పానక మారుఁగాయ లప్పడములు ... నీ కొసంగెదన్. చెన్న. ౩. ౪౩.

నానఁబ్రాలు[2]. వి. పచ్చిబియ్యము అమ్మచెట్టు. (చి. ని.)

నానగండ. విశే. (నాన+గండ[1].) సిగ్గుమాలిన వాఁడు, సంకోచము లేనివాఁడు.

ఉ. మచ్చటులాత్మఁబుట్టిన మనంబున సెంచక నానగండ దైన్యమిచ్చినవాఁడు చూచితిమి

నానవునింగ మభాయ తేజనా. పారి. ౫. ౨౦.

చ. చిలుకలు గమ్మఁదె మ్మెరలు శీకమయూఖుఁ
డు దేఁటు లాదిగాఁ గలనఁ బిల్తు సాధనని కా
యము వేలముపట్టు లంగనాకుల మటు గాన
దాని విడఁగొట్టక త్రుట్టెకఁ దొట్టు వీతరాగుల
మని విఱ్ఱవీఁగెదరు కొందఱు బోడలు నాన
గండలై. పాండు. ౫. ౧౮౨.

నానవైచు=నానుచు. స. క్రి. (√నాను[1].) నీళ్లతో చిరకాలము తడియఁబెట్టు. నానఁబెట్టు.

సీ. హిమజలంబులకంటె హిమజలంబుల నాన
వైచినబిసపల్లవములకంటె. పి. శకుం. ౪. ౧౪౬.

నానా. సం. అవ్య. (తెలుఁగున సిద్ధసమాసపూర్వపదముగానే యుండును.) ౧. అనేకము.

క. నానావిధపాకములు గ, నానాలుగఁ జేసి నాలు గై దట్టికలన్, బోనాముదొంతిఁ జేర్చిరి, నూనాస్త్రసమానుఁ డైనసుతు సిరి యాలున్. హర. ౨. ౧౨౨.

౨. వివిధము, పెక్కువిధములు కలది. ౩. వినారకము. (పే. ని. ఈయర్థమున తెనుఁగున ప్రయోగము లేదు.) వి. ఆ. స్త్రీ. ౧. సరస్వతి. ౨. జనని, తల్లి. ౩. కూఁతురు. (కే. ని.)

నానాంద్రము. సం. విణ. (అ. ఈ. అ.) ననాంద్రుసంబంధమైనది, ఆఁడుబిడ్డకు సంబంధించినది.

నానాంద్రుఁడు. సం. వి. అ. పుం. ననాందకొడుకు, ఆఁడుబిడ్డకొడుకు.

నాను[1]. అ. క్రి. (త. ననై.) ౧. తడియు, ఆర్ద్రి మగు.

క. నాని శిఖి వంటచెఱకుల, చే నఱ నవి వెండి వంటచెఱకులె యగుటం, బోనంబు ప్రజకు జక్కులఁ, బోనంబులె యయ్యెఁ బ్రొయ్యి పొగయమి వృష్టిన్. ఆము. ౪. ౧౨౬.

ఆ. తడిసె నానె ననఁగఁ దనరు శార్ద్రిం బయ్యె, ననుట కాఖ్య...ఆం. భా. ౩. ౯౧.

౨. చిరకాలము తడియు, చాలసేపు తడియు.

శా. దానత్యాగపత్రమై తొలుపత్త్రం బంబుధారన్ సదా, నానం దత్సితకీర్తిహంసి చను మింటన్...ఆము. ౨. ౪౨.

క. ఏ నిపుడు రాజ్యహీనుఁడనై నా ప్రియపత్నిఁ బాసి యశ్రులు దొరఁగన్, నానుచు నన్నాఁడఁ గడున్, దీనత లోఁ గొన్నవాహినీతీరగతిన్. భా. రా. కిష్కిం. ౩౯౩. చెన్న. ౫. ౯౨.

౩. ఇంకు, ఇగురు.

సీ. చిట్టాముదమ్మున శిర సంటి నును మేన నాన నూనియ నించి నలుఁగు పెట్టి. ఇందు. ౨. ౧౫.

నాలుక నువుగింజ నానదు=నోట రహస్యము దాఁగదు.

ద్వి. కడఁగి చెప్పినఁ గాని కడుపుబ్బు దిగదు, నాలుక నువుగింజ నానదు నాకు. ద్వి. హరిశ్చ. ఉ. ౧౦౩౪ పం.

ఇట్లే: నోటిలో నువ్వుగింజ నానదు.

(వ్యవ.) ఆఁడువారినోటిలో నువ్వుగింజ నానదు.

జః ననుఁబ్రాయి, ననుఁబ్రాయివడు, నానఁబ్రాలు[1], నానవైచు, నానుచు, నానుడి, నానుడువాన, నానుప్రఁగొండ, నానోడి, నాన్పు.

నాను[2]. వి. స్త్రీకంఠాభరణవిశేషము.

పి...కంఠభూషావిశేష. గీ. మూను గుతికంటు మెడమాలు నాను తీఁగె, కంటసరి కంటెయం చనఁ గాను...ఆం. భా. ౨. ౧౪౮.

జః నానుకోళ్లు, నానుక్రోవి, నానుచుట్టు.

నానుకోళ్లు. వి. బ. (√నాను[1].) స్త్రీకంఠాభరణవిశేషము.

(వ్యవ.) ఈదినములలో నానుకోళ్లు ధరించుటే వాడుక యయినది.

**నానుక్రోవి**=నానుచుట్టు. వి. (√నాను².) కంఠాభరణవిశేషము. (శ.ర.)

**నానుచు(న్చు)**=నాన్చు, నానవైచు. స. క్రి. (√నాను¹.) ౧. నానఁజేయు, ఆర్ద్రముచేయు, తడుపు.

ఉ. జ్ఞానము దెల్పి విష్ణుపదసారసవారికణాలి సంగముల్, నానిచి పాతకౌఘము లణంచి వికుంఠపురీపదంబు కైకానుకఁ జేసి కాచితివి... శేష. ౪. ౫౩.

౨. చాలకాలము కడచునట్లు చేయు.

(వ్యవ.)వాఁడావ్యవహారము నాన్చుచున్నాఁడు.

౩. ఎక్కువగా తడుపు.

చ. గొడుగుల గాలిఁ దూల్చి మతి క్రోలలతో డసి పాఱ నాన్చె చేడ్పడ జడి మేఘుఁడు ...ఆము. ౪. ౧౨౯.

**నానుచుట్టు**=నానుక్రోవి. (√నాను².)

సీ...సన్నకాటుకరేకలు సాభినామంబులు నానుచుట్లు. శుక. ౨. ౩౩౨.

**నానుడి**=నానోడి. వి. (నాను¹+నుడి.) -అందఱనోటను నానెడివాక్యము-౧.జనశ్రుతి,కింవదంతి.

సీ. నానోడి నాఁగను నానుడి నాఁగను సుబ్బు నాఁగను జనశ్రుతి దనర్చు. ఆం. భా. ౧. ౧౧౨.

౨. లోకోక్తి, సామెత.

క. వినుతయశా తగవునకుం, జని యొడినవరుఁడు ముదిసి చచ్చిన వగవం, బనిలేదు బుద్ధిమంతుల, కనునానుడి వినమె యింత యనసేమిటికిన్. భోజరా. ౩. ౬౩.

చ...వింటు లేదె యుంట గెలిచి రచ్చ గెల్వమనునానుడి నానుడీ నానుఁడీ చెవిన్. సారంగ. ౨. ౨౫.

**నానుడు**. విణ. (√నాను¹.) తడిసినది.

ఉదా:-నానుడునేల. (శ. ర.)

**నానుడుచాన**. వి. (√నానుడు.) పిసుకక పడియుం పొడిపొడిచినుకులవర్షము. (శ. ర.)

**నానుపుంగొండ**. వి. (√నాను¹.) హిమవత్పర్వతము.

వ...నానుపుంగొండరాచూలివాలికచూపునివాలికలు దనరె...కాశీ. ౪. ౧౨౪.

**నానుపుడు**. వి. (√నాను¹.) నాన్చుట.

(వ్యవ.) నీనానుపుడు మాని త్వరగా చెప్పుము.

విణ. తెమలకుండఁగ నుండునది.

(వ్యవ.) వానినానుపుడుపని చూడుము.

**నానుబొర**. వి.మాంసము కలకొమ్ము. (శ. ర.)

**నానోడి**=నానుడి. (√నాను¹.)

ఆం. భా. ౧. ౧౧౨.

**నాన్నె**. వి. జంతికలు ఒత్తుచున్నప్పుడు జాఱెడు పిండికాఁడ. (భక్ష్యవిశేషము అని శ. ర.)

మ. పొలఁతీ చూచితె తేఁటిఱెక్కరవగాడ్పుం బోదలేఁదాఁకుజో, కలచే జాఱుమెఱుంగుఁ బుప్పొడులరేకల్ మీఱె గుత్తంబులై, యలరుంబెజ్జపుమ్రానిజంతికలఁ జెన్నారన్ వసీదేవతాప్రకలకంఠీమణు లొత్తునాన్నెలగతిన్ గన్పించు గావింపుచున్. చంద్రా. ౪. ౨౯.

**నా(నుపు)న్పు**=నానుచు. స. క్రి. (√నాను¹.)

౧. నానఁజేయు, తడుపు.

క. వినుఁ బాపి నిముసమైనను, విను జీవము పట్టఁజాల విప్రోత్తమ నే, నన్నృతంబు పలుక నిజమిది, ననుఁ బ్రీతి వరింపు కరుణ నాన్పక మనంబున్. పూర్ణ. ౪. ౨౪౩.

గీ...మోవిఁ జెఱం గిడి యూఁగుచున్న, కంటు విగుడ విరు లాన్నమ్మకరణిఁ జల్లు, సవసవఁబుజలం బెజాణల మురువుఁ గొల్వు. ఆము. ౨.౭౧.

౨. క్రొత్తబట్టలు చలువచేయు. (బ్రౌ.)
(వ్యవ.) నానుపుటకు వేసినబట్టలు చాకలి యిం
కను తీసికొని రాలేదు.

నాప=నాగప,నాగప్ప. వి. నాగవల్లి.(చూ. నాప
సాని.)
జః నాపసాని.

నాపసాని=నాగపసాని. వి. (√నాప.) నాగవల్లి
నడపెడుము త్తెదువ.(వృద్ధసువాసిని అని చి.ని.)
సీ. వెలయ విద్యా లంది వీడుకోళ్లు గుడిచి నరఁ
బువుల్ ముడిచిననాపసాని. కళా. ౪.౧౩.
ఉ. అప్పుడు నాపసాని చతురశ్రకమండలి
హేమకుంభికల్, ముప్పదిమూఁటఁ జుట్టు
నిడి ముత్తియముల్ ఘటియించి తంతు లం,
దొప్పుగఁ జుట్టి దేవతతి సుత్కటభక్తిని
బాడుకొంచుఁ దాఁ, జెప్పినరీతి దంపతులఁ
జేయఁగఁ జేసెఁ దదర్హకృత్యముల్. భల్లా.
౪. ఆ. (చి.ని,శ.ర.)

నాపితశాల. సం. వి. అ. స్త్రీ. క్షౌరగృహము,
మంగలవానియిల్లు.

నాపితాయని. సం. వి. ఇ. పుం. మంగలవాని
కొడుకు.

నాపితుఁడు. సం. వి. అ. పుం. మంగలవాఁడు.

నాపిత్యము. సం. వి. అ. న. మంగలవృత్తి.

నాపిత్యుఁడు. సం.వి.అ.పుం.మంగలవానికొడుకు.

నాభకము. సం. వి. అ. పుం. పాఠ,చిఱుబొద్దికి.

నాభజావళి. వి. గీతవిశేషము.
క. క్రమ మొంద నాభజావళి, గమకముగా
శుద్ధసాళగములనుసంకీర్ణము లొగిఁ బుంభిం
పఁగ మంద్రము మధ్యము తార మత్యుదా
రత మీఱన్. సమీర. ౬. ౨౦౫.

నాభి. సం. వి. ఇ. పుం; ఇ, ఈ. స్త్రీ. బొడ్డు.
ఇ. స్త్రీ. మృగనాభి, కస్తూరి.(దీనికి సమాసాం
తమున కొన్నిచోట్ల 'అచ్' ప్రత్యయమువచ్చు
ను. ఉదా: అరవిందనాభుఁడు, పద్మనాభుఁడు,
కురంగనాభము మొ.)
ఇ. పుం. ౧. రథచక్రమధ్యరంధ్రము, బండి
కంటినడిమితూము. ౨. -వత్సములనుహింసించు
నది- వత్సనాభము, ఒకానొకవృక్షవిషము. ౩.
తిలకము, బొట్టు.
ఉ. ఆనవలా యలంతిపసుపాడి దుకూలముఁ
దాల్చి గుబ్బచక్కొ,గోనలఁ దావు లుప్పతిలఁ
గుంకుమ తేటలనిగ్గు దేఱఁగ,ప్రానన నాభిఁ
దీర్చి...ఆము. ౫. ౩౯.
౪. మధ్యభాగము, నడిమిచోటు. ౫. క్షత్త్రి
యుఁడు. ౬.శ్రేష్ఠుఁ డగురాజు, చక్రవర్తి.
విణ.ముఖ్యుఁడు,శ్రేష్ఠుఁడు.సం.రఘు.౧౮.౨౦.

నాభిక. సం. వి. అ. స్త్రీ. ౧. కటభి, మానేరుకి.
౨. బొడ్డువలె నుండురంధ్రము.

నాభికంటకము. సం. వి. అ. పుం. స్ఫీతనాభి,
ఉబ్బుబొడ్డు, ఎత్తైనబొడ్డు.

నాభిగుడకము. సం=నాభికంటకము. (త్రి. ని.)

నాభిగోళకము. సం=నాభికంటకము.

నాభిజుఁడు. సం. వి. అ. పుం - విష్ణునాభియందు
పుట్టినవాఁడు - బ్రహ్మ.

నాభినాడి. సం. వి. ఈ. స్త్రీ=నాభినాళము.

నాభినాళము. సం. వి. అ. న. పుట్టినశిశువునకు
త్రాడువలె బొడ్డు నంటియుండుసిర.

నాభిమూలము. సం. వి. అ. న. నాభిక్రిందిభా
గము, పొత్తికడుపు.

నాభిలుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) పెద్దబొడ్డు
కలవాఁడు, ఉబ్బుబొడ్డువాఁడు.

నాభివర్ధనము. సం. వి. అ. న. ౧. బొడ్డు పెరుఁ
గుట. ౨. శిశువులకు బొడ్డునాడిని ఛేదించుట.
౩. నాభికంటకము, ఉబ్బుబొడ్డు.

నాభీదము. సం.వి.అ.న.భారతవర్షము. (వై.ని.)

నాభీలము. సం. వి. అ. న. ౧. కష్టము. ౨. నాభికంటకము, ఊఱుకుబొడ్డు. ౩. వారస్త్రీవంక్షణము, వెలయాలిగజ్జ. ౪. కస్తూరీపరిమళము. (వై. ని.)

నామకరణము. సం. వి. అ. న. ౧. పేరు పెట్టుట. ౨. బిడ్డలకు పేరు పెట్టుటకు చేయు నొకసంస్కారవిశేషము.

నామకర్మము. సం. వి. న్. న =నామకరణము.

నామకుఁడు. సం. విణ. (అ. మికా. అ.) ౧. వంగువాఁడు. ౨. వంచువాఁడు. ౩. నమస్కరించువాఁడు.

నామగుంట. వి. (నామము+గుంట.) గళిగర్తము. (శ.ర.)

నామధాతువు. సం. వి. ఉ. పుం. (వ్యాక.) నామవాచకములనుండి పుట్టినధాతువు. (ఉదా: పుత్రకామ్య, పల్లవించు, కరుణించు మొ.)

నామధారకుఁడు. సం. విణ. (అ. రికా. అ.) ౧. పేరు ధరించువాఁడు. ౨. పేరుమాత్రము కలవాఁడు, సార్థకత లేనివాఁడు.

నామధారి. సం. విణ. (న్. ణీ. న్.)=నామధారకుఁడు.

నామధేయము. సం. వి. అ. న. నామము, పేరు.

నామనిర్దేశము. సం. వి. అ. పుం. ౧. పేరుపెట్టుట. ౨. పేరితో చెప్పుట.

నామనీయుఁడు. సం=నమ్యుఁడు.

నామమడఁచు. మి. స. క్రి. పేరుమాపు, చంపు; నశింపఁజేయు.

ఆ... వేఱ యొక్కదొడ్డవిల్లు రయము, మెఱయఁ గొని యతండు ! మెఱుఁగులు గిఱికొను, నారసమున వాని నామమడఁచె. భార. ద్రో. ౪. ౧౨౪. సౌప్తి. ౨. ౩౨.

గీ. ఏడునూఱురథంబుల నేపుమాపి, నకులుఁ దప్పాడు మున్నాటి నామమడఁచె, నతనియనుజుండు... భార. విరా. ౩. ౭౧౩.

నామమణ(డ)ఁగు. మి. అ. క్రి. చచ్చు, మరణించు.

గీ. నీసహోదరి నని చెప్ప నీమతోడ, నుఱక నన్నాకఁ డిమ్మెయిఁ బఱచి నామమణఁగ కున్నాఁడు నేఁడు... భా. రా. అర. ౧. ౨౩౩.

నామమాత్రము. సం. విణ. (అ. ఆ. అ.) సంజ్ఞామాత్రధారి, పేరుమాత్రము కలది.

శ్లో. యథా కాకయవాః ప్రోక్తాః యథారణ్యభవా స్తిలాః, నామమాత్రా న సిద్ధ్యై హి ధనహీనా స్తథా నరాః. సం. పంచ. ౨. ౫౩.

వి. అ. న. వట్టిపేరు, పేరుమాత్రము.

నామమాల. సం. వి. ఆ. స్త్రీ. పేర్లపట్టిక, పదములపట్టిక.

నామము. వి. (క.నామ.త. నామం.) తిలకము, లలాటమున పెట్టుకొనుబొట్టు.

గీ. బవిరలును గొప్పవలయును బడఁతి రొమ్ము, దిద్దెఁ గస్తురినామంబు దీర్చె నొర్తు. యయా. ౪. ౯౦.

గీ. మంచికపురంపుగీఱునామములు దీర్చి, యలఘుతర మైనమణిభూష లలవరించి. చంద్రా. ౪. ౨౬౨. శుక. ౧. ౧౩.

సీ. నిటలభాగమునందు నిడుసోఁగతీరుగా మల్లెపూమొగ్గనామంబు దీర్చి. వైజ. ౨. ౪౭.

జ: నామగుంట, నామాలకేతఁడు.

నామము. సం. వి. న్. న. -వస్తువును తెలుపునది- ౧. నామధేయము, పెట్టినపేరు. (రామకృష్ణాది.) ౨. వాచకము, ఒకవస్తువునకు జనులు

వాడుకొను పేరు. 3. (వ్యాక.) ప్రాతిపదికము.
4. జలము, నీరు. (కే. ని.)

నామముద్ర. సం. వి. ఆ. స్త్రీ. పేరుచెక్కిన యుంగరము, ముద్దుటుంగరము.

నామయత్. సం=నమయత్.

నామరులు. వి. (నాము² + మరులు.) పాచికలు.
చ. బలితపుఁబద్మజాండ మనుపాళి ఘటించ చటు మీఁదఁ బడ్డజీవు లనెడుసారె లుంచి రహి పుట్టఁగ సమిహి రెండునామముల్, కలిగిన నామరుల్గాని యలౌకికచిత్రదురోదరంబుగా, సల రమతోడ నాడుకమలాక్షుఁడు మైకొనెఁ గంటె జూదముల్. చమ. ౧.౯౦.

నామవాచకము. సం. విణ. (అ. చికా. అ.) (వ్యాక.) నామమును చెప్పునది. (శబ్దము.) వి.అ.న. సంజ్ఞావాచకము, ఒకదాని పేరుచెప్పు శబ్దము.

నామశేషము. సం. విణ. (అ. ఆ. అ.) - పేరుమాత్రము మిగిలినది - మృతము, చచ్చినది.

నామసంగ్రహము. సం. వి. అ. పుం. పేర్ల పట్టిక, పదములపట్టిక; పదసమూహము.

నామాంకము. సం. విణ. (అ. ఆ. అ.) నామము గుఱుతుగా కలది. గుఱుతుగా పేరు వేయఁబడినది. (పాత్రాది.)
ఇట్లే: నామాంకితము.

నామాపరాధము. సం. వి. అ. పుం. భగవదాదులనామములను దూషించుట అనునపరాధము.

నామానుశాసనము. సం. వి. అ. న - శబ్దములను నిర్ణయించునది - నిఘంటువు.

నామాలకేతఁడు. వి. (√నామము.) పక్షివిశేషము.
సీ. నామాలకేతఁడు నల్లాసకప్పేటు కాకి యంబటిజోరిగాఁడు మూఁగ. ఆ. ఆది ధ్యైన పఱు లతఁడు దీర్చు. హంస. 3. ౧౨.

నామిత. సం=నమిత.

నామితము. సం=నమితము.

నాము[1]. వి.(దీనికి వ్యుత్పత్తియందు 'నాఁప' అనురూప మేర్పడును. - త. నాంబు.) ౧. జొన్నలోనగు వానికొయ్యగాలున చిగురించిన మొలక. (దీనిని పశువులు మేసినచో మృతి నొందును అని శ. ర. లేతగా నుండుజొన్నపైరు.దీనిని మేసిన పశువులకు ఉంగిడిరోగము తగులును అని బ్రౌ.)
ద్వి. కుమతులై కర్మశాస్త్రముల వెంబడిని, బ్రమసియో యిలఁ గుక్కపాలు ద్రాగుటనో, మతి నాము మేసియో మతిమాలినట్టియ అవపాఱులమాట లవనీశ వినకు. బస. పు. ౫. ౧౫౫ పం.
క. సన్నపుఁదలయేపున మయి, యన్నకొనుచు నాము దిన్నయట్లై రాఁగా,ఖిన్నుఁడపై పురికేఁగితిఁ, దిన్నఁదనం బుడిగి కొన్నిదివియలు వెలుఁగన్. మను చ. ౫. ౨౨. (నాముదిన్నయట్లై- అనగా నాము మేసినపసరమువలెనై అని భావము.)
౨. గింజ లేనివరిమొ. వానిఎన్ను. (బ్రౌ.)
జ: నాఁపచేను.

నాము[2]. వి. వడ్రంగి కత్తికానుతో కఱ్ఱపై నూటిగా తీర్చురేఖ. (చూ. నాములుతీయు.)
జ: నాఁపటాయి, నామరులు, నాములుతీయు.

నాములుతీయు. స. క్రి. (నాము² + తీయు.) వడ్రంగి బల్లమొ. వానిపై గీఁత లేర్పఱచు. (జవకట్టు అని బ్రౌ.)
(వ్యవ.) నాములు తీసినకమ్ము లందముగా నుండును.

నామ్యమానము. సం=నమ్యమానము.

నామ్యము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. వంపఁ

క. నీపాదముఁ దల మోచిన, నాపే రిలనుంచు చెంచునాయఁ డటంచున్, నాపల్లె మృగనిదానం, బాపక్కణ మేలదుఁ గొండయడవుల దండన్. రా. వి. ౩. ౩౮.

ఉ. గొల్లలనాయఁడై పరఁగుకుంభకుమందన దేమి వింతయో, కల్లరిగిబ్బ లేదు పొడగట్టి పజంగదు గాసిఁ బెట్టుచున్. నీలా. ౨. ౫౪.

నాయకము. సం. వి. అ. పుం. హారమునడిమి రత్నము, పతకము.

నాయకుఁడు. సం. విశే. (అ. యికా. అ.) ౧. ప్రాపకుఁడు, పొందించువాఁడు. ౨. నడపువాఁడు. ౩. ప్రధానుఁడు, ముఖ్యుఁడు. ౪. శ్రేష్ఠుఁడు. వి. అ. పుం. ౧. భర్త, ప్రియుఁడు. ౨. ప్రభువు, అధిపతి. ౩. (అలం.) సాధారణనాయకుఁడు. (వీరు నలువురు. ధీరోదాత్తుఁడు, ధీరోద్ధతుఁడు, ధీరలలితుఁడు, ధీరశాంతుఁడు.) ౪. శృంగారరసాలంబనపురుషుఁడు. (వీరు మువ్వురు. పతి, ఉపపతి, వైశికుఁడు. అందు పతి అనుకూలుఁడు, దక్షిణుఁడు, ధృష్టుఁడు, శఠుఁడు అని నలుతెఱఁగులవాఁడు.) ౫. సేనాధిపతి.

నాయన. వి. (నా[1] + అన[1].) ౧. జనకుఁడు, తండ్రి.

సీ. అబ్బ నాయన యయ్య యనఁ దండ్రి యన నప్ప యన జనకాఖ్య లౌ నగనివేళ. ఆం. సం. మాన. ౩.

౨. ఇది వాత్సల్యసంబోధనమందును సంబోధ్యశబ్దమునకు మాఱుగాను ప్రయోగింపఁబడును. (శ. ర.)

నాయము. విశే. (సం. న్యాయః. ప్రా. నా ఓ. క. నాయ.) న్యాయయుక్తమైనది; యుక్తము.

(వ్యవ.) వానిమాట నాయము కాదు.

వి. ధర్మము, పాడి.

గీ. మాకు నాయంబె నీతోడ మాటలాడ. వైష. ౪. ౫౯.

గీ. అమరపతి నేఁడు నీదుసఖ్యంబుఁ గోరి, నన్నుఁ బంపిన వచ్చితి నాయమగుట, నన్నదమ్ములకేల వృథావవఁబు. దశా. ౨. ౧౦౮. రసిక. ౬. ౧౦౯.

నాయము. సం. వి. అ. పుం. ౧. నడపుట. ౨. పొందించుట. ౩. నయము, నీతి. ౪. ఉపాయము.

నాయి. వి. (క. నాయి. త. నాయ్.) కుక్క.

గీ. ...దొంతులు సేరి నాయి, దోర్ప నేర్చుఁగాకది యేమి సేర్ప నేర్చు. కు. సం. ౧. ౨౯. (ప్రయోగాంతరము కానరాలేదు.)

నాయి. సం. వి. ఈ. స్త్రీ. దిక్కు. (కే. ని.)

నాయి(యు)ండు=నాయఁడు.

(శూద్రులనామాంతమున నుండుబిరుదు.)

వ... ఎఱ్ఱంగొంమి నాయిండును వారిమఱంది నూరపనాయిండును...ద. శా. ౪. ౯౩౩.

వ...భాస్కరదేవని ప్రధాని(పె)న్నమనాయుండు...ద. శా. ౪. ౯౮౪.

వ...గజసాహిణిభాస్కరదేవని ప్రధానిపేరు(మా)ండినాయుండు...ద. శా. ౪. ౯౮౯.

నాయిక. సం. వి. ఆ. స్త్రీ. ౧. భార్య. ౨. రాణి, ప్రభ్వి. ౩. శృంగారరసాలంబనస్త్రీ. (ఈమె స్వీయ, పరకీయ, సామాన్య అని ముత్తెఱఁగులది. అష్టవిధనాయికలు: స్వాధీనపతిక, వాసకసజ్జిక, విరహోత్కంఠిత, విప్రలబ్ధ, ఖండిత, కలహాంతరిత, ప్రోషితభర్తృక, అభిసారిక.) ౪. ఒక దినుసుకస్తూరి.

నార. వి. (క. నారు. త. నార్. తు. నారు.) ౧. (జనుము మొ. వాని) తడప.

క. ఆరయఁ బువ్వులకతమున, నారలు తలకెక్కునట్లు నానావిధసం, సారులు శివభక్తి మెయిన్, వారక యెప్పుడుఁ ద్రిలోకవంద్యులు గారే. శివ. సా. ౧౯౩.

సీ. నేలయు నింగియుఁ దాలము ల్వాయించ...
రా నారఁ గొన...కు. సం. ౮. ౧౩౫.

క...పనికిఁ దలుగు లమరించుచుకై, నారలు
గావలె నని...శుక. ౨. ౩౩౮.

౨. చెట్ల పైచర్మము.

క. వీరుద్ధుర్మిథునమేళన,కై రతిపతి యేయ
దుస్సి హరితద్యుతిఁ బై,నా రెగయఁ బొటమ
రించిన,నారసముల మొన లనంగ నగ లవి
మించెన్. ఆము. ౪. ౧౧౫.

క. నారలె చీరలు తులసీ,హారంబులె భూషణ
ములు ననవరతసదా,చారమె జప మూర్వీ
బృం,దారకులకుఁ గాక రిత్తదంభము లేలా.
కుచేల. ౨. ౪౩.

౩. వల్కలము, చెట్ల తడపలతో నేయఁబడిన
వస్త్రము.

ఆ. పరఁగు నార యనిన వల్కలసంజ్ఞ యై...
ఆం. భా. ౧. ౩౧.

ఉ. నారలు గట్టి కూర లశనంబుగ నుగ్రవనం
బులోఁ దపో,భారమునం గృశుం డయిన
బ్రాహ్మణుఁడు...భార. అర. ౨.౩౭౬.

ఉ. నారలు పట్టులాకులు జనంబులు తాపసు
లట్లు కట్టుదుర్. హరి. ఉ. ౩. ౬౪.

జనుపనార=జనుమునుండి తీసినతడపలు.

మ. మెంగ మెల్లన్ వలిపూర్ణ మైనపుఫున్
మూరంబునన్ జన్పనా,రగతిం బాండిమ
యల్లుకొన్నపుడు...మల్లభూ. వై. ౮.

జః నారచీర, నారజెల్ల,నారదబ్బ, నారపాము,
నారమడి.

నారంగక్షీరిణి. సం. వి. ఈ. స్త్రీ. క్షీరికా
భేదము. (నారింజతొనలు వ్రాగిన నేతిలో వేఁచి
దానిలో పటికపంచదార వేసి పక్వమయినతరు
వాత దింపి సగముకాఁగినపాలు కొంచెము పోసి
సుగంధద్రవ్యములతో పరిమళింపఁజేయబడినది.

ఇది వాతపిత్తహరము, పుష్టింపుకరము. వాచ.)

నారంగము. సం. వి. అ. పుం. నారింజకాయ. స.
౧. గర్జరము, ముల్లంగి. ౨. పిప్పలీరసము.
౩. నారింజపండు.

నారంగుఁడు. సం. వి. అ. పుం. ౧. విటుఁడు.
౨. కవలపిల్లలలో నొకఁడు.

నారకము. సం. విణ. (అ.ఈ.అ) నరకసంబంధ
మైనది. వి. అ. పుం. నరకము.

నారకి. సం. విణ. (న్. ణీ. న్)=నారకికుఁడు.

నారకికుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) నరకము
నం దుండువాఁడు, నరక మనుభవించువాఁడు.

నారకీటుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) మొదట
ఆశ కలిగించి తుదకు ఆశాభంగము చేయువాఁ
డు, మోసగాఁడు.

నారకీయము. సం. విణ. (అ. ఆ. అ.) నరక
సంబంధి.

నారకుఁడు. సం. వి. అ. పుం. నరకవాసి.

నారచీర. వి.(నార+చీర.) నారతో నేసినబట్ట.

సీ. రంగారుబంగారుచెంగావులు ధరించుకృం
గారవతి నారచీర లూనె. ఉ. రా. ౬.
౩౭౦.

నారజీవనము. సం. వి. అ. న. - మనుష్యులకు
జీవనాధారము- బంగారు. (విల్యమ్సు.)

నారజెల్ల. వి.(√నార.) మత్స్యభేదము.

ఆ. చీరచింపు జెల్ల నారజెల్ల...బంటువారి కెల్లఁ
బంచి యిచ్చె. ద్వా. ౧. ౨౪౦.

నారట్టము. సం. వి.అ.పుం. చీటికావేల. (శ.ర.)

నారణపక్షి. వి. (సం. నారాయణపక్షి.) పక్షి
విశేషము. (శ. ర.)

నారదబ్బ. వి. (√నార) నారంగముకాయ. (కుక్క
దిబ్బదబ్బ అని శ.ర.)

సీ... నారద బ్బనఁగ నారంగాభిధాన మై ప్రబ లుచుండు. ఆం. భా. ౨. ౪౬.

నారదము. సం. వి. అ. పుం. ౧. నారంగము, నారింజ.

రగడ. తనుమధ్య దగ నారదమున నీరఖగము లు, ఘనకురంటకకంటకములు చాన ఖరము లు. ఉ. రా. ౬. ౬౧.

ద్వి... మొల్లలు నారదంబులు గొజ్జఁగలును. ద్వి. పరమ. ౪. ౨౬౫.

ద్వి. నల్లనియరఁటులు నారికేళములు, నారద పాటలినాగతింత్రిణులు. ద్వి. నల. ౧. ౧౨.

౨. సైంధవహిమాలయములనడిమికొండ.

వ. ఇవ్విధంబున వసుదేవనందనుండు నేమును ...నారదంబు పరిభ్రమించి...హిమాచలం బెక్కి హేమకూటంబు ద్రొక్కి నిషధం బ తిక్రమించి నిమిషంబున. ఉ. హరి. ౨. ౩౭.

నారదీయము. సం. వి. అ. న. అష్టాదశపురాణము లలో నొకటి, నారదునకు సనకాదు లుపదే శించినట్లు వ్యాసుఁడురచించినమహాపురాణము.

నారదుఁడు. సం. వి. అ. పుం. -జ్ఞానము నిచ్చు వాఁడు- ఒకానొక దేవర్షి.

నారపాఱు. అ. క్రి. (√నార.) -భయాదులచే- కట్టుబట్ట తొలఁగు.

పంచచామరము. అలంతులయ్య కూర్మమస్త కాదు లైనబోదు ల,బ్బలారి వెన్నుమాపి నారపాచినాఁడ కాని నేఁ,డలంఘ్యబాహు శక్తిఁ దావశాజిలోన నంచుఁ బిచ్చలించి తెల్పెఁ దక్ష్కభల్ వచఃప్రయోగచాతు రిన్. కళా. ౨. ౧౨౬.

నారమడి. వి. (√నార.) నారతో నేసినబట్ట. (శ. ర.)

ఇట్లే: నారగుడ్డ, నారబట్ట మొ.

నారము. సం. విశే. (అ. ఈ. అ.) నరసంబంధ మైనది. వి. అ. పుం. ౧. జలము. ౨. అప్పు డు పుట్టినదూడ, తర్ణకము. (మే. ని.) న. ౧. నరులసమూహము. ౨. జ్ఞానము.

నారళ్లు. వి. బ. ధాన్యభేదము.

వ... వెన్నముద్దలు దాళువాలు నారళ్లు రామ బాణాలు... ప్రబంధ. ౧౧౨.

నారసము. వి. (సం. నారాచః. ప్రా. నారాచో.)

౧. బాణము, శరము.

సీ. రారాజు సైదునారసముల నొప్పించె... భార. భీష్మ. ౨. ౩౭.

గీ. పాళెము ల్వెట్టి క్రొంకులు బ్రద్దపరులుఁ గత్తి గొంతంబు లాడిసెల్లెఁ గత్తళములు, నారస ములును విండులు నగరిలోనఁ బెట్టి...ఉ. హరి. ౨. ౯౨.

క. మండెడుబలునారసమున, గుండియ వగు లంగ నేసి గూల్చితి దీనిన్. హర. ౭. ౫౩.

౨. బాణవిశేషము. (అచ్చయినుపబాణము అని శ. ర.)

వ... శిరంబుల శిరంబులు ద్రుంచియు...నార సంబుల నీరసంబులు సేసియు...విక్ర. ౪. ౯౭.

చ... అయ్యమరవిరోధియాతనిహాయంబులనూ తుని నాలు గేనుబాణములఁ గలంచి వేయి బలునారసముల్ మెయి నాఁట నేసి... ఉ. రా. ౩. ౩౫౪.

సీ... నారాచ మొప్పును నారస మన. ఆం. భా. ౨. ౨౧౩.

౩. ఇనుపయూఁచ.

(వ్యవ.) ఈకిటికీకి పది నారసము లున్నవి.

౪. చోరసాధనవిశేషము.

చ... క్రొంకి నారసము నాదిగఁ గల్గినసాధనంబు లన్నియుఁ సుకుమారుఁజేసి కొని నేర్పున నేఁ గితి మ్రుచ్చుపొద్దునన్. దశకు. ౯. ౩౭.

నారసింహము. సం. విణ. (అ. ఈ. అ.) నరసింహసంబంధమైనది. వి. అ. పుం. నరసింహావతారమును గుఱించినపురాణము.

నారసింహుఁడు. సం. వి. అ. పుం. నరసింహావతారము ధరించినవిష్ణువు.

నారాచము. సం. వి. అ. పుం- నరసమూహమును ఆచమించునది- ౧. బాణము. ౨. ఇనుపబాణము. ౩. -తాటియాకులమీఁద వ్రాయుటకు సాధనమయి బాణమువలె నుండునది-గంటము. ౪. నీటియేనుఁగు. ౫. దుర్దినము.

నారాచి. సం. వి. ఈ. స్త్రీ. ఏషణి, అగసాలెవానియినుపత్రాసు.

నారాజి=నరాజి. వి. (సం. నారాచః.) ఖడ్గము, కత్తి.

శా. ఘోరాజిం దనతేజిఁ దోలి విమతక్షోణీతలాధీశులకా, నారాజిం దెగటార్చి వీరభటుసన్నాహంబుతోఁ జేరు...బసు. ౧.౫౧.

గీ. తళుకుఁబైతాణిసింగిణుల్ తెరకసములు, రకపుఁజికిలిసిరాజినారాజిఁ బన్ని, పతియెదుట నిల్చె సాహిణి...చంద్రా. ౨. ౪౯.

శా...నేజాలు న్నారాజుల్ గైకొని కోటలోఁ గొలుచునారాజుల్ తదంగంబు లుగ్రాజింజెక్కులు సేయుచో మరలె గంధానేకపంబార్భటిక్. రా. వి. ౫. ౨౧.

నారాటకావుళంబు. వి. (క. నారాట.)సంగీతమందలిధ్వనివిశేషము.

ద్వి. ఘనతరనారాటకావుళం బెడు,ధ్వని గూడ...బస. పు. ౩. ౯౩౦.

నారాయణగౌళ. సం. వి. ఆ. స్త్రీ. ముప్పదిరెండునపుంసకరాగములలో నొకటి.

సీ.గౌళ నారాయణగౌళ వసంతవరాళి పున్నాగవరాళి శంకరాభరణమును ... ప్రబంధ. ౯౪. హంస. ౫. ౧౨౪.

నారాయణపక్షి. సం. వి. ఇ. పుం. పక్షివిశేషము.

నారాయణప్రియము. సం. వి. అ. న. హరిచందనము, పచ్చచందనము.

నారాయణబలి. సం. వి. ఇ. పుం. దుర్మరణము నొందినవారిని ఉత్తరక్రియలకు యోగ్యులుగా చేయుటకై నారాయణాదిపంచదేవతల నుద్దేశించి యిచ్చుబలిభేదము.

నారాయణము. సం. వి. అ. న. ౧. ఒకానొకతైలము. ౨. తైత్తిరీయోపనిషత్తు లైదింటిలో కడపటిది.

నారాయణి. సం. వి. ఈ. స్త్రీ. ౧. లక్ష్మి. ౨. దుర్గ. ౩. శక్తి. ౪. బుశ్యప్రోక్త, చల్లగడ్డ. ౫. ఒకానొకస్త్రీరాగము.

గీ. కన్నడయు జాయయును గౌళ కను నపూర్వమైనభల్లాతకియును నారాయణియును, గ్రమత నిరువదినాల్గుస్త్రీరాగములును. ప్రబంధ. ౯౫. హంస. ౫. ౧౨౩.

నారాయణీయము. సం. విణ. (అ. ఈ. అ.) నారాయణసంబంధమైనది.

నారాయణుఁడు. సం. వి. అ. పుం. -నారములు -జలములు- అయనముగా కలవాఁడు; నార -జ్ఞానమునకు- అయనము-౧. విష్ణువు.

క. నారము లనఁగా జలముల,పే రయనం బనఁగ నెలవు ప్రీతిగ నాకుక్, నారము లయనం బగుటను, నారాయణుఁ డండ్రు జనులు నన్నుఁ గిరీటీ. భార. శాం. ౬. ౪౨౧.

౨. నారాయణఋషి.(నరనారాయణులలో నొకఁడు.)

నారాశంసము. సం. వి. అ. పుం. ౧. పితృదేవతలసోమపానార్థ మగుచమసపాత్రము. ౨-మనుష్యులను స్తుతించునది- మంత్రభేదము. ౩. అగ్ని, విష్ణు. (శే. వి.)

నారాశంసులు. సం. వి. అ. పుం. బ. పితృదేవతలు.

నారి. వి. (సం. నాడీ. ప్రా. నాళీ, నాడీ. క. త. నారి.) ౧. వింటియల్లెత్రాడు, మౌర్వి.

గీ. వింట్రికిని నారి యై పెక్కువిధములందు, భూతభర్త భజించు నీభుజగవిభుఁడు. నైష. ౫. ౭౬.

గీ. అపుడు విల్లెక్కుపెట్టి వాలారుదూపు, నారిఁ గూర్చి నిశాచరనారిఁ గూర్చి, కాఁడ నేసె తదీయవక్షస్స్థలంబు,రాఘవుఁ డమోఘ తరశరలాఘవుండు. రామా. ౪. ౩౩.

గీ. కదలిదొన పాఁపనారియుఁ బుడమి తేరు... పూని కడిమి, మెఱయఁ దిగప్రోల్లు గూల్చిన మేటివేల్పు. నీలా. ౨. ౧౨౦.

గీ. అల్లె యరి నారి గొనయ మం చనఁగ వెలయు, మౌర్వి... ఆం. భా. ౨. ౨౧౧.

౨. నరము. (చూ. నారికుఱుపు.)

జః నారికాయ, నారికుఱుపు, నారిపుండు.

నారి. సం. వి. ఈ. స్త్రీ. ౧. మనుష్యస్త్రీ, మానుషి, ఆఁడుది. ౨. భార్య.

సీ. తా నారి యై యుండఁగా నజుం డాత్మజఁ గవిసె భారతి నేర్పుకలిమి యెంత. కు.సం. ౪. ౯౫.

నారింజ(జా.) వి. (సం. నారంగః. ప్రా. ణారింగ.) ౧. నారంగము. (శ. ర.) ౨. కిచ్చిలి, ఒకజాతి నారింజకాయ. (చి. ని.)

నారికడము=నారికేడము,నాల్కడము. వి. (సం. నారికేళ.) కొబ్బరచెట్టు; కొబ్బరకాయ.

ద్వి. కడు నొప్పుమర్వారకఫలము ల్నారి, కడ ప్రఁగాయలు మున్నుగాఁ గలయట్టి. ప్రభు లిం. (చి. ని.)

రగడ. నారి నారికడంపుఁబూలెలు నాకు నాకు లవృత్తి నొసఁగవు. కళా. ౩. ౧౪౯.

సీ. కాంస్యపాత్రను నారికడపునీరును గాజు రాగులయందుఁ దక్రంబు భగ్న,పూగఫలంబులు... భల్లా. ౩ అ. (చి. ని.)

నారికాయ. వి. (నారి+కాయ.) అల్లెత్రాటితాఁకుడువలన చేతులయందు కలిగెడుకాయ, కిణము. (శ. ర.)

నారికుఱుపు. వి. (√నారి.) నాడీవ్రణము, నరముమీఁద వేసెడికుఱుపు. (శ. ర, చి. ని.)

నారికేడము=నారికడము.

(కొబ్బరచెట్టు.)

చ...అరుణంపుబొండ్లములనారికేడంబులు వజ్రకుట్టిమం, బగుపథముం జెలంగు భవనాహృత శేషితరత్నరక్షక, భృగతరుసంతతిం బ్రథమభార్యఁ బురిం గిర వుంచె వార్ధి నాఁక. ఆము. ౧. ౫౪.

సీ. కలిగొట్లు పొన్నలు కడుములు వెలఁగలు గోరంట లుసిరిక ల్నారికేడములు...అచ్చ. రా. సుం. ౨౫.

రగడ. నారికేడంబులు నారి కేడంబులు... ప్రబంధ. ౨౫౩.

నారికేళక్షీరి. సం. వి. ఈ. స్త్రీ. ఒకవిధ మగు క్షీరిక. (అవుపాలలో క్షీరినకొబ్బర పంచదార అవునెయ్యి వేసి మందాగ్నితో పక్వము చేసి భుజించినచో పుష్టిని ఇంద్రియవృద్ధిని కలిగించును. రక్తపిత్తవాతములను హరించును. కొంచెము గురుత్వము చేయును-వాచ.)

నారికేళము. సం. వి. అ. పుం. కొబ్బరచెట్టు.

నారిపుండు. వి. దే. (నారి+పుండు.) నారికుఱుపు.

గీ... నారిపుంటిపయిని బదిదినములు కట్ట వడిఁ దొలంగు. (చి. కి. చి. ని.)

నారీతరంగకుఁడు. సం. వి. అ. పుం. జారుఁడు,

నారీదూషణము. సం. వి. అ. న. ౧. స్త్రీలను దూషించుట. ౨. స్త్రీలకుదోషహేతువు.

(శ్లో. పానం దుర్జనసంసర్గః పత్యాచ విరహోఽటనమ్, స్వప్నోఽన్యగృహవాసశ్చ నారీణాం దూషణాని షట్. మను.)

నారీష్టః సం. వి. ఆ. స్త్రీ. మల్లిక, మల్లెపూ.

నారు. స. క్రి. (√అను. అనుధాతువుయొక్క వ్యతిరేక ప్రథమమధ్యమపురుష బహువచనరూపము.) అనరు.

క. విదురుం డొక్కఁడు దక్కఁగ, సదస్యు లెవ్వరును ధర్మసంశయ మిది గ్రూఁడదు నార యతనిశీలము, కుదు రీలోకమున కింత కొఱ దలఁపంగన్. భార. ఉద్యో. ౩. ౧౯౦.

వసంతతిలక. ఈబాలు నెత్తికొని యింటికిఁ జన్న నన్నుఁ, నాబంధు లందఱు మనంబున నేమి నా ర్వెట్లు... భార. ఆది. ౫. ౨౯.

నారుచు(ర్చు). స. క్రి. నాడఁజేయు.(శ.ర.)

గీ... మరుఁడు, వెడవెడన నార్చ నౌగిలి కజ్జడిని గృహులు. ఆము. ౪. ౧౨౪. (శ. ర. పా. 'వెడవెడనె యార్చ' అని వావిళ్ల ప్రతి.పా. 'వెడవెడనె యార్చ' అని వేదం. పా.)

నారువ. వి. వృక్షవిశేషము.

సీ. నారువ సురపొన్న వారిజమును బొన్న నెల్లి మూలుగుబిల్లు నెమిలియడుగు. హంస. ౪. ౧౧.

నాఱు. వి. (తె. నాఱు.) ౧. (మొక్కలు మొలచుటకు చల్లు) విత్తులు.

(వ్యవ.) వంగనాఱు చల్లిరి, బంతినాఱు పోసిరి.

౨. (నాఁటుటకై విత్తనములు ప్రత్యేకస్థలమున ఒత్తుగా చల్లి మొలపించు) మొలకలు.

సీ. అళిమలంబులకప్పు గలయంతయును బుచ్చి నాఱు వోసినభంగి నవక మెక్కెఁ. భార. విరా. ౨. ౫౩.

ఉ...త త్తనూవల్లికతోన మైఁ బులకవర్గము నా ముఁడు నాఱు వోయఁగన్. నిర్వ. ౭. ౩౧.

సీ. నా అటంచనఁగను మీఱు నాపహ్నాంకురావలి...ఆం. భా. ౨. ౩౫.

సా: నాఱుపోసినవాఁడు నీరుపోయకమానఁడు. (పుట్టించినదేవుఁడుఁ పోషింపక మానఁడు.)

నార్పత్యము. సం. విశే. (అ. ఆ. అ.) నృపతిసంబంధ మైనది. వి. అ. న. నృపతిధర్మము, రాజత్వము.

నార్యంగము. సం. వి. అ. పుం. నారంగము, నారింజపూ.

నాలంబి. సం. వి. ఈ. స్త్రీ. శివునివీణ.(వాచ.)

నాలవకులము. వి. (√నాలుగు.) చతుర్థకులము, శూద్రజాతి.

సీ. కోయిల నాలవకులముదాయాదుల కెలుఁగెత్తి జిగురాకువేల రొమ్ముఁగు. కువల. ౩. ౯౬.

నాలవకులమువాఁడు=శూద్రుఁడు.

సీ. శూద్రనామంబులు శోభిలు నాలవకులము వార లని గాఁపు లని పల్కు. ఆం. భా. ౨. ౨౭౨.

ఇట్లే: నాలవజాతివాఁడు.

శా. దేవా నాలవజాతివాఁడ నిను వర్ధింగొల్వఁగా వచ్చితిన్. భార. విరా. ౧. ౨౧౫.

నాలవతొలిపలుకు. వి. (√నాలుగు.) అథర్వణవేదము.

సీ. ఆవాలు పాలు మే లగుతాడిపుడుకలు నెలవి నాలవతొలిపలుకునుదువ్వ, లోలిమై గొడుగుచు... వేలుచుటయు నందుఁ గల్గిరిసత్తి యొకర్తు వోడమి. అచ్చ. రా. యు. ౩౨౩.

నాలవవాఁడు. విశే. (√నాలుగు.) ౧. నాల్గవవాఁడు, చతుర్థుఁడు.

ఉ. పాలితసత్యధర్మ మగు బ్రాహ్మణులంబున

బుట్టినట్టినక్, నాలవవానిఁ జేయఁ దగునా
యనఁబోకు దిగీశ్వరాళిలో, నాలవవాఁడవై
బహుధనసుఁడవై మను మఁచు మన్ననిక్,
లాలన చేసి ధాత యొకనవ్యవిమాన మొసం
గి పెండియుక్. ఉ. రా. ౧. ౩౧౮.

౨. నాలుగవతరమువాఁడు.

ద్వి. బ్రహ్మనాలవవాఁడు పరమసాహసుఁడు,బ్ర
హ్మచే వరములు వడసినవాఁడు. రం. రా.
బాల. ౨౩ పా. ౪ పం. (బ్రహ్మకొడుకు
పులస్త్యుఁడు.పులస్త్యునికొడుకు విశ్రవసుఁడు.
విశ్రవసునికొడుకు రావణుఁడు.)

౩. శూద్రుఁడు.

సీ...కాఁపువాండ్రు నా నాలవవాండ్రు నా
బలిజెవాండ్రనఁ జనుశూద్రసమాహ్వయము
లు. అం. సం. మాన. ౨.

నాలి[1]. వి. ౧. అల్పకృత్యము; నీచకృత్యము.

ఆ. కూలి నాలిఁ జేసి గుల్లాపుఁబని చేసి,తెచ్చి
పెట్ట నాలు మెచ్చ నేర్చు, లేమిఁ జిక్కువి
భుని వేమాఱు దిట్టును... వేమన. ౧. ౫౩.

ఉ...కాఁకలం, దూలెడులేఁత మేను నయి తొ
ట్రిలు నమ్మగనాలినాలిబో, గాలఘువర్తనం
డరని యంగజబాధితఁగాఁ దలంచుమక్.
పాండు. ౩. ౫౫.

౨. కపటము.

రగడ. ననలు వేడిన మొఱఁగి తప్పుడు నాలి నా
లిపచంబు ముట్టకు. పారి. ౪. ౧౬.

౩. (=ఆలి.) పరిహాసము, వేళాకోళము.

సీ. సతిమోమునకుఁ దమ్మి సరి యంటిమా భువనం
బులోమిగులంగనాలియయ్యె.-చమ.౨.౪౯.

విణ. ౧. కుత్సితము; అల్పము.

క. నాలుకలు రెండు నిన్నుం, గ్రోలెనె కల్పించె
నలువ ఘోరాహికి నృశ్నాలిగ్రహ మపుడుఁ
దెగఁదినఁ, జాలద మృదుపవన విరహిజనదురి
తమునక్. మనుచ. ౩. ౫.

శా. చెప్పం జిత్రముగాఁ జలంబు గొని వచ్చె
న్నాలి పెన్వాన యే, నెప్పాటం దరియింతు
...విప్ర. ౩. ౫౪.

క. అలాగునఁ గొనిపోయి నృపాలప్రియసా
న్నిక్రిందఁ బాదుక లిడి య్యాలూలామాల
పునాలిగ,యాలి తనుం గానిదానియటువలె
నుండెక్. సారం౪. ౩. ౧౩౬.

క...కడు నవ్వించుచుఁ జెఱఁగులు, ముడివెట్టక్
బేరఁటాండ్రు ముదితకనుబొమల్,ముడివెట్టె
నాలిసిగ్గున...మనుచ. ౫. ౯౪.

౨. అసత్య మైనది, కల్ల యైనది.

గీ. నాలిమాటలు నీపట్టినామములును, శపథ
ములుఁ జూచి నిక్కంబు సాధు వనుచు,
నమ్మితినిగాక యిట్లనాఁడె నీదు,గుణ మె
ఱింగిన విడలంగఁ గొట్టి విడుతు. విప్ర. ౫.
౫౫.

వ...కొరద లేనినాలియేడ్పు లేడ్చుప్రియల నను
నయింప... చెక్కుటద్దంబులు నొక్కి ...
మనుచ. ౩. ౭౭.

క్రి. విణ. తేలికగా.

సీ. బ్రహ్మాండ మనుచిప్పఁ బ్రాణికందుకముల
నాలి యాడుదు నొంటిప్రేలఁ బట్టి. ప్రబోధ.
౩. ౩౭.

జః నాలితనము, నాలిబూతము, నాలిముచ్చు.

నాలి[2]=నారి. వి. నరము. (చూ. నాలికుఱుపు.)

జః నాలికుఱుపు.

నాలిక=నాలుక. వి. జిహ్వ.

ద్వి. లే దంచు నేడ్వ నాలిక చూపు మన్న,
నాదరంబున వక్త్ర మల్లనఁ దెఱవ. ద్వి.
భాగ. (చి. ని.)

వ...నాలికలు పేలికలవిధంబునం దూలందూ
లుట గనుంగొని... జై. భా. ౪. ౧౦౦.

గీ. అబల చూడు శివద్రోహి యనుచుఁ గొరతి

యతనికంకణశేషాహి యావలించి,నాలికలు
గ్రోయుపగిది వనాలిచలిత,లాలితైలాలతాగ్ర
పల్లవము లమరె. రాజ. చ. ౨. ౧౮౫.
జః నాలికచేలు.

**నాలికచేలు.** వి.(√నాలిక.) ౧. తృణవిశేషము. (శ. ర.) ౨. (పశువుల)జిహ్వారోగవిశేషము.
ద్వి. నరుదకన్నును నీరు నాలికచేల్లు...ఆదిగా
నెన్న(గలపసరాలరోగమునను...నవ. ౧.౩౦
పొ.౧౯ పం.

**నాలికుఱుపు**=నారికుఱుపు. వి.(√నాలి².చి.ని.)

**నాలిగాలి.** వి.(√నాలి¹.)అల్పమైనగాలి, మందమారుతము.
క. అని వనిత నాలిగాలిం, గసలుచు( బోనాడి
తుహినకరకిరణరుచిరిక్,ముసుగ( జన( జెలు
లుగని వో, యని వనరుచు...వసు.౪.౫౧.
ఇశ్లే: నాలిగాడ్పు, నాలితెమ్మెర.
సీ. వలినాలిగాడ్పుబోదలహెచ్చరికలను( జలివె
ల్గునుదుటువెన్నెలలసెగను. నీలా. ౩. ౧౫.
చ. పొలుపుగ నందు( బెండ్లినడుపుల్ నసుపుల్
వలినాలితెమ్మెరల్. విజ. వి. ౧. ౧౩.

**నాలితనము.** వి. (√నాలి¹.) ౧. అల్పత్వము, నైచ్యము.
ఆ. ఇదియ నాకు నాకు నితరేతరద్వేష,హేతు
వనుచు( దోచె నేకత న్వి,భూతి శరపు
నేను బుంవ్యక్తులకు నాలి,తనముతో సమా
ఖ్య మనుచు బెట్టు. రాఘవ. ౨. ౭౩.
౨. కపటము; వంచకకృత్యము, కుత్సితపుపని.
(చల్లగాలి.)ఉ. నాలితనంబు నేర్చుకొని నక్కు
చు నక్కుచు వాడవాడ వ్వేలాలవలీలతావలి
కెలంకులనుం డిటు వచ్చి వచ్చి దం,భోళి
యుంబోలె మీద(బడిపోయెదు...రామా.
౩. ౪౩.
(నారదుడు.)ద్వి.తననాలితనముచిందర(గ( జెవి(
జేసి, సరకి సేయకు(ము నిన్ను( జంప నిలింప,
వరుతోడ యాడవాన్నొచుము( బుట్టె...అ
నుచు నరిగె...కు.ఘ.కే.౧.౧౩పొ.౧౬౫౦.
గీ. నాలితనములు మాసవే నాతి యేల,యేల
వాకుచు చూచు మా మేలరీల. రాజ. చ.
౨. ౧౮౩.

**నాలిబూతము.** విశ. (√నాలి¹.) కుత్సితుడు; కుత్సితుగాలు.
గీ...కుచ్చితుడు దోసకారి చెంటి,పాలసుడు
నాలిబూతంబు పలువ తులువ, కూళ గను
సరవ త్రిల్లు( గుజను పేర్లు. ఆం. సం.మాన.
౧౧.

**నాలిముచ్చు.** విశ. (√నాలి¹.) కుత్సితము; మందము.
ఆ. తగినమాట యొకటి మెుగ మెుచ్చ సేయక,
యంచలార యాలకించి వినుడు, తెలివి
గలుగువారికెలన నుండెకుమీకు, నాలిము
చ్చునడక నడక గాదు. చంద్రా. ౪. ౫౯.
(ఉభయార్థములకు నిదే యుదాహరణము.)

**నాలుక**=నాలిక, నాల్కి. వి. (క. నాలిగె. త. నాక్కు.) ౧. జిహ్వ.
సీ. భానుబింబము నంట(జట్టు నుంకించుపొల్పున
నహిధ్వజము నాలుకలు గ్రోయ. భా. రా.
యు. ౩౪౨.
మ త్తకోకిల.నాపుసుక్ మఱుమాట లాడ(గ నా
లు కాడక యుండి...భార. స్త్రీ.౧.౧౩౫.
ద్వి. ఆలోన( బవనజు( డసమానవిజయు,లోలు(
డై వానినాలుక పీకి చంపె. రం. రా. సుం.
౨౬౨ పొ.
౨. అగ్నిజ్వాల, మంట.
సీ. అజగవాదులకును బ్రజలైనధనువులు( బోది
నాలుకలు గ్రోయు ప్రదరములును. కిరు. ౨.
౯౩.

ఉ. వైరివినాశనక్రియకు వాసవుఁ డిచ్చిన డాఁ
చియున్న యా, ఘోరపుశక్తి నాలుకలు గ్రోయ
మెఱుంగులు ప్రజ్వరిల్ల...తగఁ గేల నమర్చి
పేర్చి...భార. ద్రో. ౫. ౨౯.

(కృష్ణుఁడు కుంతితో నన్నమాట.) గీ. నాలుకలు
గ్రోయుసర్వజ్ఞానాలము దఱిపి, యొరగొవం గని
సంతృప్తి యొసక మెసఁగు. భార. ఉద్యో.
౪. ౧౨.

(బ.) సర్పజిహ్వకలు.

గీ. అప్రమత్తుండ వగుచుఁ బద్మాక్ష నీవు, మ్రిం
గుడువుచాల నాఁకటఁ బ్రేఁగుచుండి, నాలు
కలు గ్రోయుభూరిపన్నగమువాతఁ, బడినయె
లుకను భక్షించుపగిది నసఘ. భాగ. ౪. ౭౨౯.

ఉ. నాలుక లోలిఁ గ్రోయుచు ఘనస్ఫుటనిశ్వ
సితానిలంబులం, దూలిచె దేవయానములఁ
దోరము లైనభుజంగసంఘముల్. భా. రా.
యు. ౧౩౬౮.

నాలుకపయి నువుగింజ నానదు=నాలుక నువుగిం
జనానదు.

ఉ. ఎక్కడివాఁడవోయి యొకయింత యెఱుం
గవు బుద్ధికౌశలం, బెక్కడ కేఁగె నాలుక
పయి న్నువుగింజయు నానటిబల్, తక్కరి
నారదుం డతఁడు దైవతమార్గమునందు నేఁగఁ
గా, నక్కటు నన్నుఁ బేర్కొనితి వాఁతడు
విన్న నసర్థ మొందదే. నిరం. ౪. ౧౭.

నాలుకబెల్లము=వాఙ్మాధుర్యము, మాటలతీపి.

క. వికచముఖుఁ డగుచు శాత్రవు, లకు హిత
లగునట్టివారలం గని భూపాలకుఁ డెడ్డ
కత్తెరయు న్నాలుకబెల్లము నై మనఁబులుం
గనవలయుక్. భార. శాం. ౩. ౨౭౭.

నాలుక ముల్లు విఱుగు=మాటలాడలేకపోవు; అవ
మానము కలుగు.

గీ. అకట మాఱుమాట లేక తా రంత చేపి, బ్రదికి
పోయిరి పులి పేదపడినఁ బనుల, వాడ్రి
యొక్కాడి రసకత వచ్చె నాకు, మునుల
లోపల నాలుక ముల్లు విఱిగె. ఉ. హరి. ౪.
౧౦౨.

గీ. ప్రాంతభూరుహముల గల్లుపండ్లు దఱిచి, త్రు
ళ్లుచిలుకల నాల్కల ముల్లు విఱుతు. కవిక.
౩. ౧౧౦.

నాలుగు=నాలువు, నాల్గు. స. ఔ. బ. (క. త. నాల్కు,
నాల్.) మూఁడునొకటి. (దీనికి వృత్తియందు
'నాలు, నాల్, నలు, నల్' అనురూపము లగును.)

చ...పది మేనియందుఁ గ్రిక్కిఱియఁగఁ జేసి
నాలుగిటు నేసె దురంగములక్...భార.
విరా. ౩. ౨౧౫.

చ...పెట్టుఁ గలమాన్నము నొల్చినపప్పు నాలు
గే, న్నొగపినకూరలుక్...ఆము. ౧. ౭౦.

సీ. గర్వించి నట్లుండు ఘస్రంబు నాజ్జాలు నెదిరిఁ
దన్నునఁగాంచు నెఱుక లేమి. కాశీ. ౬. ౧౯.

చ. అని తనకూఁతుఁ దోడ్కొనుచు నల్లుని
యింటికి నేఁగ మామఁ జూ, చనలములోన
నె య్యొలికినట్టుల మండుచు నిల్లువెళ్లి వా
ల్దినములు నేఁడు నాకడకుఁ దెచ్చితి వే నల
రాఘవుండనే, దనుజగృహీత సీతఁ దవదా,
రని క్రమ్మఱఁ దెచ్చి యేలఁగక్. జై. భా.
౬. ౨౯.

విశ. కొంచెము, అల్పము.

గీ. ఎఱిఁగినవి నాల్గు నొడువ నెట్లేని లెస్స.
ఆము. ౪. ౬౭.

నాలుగవలగ్నము=కర్కటలగ్నము.

సీ...నలుగునాలు, గవలగ్నంబుననన్ని గాములును
మేల్పొడ్కులఁ దనరార వేడ్కఁ బొడమి,
మొదలి వెలంది రామునిఁగాంచె ... అచ్చ.
రా. బాల. ౭౪.

వాడుకలోని ప్రయోగవిశేషములు:

అష్ట పెట్టవలసినవి నాలుగును పెట్టినఁ గాని అ
బ్బాయి ఊరకుండఁడు.

వాఁడు నన్ను అనవలసినవి నాలుగును అన్నాఁడు.
వాఁడు చదివినవి నాలుగుముక్కలైనను గర్వ
ముమాత్రము ఎక్కువగా నున్నది.
జ: నలుకాలు, నలుగంబాలాట, నలుగడ, నలు
గుఱ, నలుగేలు, నలుజాలు, నలుతుము, నలు
దిక్కులు, నలుదెసలు, నలుపలము, నలుమడి,
నలుమడించు, నలుమాఱు, నలుమొగంబుల
ప్రోడ, నలుమొగంబులయన్న, నలుమొగం
బులవేల్పుచెలువ, నలుమోమయ్య, నలువ,
నలువంక, నలువండ్రు, నలువది, నలువదుగు
రు, నలువురు, నలుసాల, నల్గడ, నల్దెస, నల్వ,
నల్వగ్రుడ్డు, నల్వది, నాలవకొలము. నాలవ
తొలిపలుకు, నాలవవాఁడు, నాలుగుమూల
లాట, నాల్వాఁడు.

నాలుగుమూలలాట. వి. (√నాలుగు.) బాలి
కాక్రీడావిశేషము.
సీ. అచ్చనగండ్లు దోయాలును దాఁగిలిమూఁత
లు నాలుగుమూలలాట. దశా. ౭. ౭౧.

నాలువు=నాలుగు, నాల్గు.
క. ధ్రువమండల మాదలగా, రవిమండల మదు
గుగాఁగ రాజిలుపదునా,లువులక్షల యోజన
ముల,భువనము త్రిదివ మిది భోగభూమి
నృపాలా. కవు. ౩. ౬.
ఉ. ఆదినవంతసంఖ్యఁ దనరారుచు నేరి కగమ్య
మైనయా,వేదము నెల్లవిప్రులుఁ బ్రవీణత
తోఁ బఠియించునట్లుగా, శ్రీదనరార నా
లువుగఁ జేసినపుణ్యుఁ బరాశరాత్మజున్,
మోదముతో నుతింతు... విక్ర. ౧. ౧౦.

నాలుక=నాలుక, నాలిక. వి. జిహ్వ.
గీ. నాసికాగ్రంబు వంగుట నాల్క నల్లనగుట
వదనంబు గడు నెఱ్ఱనగుట యుమ్మి,రాసభ
ములు పూనినరథము నెక్కి, యమునిదెసఁ
జనఁ గలఁ గంటు యాయువు వడఁచు. మార్క.
౩. ౩౫౩.

చ. ఫణఫలకంబు విచ్చి... మణిమయపీఠమధ్య
మునన్నాల్కలు గ్రోయుచు నున్న వాసుకిన్,
ఫణిపలసార్వభౌముఁ గని... వైష. ౫. ౭౯.
గీ. వేఁవేలుమస్తకములు వేఁవేలు, కన్నులును
వేఁవేలునాల్కలును గలుగు,మూర్తివి ...
హరి. పూ. ౪. ౧౦౧. ఆం.భా. ౨.౧౪౩.

నాల్క(ర్క)డము=నాకిడము.
(కొజ్జైరకాయ.)
ఉ. అల్లనఁ జేర వచ్చి ధవళాన్నముఁ గమ్మని
యాలనేతితో, బెల్లముతోడ నాల్కసపుఁ
జేసెముతోడను నిమ్మపండ్లతో, వల్లభుకూర్మి
నెచ్చెలికి వారణవైరికి మంచుకొండరా,
యల్లునికిం బినాకికిఁ బ్రియంబున మార్వశి
పెట్టె భిక్షమున్. హర. ౫. ౪౬.

నాల్గు=నాలుగు, నాలువు.
క. నారాయణపరములు నిజ,మారయ బ్రహ్మంబుఁ
బరము సంచితసత్యో, దారతపంబులు గా
వున, నారాయణపరత వీనినాల్గిటి నిచ్చున్.
భార. శాం. ౨. ౫౨.
శా. నాల్గుం జెల్లెడి బ్రహ్మచారిగృహివానప్రస్థ
యత్యాశ్రమం, బు ల్లైవల్యవివర్తు లుత్తమ
పదంబుం జేరువా రిట్టివీ, ర ర్గోపించిన సంత
సుండుఁ జెందు మీరా యోర్చువా రిత్తెంయున్.
ఉ. హరి. ౪. ౫౩.

నాల్గుకన్నులవేల్పు=అగ్ని దేవుఁడు.
సీ. నాల్గుకన్నులవేల్పునకు శ్రేష్ఠ తెక్కానిఁ
జేసి మే లేమియుఁ జెందకున్న. అచ్చ.
రా. బాల. ౫౪.
జ: నాల్గుగంబములయాట.

నాల్గుగంబములయాట= నలుగంబాలాట.
గీ. దోయమల్ నరిచేపలు దొరయనాల్గుగం
బములయాట లచ్చనగండ్లు మొదలఁగా నాఁ
గ ...

తోఁడ నాఁటభూపాలపుత్త్రి. ఇంగు. ౨. ౧౪౩.

నాల్నాఁడు. వి. (నాలుగు + నాఁడు.) ౧. చతుర్థదివసకృత్యము, నాల్గవదినమున చేసెడిపని, (ఋతుస్నానము.)

ఆ. కలితకీర్తిశాలి కళ్యపుఁ డొకనాఁడు, మానవతియఁ జెఱఁగుమాసి యనల, నామతీర్థవారి నాల్నాఁడు చేసిన,యతివఁ గాంచి ప్రముదితాత్ముఁ డగుచు. హ. వరాహ. ౪. ౬౧.

౨. చతుర్థదివసము, నాలుగవదినము.

గీ. సవిత్ప్రఁ కుదయింప నాల్నాళ్ల జలకమాడి, జూడ వెవ్వారిఁ బురుషునిఁ జూచికాని. కాశీ. ౨. ౭౨.

నాళము. వి. లాడము. (శే. ర.)

(వ్యవ.) ఎద్దునకు నాళములు వేసినారు.

నాళము. సం. విణ. (అ. ఈ. అ.) నడత్రృణసంబంధమైనది. వి. అ. పుం. న. ౧. గడ్డిలోనగువానికాఁడ; పద్మాదిదండము, తామర లోనగువానికాఁడ. అ. న. ౧. క్రోవి, గొట్టము. ౨. బోలువరము; రక్తనాళము. ౩. కత్తిపిడి. ౪. రంధ్రము. ౫. మగగుతి. (కే.ని.) అ. పుం. ౧. జలనిర్గమము, నీరుపోవుటకై యేర్పఱచినగొట్టము. (తూముకాలువ లోనగునది.) ౨. నడము, కిక్కిసకసపు౯.

నాళవంశము. సం. వి. అ. పుం. ౧. బొంగువెదురు. ౨. -వెదురువంటికాఁడ కలది- నడము, కిక్కిసకసపు౯.

నాళి. సం. వి. ఇ, ఈ. స్త్రీ. ౧. నాడి, తామరలోనగువానికాఁడ. ౨. దేహమందలిబోలునరము. ౩. వాతాదినాడి. ౪. నాడీశాకము౯. ఈ. స్త్రీ. ౧. శాకకలంబము, గోఁగు మొ. వానినార. ౨. గడియకాలము, ఇరువదినాలుగునిమిషములు. ౩. గజకర్ణవేధని, ఏనుఁగుచెవి కుట్టుసాధనము. ౪. తామర౯. ౫. తామరకాఁడ. ౬. ప్రణాళి, నీళ్లు పోవుతూములోనగునది. ౭. కాలమును తెలుపుటకై చేతితో కొట్టుఘటీయంత్రము.

నాళిక. సం. వి. అ. స్త్రీ. ౧. నాళము, తామరలోనగువానికాఁడ. ౨. నాలితాశాకము, పెద్దతూటికూర౯. ౩. చక్రకము, సంబరేను౯. ౪. హస్తికర్ణవేధని, ఏనుఁగుచెవి కుట్టుసాధనము. ౫. శ్వేతకలంబి, తెల్లతీఁగబచ్చలి౯. ౬. క్రోవి, గొట్టము; వెదురుగొట్టము. ౭. ఘుల్లీరంధ్రము, ప్రొయ్యిసందు. ౮. గడియకాలము. ౯. రంధ్రము. (కే. ని.) ౧౦. ఒకజాతివెదురుగంప. (కే. ని.)

నాళికము. సం. వి. అ. పుం. ౧. తామర౯. ౨. దున్న, మహిషము. న. ౧. తామరపూవు. ౨. వేణువు, పిల్లనఁగ్రోవి. ౩. సంబరేను౯.

నాళీకము. సం. వి. అ. పుం. ౧. ఇనుపనాళముకలఆయుధము. (తుపాకి మొ.) ౨. బాణము; బాణపుములికి. ౩. కొబ్బెరచిప్పతో చేసినకమండలువు, నారికేళకమండలువు. న. ౧. తామరపువ్వు. ౨. తామరతంపర, పద్మసమూహము.

నాళీకాసనుఁడు. సం. వి. అ. పుం - పద్మాసనుఁడు - బ్రహ్మ.

నాళీకిని. సం. వి. ఈ. స్త్రీ. ౧. తామరతంపర, పద్మసమూహము. ౨. తామరకొలను.

నావ. (సం. నౌః. ప్రా. నావా. క. నావె. త. నావాయ్.) ఓడ, కలము.

సీ. ఓడ నావ యనంగ నొప్పుచుండుఁ దరణి... ఆం. భా. ౧. ౧౫౭.

మ. ఘనసౌధాళి వియద్ధునీజలధి వీఁక న్నావలై నీడ దోఁప,..ఆము. ౨. ౧౨.

ఈ. నావెఁడుమద్ధనంబుఁ గొని నా కిడవొల్లకశాత్యబుద్ధివై. కేయూర. ౩. ౧౫౪.

నావ. సం. వి. ఔ. స్త్రీ. తరణి, ఓడ.

నావకుఁడు. సం. విణ. (అ. ఇకా. అ.) నటించువాఁడు.

నావనీతము. సం. విణ. (అ. ఈ. అ.) నవనీతసంబంధమైనది.

నావారోహుఁడు. సం. వి. అ. పుం. ౧. నావమీఁద ప్రయాణము చేయువాఁడు. ౨ - పడవమీఁద ఎక్కించుకొనువాఁడు - నావికుఁడు, ఓడవాఁడు.

నావి. వి. సస్యరోగవిశేషము. (శ. ర.)

నావికుఁడు. సం. వి. అ. పుం. ౧. కర్ణధారుఁడు, ఓడ నడపువాఁడు. ౨. నౌకాయాత్ర చేయువాఁడు, ఓడమీఁద పోవువాఁడు.

నావుడు=అనవుడు. అవ్య. ద్రు. (√అను.) అనిన పిమ్మట.

ఉ. నావుడు నవ్వులాట కనినం బవనాత్మజ యింత యేటికిన్. భా. ర. ఉద్యో. ౩. ౬౧.

మ...పద్మాక్షుఁడు, దురతిం దోడ్కొని పొమ్ము ...పురంధరపుత్రా మనవీటిలోనఁ గలయోధవ్రాతముల్ నావుడున్. ఉ. హరి. ౨. ౨౨.

క. ఉడురాజ నీవు పొడిచిన, జడనిధి యుడుకెక్కి వెక్కసంబునఁ బొంగున్, బడబాగ్ని మీఱి నావుడుఁ, బడఁతుక నీ వేఁడిఁ జిమిడి పడ కెట్లుండున్. ద్వా. ౫. ౧౪౨. (ఇట 'అనఁగా, కాఁగా' అని భావము.)

నావురు=నాఁగురు. వి. నాగిని, ఒకజాతివృక్షము.

గీ...నాగిని నావురు నాఁగు రవఁగఁ, గేరు... ఆం. భా. ౨. ౬౨.

వ...కిమ్మతావులు కలనావురాకులు వఱచి... మనుచ. ౪. ౬౦.

నావ్యము. సం. విణ. (అ. ఆ. అ.) నావచే దాఁటఁదగినది. (దేశము, నది మొ.) వి. అ. న. నవత్వము, నూతనత్వము, క్రొత్తదనము.

నాశకుఁడు. సం. విణ. (అ. ఇకా. అ.) ౧. నాశము చేయువాఁడు, నశింపఁజేయువాఁడు. ౨. నశించువాఁడు.

నాశనము. సం. విణ. (అ. ఆ. అ.) నాశము చేయునది. (అ. ఈ. అ.) నశింపఁజేయు సాధనమైనది. వి. అ. న. ౧. నశింపఁజేయుట. ౨. కనఁబడకుండ చేయుట.

నాశము. సం. వి. అ. పుం. ౧. చేటు. ౨. మరణము, చావు. ౩. అదర్శనము, కనఁబడమి. ౪. పలాయనము, పాఱిపోవుట. ౫. అనుపలంభము, గోచరముకాకపోవుట.

నాశయిత. సం. విణ. (ఋ. స్త్రీ. ఋ.) నశింపఁజేయువాఁడు.

నాశితము. సం. విణ. (అ. ఆ. అ.) నాశము చేయఁబడినది, నశింపఁజేయఁబడినది.

నాశ్యము. సం. విణ. (అ. ఆ. అ.) నాశము చేయఁదగినది, నశింపఁజేయఁదగినది.

నాష్ఠికుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) నష్టద్రవ్యమునకు స్వామి, పోయినసొమ్మునకు అధికారి.

నాస. సం. వి. ఆ. స్త్రీ. ౧. ఘ్రాణేంద్రియము, ముక్కు. ౨. ఏనుఁగుతొండముయొక్క అగ్రము, పుష్కరము. ౩. ద్వారముపై నుండుఅడ్డకమ్మి. ౪. శబ్దము, ధ్వని. ౫. వాసకము, అడ్డసరము.

నాసత్యులు. సం. వి. అ. పుం. ద్వి - అసత్యము లేనివారు - అశ్వినీకుమారులు, దేవవైద్యులు.

నాసరజెంగు. వి. గలిజేరువంటియొక నేలచెట్టు. (చి. ని.)

నాసానాహము. సం. వి. అ. పుం. శ్వాసనిరోధము కలిగించు నాసికారోగవిశేషము.

నాసాపుటము. సం. వి. అ. పుం. న. ముక్కుచారలు, ముక్కుపుటము.

నాసామణి. సం. వి. ఇ. పుం. ముక్కుఅ.(శ.ర.)

నాసారంధ్రము. సం. వి. అ. న. ముక్కురంధ్రము, ముక్కుగ్రోళ్లలో నొకటి. (ఇట్లే: నాసావివరము, నాసాచ్ఛిద్రము.)

నాసాలువు. సం. వి. ఉ. పుం. కట్ఫలము, పిన గుమ్ముడు ?.

నాసావంశము. సం. వి. అ. పుం - ముక్కునడుమ వెదురువలె నుండునది - ముక్కుదూలము.

నాసాస్రావము. సం. వి. అ. పుం. జలుబుచేత ముక్కునందు చీమిడి కారుట, పడిసెము.

నాసి. వి.పిల్లిమార్జాలము.(శ.ర.) విణ.నికృష్టము. (వ్యవ.) ఇది నాసిరకపుగుడ్డ.

నాసిక. సం॰ా౧. నాస. ౨. ఒకానొకపట్టనము.

నాసికంధముఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ముక్కుతో ఊఁదువాఁడు. ౨. ముక్కుతో ధ్వని చేయువాఁడు.

నాసికంధయుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) ముక్కుతో త్రాగువాఁడు, ముక్కుతో ఎగఁబీల్చువాఁడు.

నాసిక్యము. సం. విణ. (అ.ఆ.అ.) ౧. నాసికయందు పుట్టినది. ౨. నాసికయం దున్నది. వి. అ. పుం. ౧. అనునాసికధ్వని. న. నాసిక, ముక్కు.

నాసిక్యులు. సం. వి. అ. పుం. ద్వి. అశ్వినీకుమారులు. (వై. ని.)

నాసిరిల్లు. అ. క్రి. ౧. నశించు. (శ.ర.) ౨. కృశించు. (చి. ని.)

నాసిల్లు. అ. క్రి. నవయు,కృశించు,క్షీణించు.

క. ఈసరణిఁ గామతంత్రాభ్యాసపరిశ్రాంతి మిగులఁ బరవశ మైనన్, నాసిలి ధాతుక్షయమై, మాసములోపలన వాఁడు మరణము నొందున్. జై. భా. ౫. ౧౦౭.

సీ. శీతాంశు నొకఁడు నాసిలుచుండఁ గోపించె భానుని నొకఁ డుర్విఁ బడ నదల్చె.పి.శకుం. ౨. ౩౭.

ద్వి. వాసి పన్నెయుఁ దప్పి వర్తించురాజు,నాసిల్లి సమయు నెన్నఁగ సభలందు. ద్వి. శ. సా. ౧. ౪౩ పా. ౬ పం.

నాసీరము. సం. విణ. (అ. ఆ. అ.) అగ్రేసరము, ముందు పోవునది. వి. అ. పుం. ౧. ముందు పోవు సేన. ౨. సేనాముఖము,అనిమొన.

నాసీరుఁడు. సం. వి. అ. పుం. సేనకు ముందు నడచు యోధుఁడు.

నాస్తికత. సం. వి. అ. స్త్రీ. దేవుఁడు లేఁ డనియు పరలోకము లే దనియు నమ్ముట.

నాస్తికుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) ౧. పరలోకము లేదు అనునమ్మకము కలవాఁడు. ౨. దేవుఁడు లేఁ డనునమ్మకము కలవాఁడు; వేదములయందు నమ్మకము లేనివాఁడు.

నాస్తిక్యము. సం. వి. అ. న. = నాస్తికత.

నాస్తిదము. సం. వి. అ. పుం. మామిడిచెట్టు. (వాచ, కల్ప.)

నాస్యము. సం. వి. అ. న. (ఎద్దుముక్కుగువాని) ముక్కుత్రాడు.

నాహము. సం. వి. అ. పుం. ౧. బంధము,కట్టు. ౨. బోను, కూటము.

నాహరిగడలు. వి. బ. వాద్యవిశేషములు.

(నలకూబరుఁడు.) ఉ. ముందఱ నాహరిగడలు మ్రోయ భటావళి వెంట నంటి రా, వందిజనంబు గ్రమ్మి కయివారముఁ జేయఁగఁ గుందనంపుమే,లందల మెక్కి వేడ్కఁ దను నచ్చరలందఱు మెచ్చి చూడ సంక్రందనుకొల్వుకేఁగ...ఉ. హరిశ్చ. ౪. ౧౧౩.

నాహలుఁడు. సం. వి. అ. పుం. ఒకజాతిమ్లే చ్ఛుఁడు.

నాహుషి. సం. వి. ఇ. పుం- నహుషునికొడుకు - యయాతి.

## ని

ని[1]. అప. ౧. ద్వితీయావిభక్తిప్రత్యయము. (చూ. ఇ[1]. ఉదా:- కృష్ణుని గంటిని.) ౨. భూతార్థకోత్తమపురుషైకవచనప్రత్యయము. (చూ. ఇ[1]. ఉదా:-చూచితిని గృష్ణుని.)

ని[2]. అప. వ్యతిరేకత్వవర్థకార్థమునవచ్చుప్రత్యయము ఉదా:-చేయనికృష్ణుఁడు, పెట్టనికాముఁడు మొ.

ని[3]. అప. ౧. కొన్నిశబ్దములకు ద్వితీయాదివిభక్తులు పరమగునపుడు వచ్చుఆగమము.
ఉదా:-రామునిచేత, రామునికి మొ.
౨. గుణవాచకములకు కర్మధారయసమాసమందు వచ్చెడియాగమము.
ఉదా:-నల్లనిగుఱ్ఱము, తెల్లనిగోడ మొ.

ని. సం. అవ్య. ౧. నితాంతము, అధికము, అతిశయము.
ఉదా:-నికామము, నిపీతము మొ.
౨. అభావము.
ఉదా:-నివృత్తి, నిధనుఁడు, నిమూలము, నికర్షణము మొ.

నిఃక్షత్త్రము. సం. విణ. (అ. ఆ. అ.) క్షత్త్రియశూన్యము. (దేశాది.)
ఇట్టే : నిఃక్షత్త్రియము.

నింకెఱ. అవ్య. క్రి. విణ. శీఘ్రముగా. (చి. ని, శ. ర, బ్రౌ.)

నింగి. వి. ౧. ఆకాశము, అంతరిక్షము.
ఆ. అలిగి యాడుగఁజచి యాఁకటిపెలుచన, నిలువలేక యసుర నింగి దాఁకఁ, బెరిఁగి... భార. ఆది. ౫. ౪౫౧.
గీ. నింగి నేలయుఁ దాటెడు నంగలించు,పగిది నేతెంచెఁ గ్రోధంబు నగనఖిక్షి. సైమ. ౭. ౪౫.
క. పొంగుచు నరదముపైఁ జొలఁతిం గూరిమి మునిచి జేల్పు తెరువునఁ బఱచెం, బంగరుపిచ్చిక గొంచుక్, నింగికి సాళువపుఁబులుఁగు నెగయు తెఱఁగునన్. అచ్చ. రా. ఆర. ౫౨. భార. విరా. ౧. ౧౫౨. ఆం. భా. ౧. ౫౯.
౨. స్వర్గము. (చూ. నింగిమ్రాను.)
జః నింగిచూలి, నింగిముట్టు, నింగిమ్రాను, నింగివడు, నింగిపిక.

నింగిచూలి. వి. (√నింగి.) నభస్వంతుఁడు, వాయువు, గాలి.
గీ...నింగిచూలి మబ్బులపగదాయ గాలి... అన మారుతాఖ్య లగు...సాం.ని. దే. ౧౩.

నింగిప(వ)డు. అ. క్రి.(నింగి + పడు.) మార్యుఁడు మొ. అస్తమించు.
ఆ. సీత నట్టుపేఁక నేసి మిన్నక యున్కి, నఖిలభూతములకు నధిపునల్క, బట్టపగలు నింగిపడియె నా పేసార, జోంధకార మడర నపుడు కపులు. భా. రా. యు. ౫౪.
క. వీ రేమి కాచెదరు తా, నేరూపున బ్రతుకు వీర శేల సురలు జం,భారియుఁ గాచినఁ దన్నును,కారిసమరిగాక నింగివడనిచ్చెదమే. భార. ద్రో. ౩. ౧౬౨. (నింగిఁబడు అని అపముద్రి.)
శా. ఆద్రైశేయతనూజ నింగివడఁగా హార్యంబుపై నెక్కనాఁ, జేదిక్కుం జెలివిండు మెండుకొనఁగా చ్చేకాంతనిద్రారతిన్, పాదింపక్...ఉ. హరి. ౫. ౭౪.

నింగిమిరి. వి. మునర్పుల శీ. (శ. ర, బ్రౌ.)

నింగిముట్టు. అ. క్రి. (√నింగి.) ఆకాశమునంటు, ఉన్నతమగు; మిక్కిలి యధిక మగు.

వ...మొకములజాడ లరసి...వలలు హత్తించి మాటులు పెట్టించి తెరవులు గట్టించి పోటుకోలలు నించి...ఇందు. ౨. ౬౦.

౧౫. ఆవరించు, ముంచు.

మ...తాదాత్వికమోదఖేదగుణశీతాశీతనేత్రాంబులాననము న్నింప గుహుండు రాఘవునకు న్వందారుఁడై యిట్లనుక౯. చం.రా. ౪. ౬౪.

నింట=నిట్ట. వి.(√నిండు.)౧.జలపూరము,వెల్లువ.

క. కంటిమి కన్నులపండువు, మంటి మనుచుఁ దద్దుణౌఘమధువాహినివెన్నింటం దేలుచు సమ్మదకంటకితాంగు లయి యేఁగి కాంచిరి వరుస౯. హరి. ఉ. ౬. ౨౭.

౨. పొంగు; అతిశయము.

(చంద్రోదయవర్ణనము.)ద్వి. విరహులబలుమంట విబుధులపంట,సురతంబులకు నింట సొబగులవెంట. నవ. ౨. ౭౧ పొ. ౨౭ పం.(ఉద్దీపనహేతువు అని భావము.)

నిండఁబడు=నిండు. అ.క్రి. (నిండు+పడు. స్వార్థమున.)

(వ్యాపించు.)

ఆ. ఎన్నఁ బెక్కు లగుచు నెక్కడఁ జూచిన, నడచువారు నడువఁ గడఁగువారు, విడియువారు మఱియు వీడెత్తువారునై, నేల యీని నట్లు నిండఁబడిరి. భా. రా. యు. ౨౭౪.

నిండారు=నిండు. అ.క్రి. (నిండు+ఆరు¹.స్వార్థమున.)

(పూర్ణమగు.)

సీ.నిండారుచందురునిను పోరునునుఁగాంతిఁ జెలువగా మరుఁడు సృజించినట్లు. మార్క. ౩. ౯౧.

క. నిండార జలము ద్రావియు, వెండియు వెండియును గడుపు వెలితిగఁ బైపై, నొండొండఁ గ్రోలి జలరుహ,షండంబులతోడఁ గ్రీడసల్పుచు నుండెన్. వాలీ. ౧. ౯౬.

సీ. నిండార విరిసినపుండరీకశ్రేణి యామినీరమణరేఖాళిగాఁగ. వైవ. ౧. ౯౬.

(కడచు, అతిక్రమించు.)

క.లలిఁ జాలింతతనంబులఁ, దలరెడునమ్ముద్దునేల దాలుపునవలా,తలమానికముల కటుల,న్నెలతేర్పడఁ దొమ్మిదియును నిండారుటయు౯. అచ్చ. రా. బాల. ౭౩.

(అతిశయించు, అధికమగు.)

క. అనిన విని సింహబలమ,ర్దను నవలోకించి ద్రుపదరాజతనయ యి, ట్లనుఁ దనమనమున నిండా,రినసమ్మోదంబు వెలివిరిసి బెరయఁగ౯. భార. విరా. ౨. ౩౫౯.

క...మోదము ధృతరాష్ట్రునిమెమ్మనమున నిండా,రె నఖిలజనచిత్తములను బ్రియము దలిర్చె౯.భార.అశ్ర.౨.౧౦. విక్ర. ౨.౫౪.

(నిండు, వ్యాపించు.)

వ...ఏకదండి త్రిదండిబ్రహ్మచారులయున్నమితదండంబుల నిండారుకషాయకద్రువస్త్రకాపీనపరంపరలం గ్రమ్మి...ఆము. ౪. ౫౩.

వ...వ్రేలునంసంబులు దూలుమాంసంబులు జీరవ్రేవులు జాఱుమోవులు తోరంబులై పుడమికి భారంబులై వడి నిండారుచుండ... చంద్రా. ౬. ౯౧.

(లోఁతు కలదగు, గంభీరమగు.)

సీ...నిండారునీటిలో బాలునితో నన్ను బట్టి త్రోచె. దశకు. ౨. ౧౧౦.

మహాస్రగ్ధర. అనిన౯ వడ్డింపఁబోచ్చె౯ హరిణనయన నిండారుడెందంబుతో...పాండు. ౪. ౧౭౭.

నిండించు. స. క్రి. (√నిండు.) ౧. నెఱవేర్చు, సిద్ధింపఁజేయు.

సీ. తనుఁ గొండె యని వచ్చునునుజింకఁ గుచ
ముగారుడశిలాసరదూర్వ లిడి మరల్చె.
వసు. ౬. ౧౬. (నునుజింక = బాలమృగము.)

చ. నునుఁజిగురాకు మేయుతఱి నోరికెలంకులఁ
జేటి గుట్టినన్. మనుచ. ౩. ౭౨.

౪. అల్పమైనది.

సీ. నునునవ్వు నవ్వ నోపనిమ్మదుస్వన లిటువ
లె నట్టహాసముల్ సలుపు బెట్లు. వరాహ. ౧౧. ౯౬.

క. తలిరులతుదఁ జినుకులు జల, జల వడిచుఁగఁ
దడిసి మెలఁగుచలికరువలిను,న్నొలపమున వి
రియుపరువపుఁ, దొలుమొగడలవలపు దెలుపు
తోఁటులలోనన్. పారి. ౫. ౧౦౩.

౬. స్నిగ్ధము, గాఢము.

ఉ. ఎక్కడనుండి వచ్చెఁ దర శేక్షణకు న్నును
సిగ్గుదొంతరల్. విజ. వి. ౧. ౧౦౪.

౫. మనోహరమైనది, చక్కనిది.

ఉ. గోవపికవ్రజంబునునుఁగూఁతలఁ దుమ్మెద
పిండుమ్రోఁతలన్. దశకు. ౬. ౩౩.

గీ. అలకతిమిరంబు తనుఁ గప్ప వనుభయమున,
ముఖసుధానూతి నును వెల్గుములికిఁ గూర్చి,
నవదరించినసింగిణిచాయ నొసలి,వంకచూ
పునఁ దగఁ గఱికంకబొమలు. పాండు. ౨. ౪౫.

చ... చంద్రుదుననుసోఁగవెన్నెలలతోఁ దుల
దూఁగెడుతద్గుణంబులన్. నైష. ౧. ౪౭.

నునుఁదల=నున్ననితల, వెండ్రుకలూడిపోయినతల.

సీ. తులసీదళాంకితతుచ్ఛశిఖాపుచ్ఛ మలవడ
నునుఁదలనంద మొంద. భా. రా. అర. ౨. ౭౨.

నునుమీనుమునుమఁడు=వ్యాసుఁడు.

సీ. నునుమీనుమునుమనినుడిపంట వ్రాయు మేల్
దంటఁగన్న తుపాసిబంటువాఁడె. ప్రబంధ.
౨౧౪. ప్రబంధ. ౪.

నునువాఁడి=మెత్తనిపదను.

సీ. జలితేఁపుగుబ్బలఁ జట్టి చూడనెకాని నును
వాఁడిగోరున నొక్క రాదు. దశా. ౨. ౩౧౧.

నునుపరి. విణ. (నునుపు + అరి³.) నునుపు కలది. (శ. ర. బ్రౌ.)

నునుపారు=నున్పారు. (√నునుపు.) (చూ. నుంపారు.)

నునుపు(న్పు)=నుంపు. విణ. (క. నుణుపు, నుణ్పు. త. నునుణ్పు.) ౧. నున్ననిది, స్నిగ్ధమైనది.

చ. నును పగుపచ్చపట్టునఁ గనుంగొన నొప్పుగ
దిండు గట్టి ... హరి. పూ. ౬. ౧౪౯.

చ. నునుపుగఁ జందనం బలఁది... ఒకకోమలి
వచ్చి గిరీశుఁ గన్గొనన్. కు. సం. ౭. ౫౯.

ఉ. వాలిక లంబుజాక్షులు వంకలు భ్రూలత
లంద డెందముల్, చాలఁగ నున్పు లంద...
పాంచాలునకైనఁ గాంతల నిజం బిది యిట్టిది
నాఁగఁ జాలునే కు. సం. ౭. ౧౬౯. ఆం.
భా. ౨. ౨౫౨.

౨. మనోహరము.

క. నును పగునలి గానము విని, వనదేవత గరము
మెచ్చి... కు. సం. ౪. ౪౫౨.

వి. ౧. నున్నన, స్నిగ్ధత్వము.

వ... నారికేళపూగావళీకోమలపలాశద్రోణికల
నునుపు గలపారలరొూరల శనధితరఁగలమీఁ
దనుంబోలె గిఱికొని ... మనుచ. ౩. ౨౭.

౨. సొగసు, మనోహరత.

క. యత్నమునఁ దెలియ నన్నియు, రత్నాకరు
భాతి దుస్తరం బగు విద్యా, రత్నము గవితా
తత్త్వము, నూత్నముగా నందుఁ గలుగునును
జాతిఁగితివే. ద్వా. ౪. ౧౭౫.

గీ. నునుపు దళుకొత్తఁ బలుకులు నుతపవేమి.
నీలా. ౨. ౭౭.

జః నునుపరి, నునుపారు.

**నునుపు.** వి. కస్తూరి కుండలపై వ్రాసెడిచిత్రవిశేషము.

గీ. తీర్చిపూదెలు కులుకులు దేటగట్లు,బొద్దుటీనలు నునుపులుమొదలు గాఁగఁ,బనులు నిర్మించుఁగుండలపైనతండు.హంస.౫.౧౩.(ప్రాంతతాళపత్ర ప్రతుల పా. 'నునుపులు'. క్రొత్త ప్రతి,బ్రౌ. పా.)

**నున్న**= నున్నన. విణ. (త. నున్నై. దీనికి కర్మధారయంబున నిగాగమము బహుళము.) ౧. నునుపైనది,స్నిగ్ధము; ఎచ్చుతగ్గులు లేనిది.

సీ. కురులు నున్నగఁ దువ్వి కొప్పుఁ బెట్టిననీటు గనుఁగొన్న మోహాంధకార మొదవు. ఉ. రా. ౪. ౧౯౩. దశా. ౪. ౫౭.

చ ... చెందిరకాషికోఱలుం, దుమికిఫలంబు చందమున నున్ననియూదలమీఁదిపచ్చిగం, దము ... పార. ౧. ౧౫. (పెంద్రుకలు లేనిది అని భావము.)

గీ. రాలి యున్న పువ్వుప్రకరము విదిర్చి,చెన్నుగా నున్న సేసినసెజ్జ యనఁగ, వేగుటయుఁ జుక్కలన్నియు విరిసి విశద,భాతిఁ జెలువొందెఁ జూడ నంబరతలంబు. భార.విరా. ౨. ౨౩౯.

౨. మృదువైనది,మెత్తనిది.

రగడ. పడఁతి వెనుకకొమ్మ చించెఁ బట్టుపట్టునున్నచేల,మడఁతి పొగడ పొన్నతో సమానమా వగంగ సేల. వరాహ. ౩.౯౨.

గీ. కట్టుఁజెప్పులు దొడి నున్నగట్టుతిడుపు,లెలమితోఁ గట్టి ... హరి. పూ. ౫. ౨౫౨.

వ ... అమ్మదాంధగంధసింధురంబు ... తుండం బెత్తి నున్ననియప్పువ్వుదండ గ్రమ్మనఁ గ్రమ్మరించి విసరి ... పార. ౯. ౧౬.

౩. సన్నము.

సీ. కమలపుఁడము నున్నగాఁ జేసి యిరుసుగాఁ గావించి...నీగ. ౨. ౯౪.

౪. అల్పము. (చూ. నున్నగాలి.)

౫. చక్కనిది, మనోహరమైనది.

సీ. మలదాయిసౌనున్న మలపుగీల్పులు దిండిపెట్టు రాపతిమకాలిపెండె సుమర. చంద్రా. ౨. ౩౬.

౬. సుఖకరమైనది.

ఉ. లాలితనీలనీలకచ ంగాలి యగుటంచు సువర్ణడోలికాం,దోళనకేళి సంబులను నున్ననినిద్దురసోలగింప నా,బాలికఁ బాడఁ చుండఁ దురపాటలగంధులు జోలపాటలన్. విప్ర. ౨. ౩౮.

వి. ౧. నున్ననిఉముక. (శ. ర.) ౨. నున్నఁదనము, స్నిగ్ధత.

సీ... తేట నున్నన నున్న తెలివి నునుపు.గీ.నిద్దమన స్నిగ్ధత కసంగు... సాం.ని.స్థా.౬౦.

జ: నున్నఁదనము,నున్నగాలి,నున్నన.

**నున్నఁదనము.** వి. (√నున్న.) మెత్తన.

ఉ. నున్నఁదనంబుగా నలుఁగు నూఁటియుఁ జందన మట్లు రాచియుం,బన్నుగఁ గ్రొత్తలైన కలపంబులు గూర్చియు ... భార. విరా. ౨. ౨౨౧.

**నున్నగాలి.** వి.(నున్న + గాలి.)మందమారుతము.

చ...నున్నగా,లికి సెల వైనపువ్వుఁబొదలే పొద లే పులకింప సేల మి,న్నక రుులనాగ నాగరీ సిరియుఁ దంచ్యుడువిశ్వనాథుల,య్యకుఁ జనవచ్చు వచ్చుమరునమ్ములు వమ్ములు చేసె దంతటన్. కావ్యా. ౨. ౬౩.

**నున్నన**=నున్న. విణ. నున్ననిది, స్నిగ్ధము.

గీ. నునుపు నున్నన నిద్దము నున్నని దన,స్నిగ్ధ నామంబు తెలుఁగున జిగిస్వరూప. ఆం. భా. ౨. ౨౫౨.

మ. ఉడుమార్గం బఖిలంబు నున్న నయి శాణో
త్తేజనం బొంది పు, ల్కడుగం బడ్డ నిశాతఖడ్గ
ము క్రియం గన్పట్టె నప్పట్టునన్. హర. ౨.
౨౫.

మ...ఉద్భటా, చలకూటకోపలకోటి రూపు చెడ
నిచ్చల్ రాయఁగా నైనమొక్కలు భూ
కాంతకు నున్ననయ్యె...మను చ. ౧. ౩౫.
ఉ. రా. ౫. ౨౪౭.

వి. నున్నఁదనము, స్నిగ్ధత.

సీ... తేట నున్నన నున్న తెలివి సానుపు. గీ. నిద్ద
మన స్నిగ్ధత కెసంగు...సాం. ని. స్థా. ౬౦.

నున్నము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. త్రోయఁ
బడినది, తొలఁగింపఁబడినది. ౨. ప్రేరింపఁబడి
నది, ప్రేరితము.

నుయ్యి(యి)= నూయి. వి. కూపము, బావి. (దీనికి
ప్రథమైకవచన మందే ప్రయోగము.)

ఆ. ఒకనిపాలములోన నొకఁడు ధర్మార్థంబు, కొ
లను బావి నుయ్యి త్రొచ్చుచోట, నడిగి చే
యవలయు నొడయుఁడుఁ జేనికి హాని చేక
యున్న నాఁగఁ దగదు. విజ్ఞా. వ్యవ. ౧౫౧.

శా. అంతర్వాణికు శేశయద్యుమణిఁ బద్మాక్షున్
మది న్నిల్పి దుర్దాంతానంతభవాంధకూప
తరణప్రౌఢిన్ దృఢస్థేమఁ బాటించు పెద్దలు
తద్ద నమ్మి నుయి దాఁటే వానికిన్ జింతయా,
కంఠైనం గడ మేనియుం గడమ కాదా
యంచు నూహించుచున్. పాండు. ౪.
౨౩౫.

సా:- ముందట నుయ్యి వెనుక గొయ్యి. (ఎటు
చూచినను ఆపదయే అనిభావము.)

చ...అతఁ డప్పుడు ముందట నుయ్యి వెన్క
లోఁ, తగుగొయి యున్నలాగయినఁ దల్లడ
మంది వణంకు మేనితోన్. విక్ర. ౩. ౭౧.

నురనుర. వి. నురుఁగుల ధ్వని కనుకరణము.

సీ. నురుఁగులు నురనుర పొరఁగి పోయిన జాఱ
గుడికొంచుఁ గిజ్జిన నడయుచు మేఁతలు. ఉ.
హరిశ్చ. ౨. ౧౨౬.

నురుఁగు=నురువు. వి. (త. నురై. దీనిని చి. ని.
నిరనుస్వారముగా గ్రహించెను. నిర్ధారక ప్ర
యోగములు గానరావు. ఇంకను విచార్యము.)
ఫేనము.

సీ. కలకంఠిలోచనంబులు గండుమీలు కుసు
మగంధివిమలహాసము నురుంగు. రా. జ. వి.
౧. ౭౪. (శ. ర. పా. 'హాసములునురుఁగు,
లు'... అని ముద్రి. పా.)

సీ...పరఁగు ఫేనము నుర్వు నురుఁగనంగ. ఆం.
భా. ౧. ౧౫౪.

సీ. కొడుకు రాఁగలఁ డంచుఁ గడుఁ బొంగువా
హినీవరునియూర్మ్ముల మించు నురుఁ గనంగ.
ఉ. రా. ౪. ౧౬౦.

జః నురుఁగుకొను, నురుఁగుదబ్బ.

నురుఁగుకొను. అ. క్రి. (√నురుఁగు.) నురుఁగు
కట్టు.

వ...లాలావినిర్యాసంబులు పెలవుల నురుఁగు
కొన...కవిక. ౫. ౧౧౦.

నురుఁగుదబ్బ. వి. (√నురుఁగు.) కడుపులో కు
డిప్రక్క నుండు మాంసఖండవిశేషము, కారి
జము, కాలఖండము. (శ. ర.)

నురువు(ర్వు)=నురుఁగు. వి. సముద్రాదుల ఫేన
ము, డిండీరము.

క. నురువున నొనరించినపం, జరంబులో నున్న
పులుఁగుచాడ్పున మేనం, బురుమవర జీవ
ముండుట, పరికింపక యేమఱంగఁ బాడియె
నీకున్. భార. శాం. ౬. ౨౨౩.

ఆ. పెక్కు లయ్యు నీటిబీషికల్ నురువులు,
విరియునట్టు లింద విరియఁ జాలె. భార.

౨. నశింపఁజేయు.

సీ. కరిసింహశార్దూలశరభాదిమృగముల నుగ్గు నూచంబుగా నుఱుచునవియు. కళా. ౬. ౧౯.

సీ. పఱపకే లున్నవి పరభృతశ్రేణులు క్రతువులలోఁ దమపల్కునూదు లెల్ల, నుఱుపకే లున్నవి సెతియ ధైర్యంబును గంధంపుమలకోడెగాడ్పుగములు. ప్ర. భా. ౫. ౧౩౪.

జ: నుఱిచియాడు, నుఱిపిడి, నుఱుపు.

నుఱుపు=నుఱుచు. (√నుఱుచు.) ౧. (ధాన్యాదికమును కాళ్లు మొ. వానితో త్రొక్కి) నలుపు, నలఁగఁజేయు.

గీ. నుఱిపి తూర్పెత్తి కడలకు బిఱుసు దిగిచి, గండ్రలుగఁ జేసి రాశి పొంకముగ నిలిపి. శివధ. ౫. ౯.

౨. ధ్వంసముచేయు.

సీ. శస్త్రభూమణసముచ్చయములు నుఱుపంగఁ గడలొత్తువలుఁదక్రేంకారములును. హరి. ఉ. ౪. ౨౦౯.

వ... గజంబులఁ బఱిపియు గాత్రంబు నుఱిపియు ... భాగ. ౬. ౩౪౦.

౩. ఖండించు, నఱకు.

లయవిభాతి. తఱిమి వెస రక్కసుల వెఱచఱవఁ బట్టుకొని, పఱిపఱిగ వ్రేతలలు నుఱిపి యువలీలన్. భా. రా. యు. ౧౪౩౩.

౪. చంపు, వధించు.

సీ. నీళ్లుల కేటిలోనికి డిగ్గఁగాఁ బెద్దతఱిపిపెయ్యలఁ బట్టి నుఱిపె నేఁడు. హరి. పూ. ౬. ౯.

నుఱుమాడు=నఱుమాడు. స. క్రి. (నుఱుము+ఆడు.) ౧. పొడిచేయు; త్రవ్వు.

ఉ. కొన్నిటి నప్పళించుకొని కోలెముకల్ నుఱుమాడు నిట్టు లయ్యన్నిటి నయ్యలూకముఠయం బెసఁగన్ వధియించె భూవరా. భార. సౌ. ౧. ౧౭.

సీ. దేవపూజావిధి కలకె లంఘించి గోరిజల నుఱుమాడఁ గొంతవడవు. పరాహ. ౧౧. ౪౬. (ధ్వంసముచేయు అని భావము.)

౨. సంహరించు, చంపు.

ఉ. వారనియల్కతోఁ గినిసి వారిజనాభుఁడు వారిసైన్యముల్, మారిమసంగినట్లు నుఱుమాడినఁ బీనుఁగుఁబెంటలై వెసం దేరులు వాలె నశ్వములు వ్రెళ్లె... భాగ. ౧౦ ఉ. ౫౧౯.

సీ. చక్కాడె నుఱుమాడెఁ జాఁగఁబలాడెను ...గీ. అడఁచెఁ జెండె నసంగఁ బొందగు వధించె, ననుటకు సమాఖ్యలై ... ఆం. భా. ౩. ౧౨౩.

౩. ఖండించు, ముక్కలుచేయు.

సీ. వెస అంపమున నిడ్డవసిగఁ గొన్నిటి నిసుమంతలుగా నుఱుమాడి యాడి. భార. విరా. ౫. ౩౫.

చ...నన్నమపుఁడు వానిఁ బట్టి నుఱుమాడెద నొద్దికఁ జెల్లఁజేసెదన్. కుచల. ౨. ౭౧.

చ...కొమ్మలు నుఱుమాడి భుజము లమందగతిన్ వెసఁ ద్రెంచి పాదపంబుల వెస వ్రేళ్లతోఁ బెఱికి ... భా. రా. సుం. ౩౩౩.

నుఱుము=నఱుము. స. క్రి. ౧. పొడిచేయు.

మ. కడికండంబులు చేసెదన్ నుఱిమెదన్ ఖండించెదన్ మించెదన్. వీర. ౪. ౬౫.

౨. బాధించు.

కళిక. ఐఱిమి తఱిమి చఱిమి నుఱుమునదు గల్చినవితకరికి. అప్ప. ౪. ౩౨౪.

౩. చంపు.

సీ. దక్షుఁడు దూషింపఁ దత్క్షణంబునఁ గొట్టి నుఱుముటఁ దలఁచిన వెఱపు రాదో. పార్వ. ౪. ౧౦౯.

వి. పొడి; నలి.

చ...తన్నికటుద్రుమవల్లు లెల్ల జర్జరితము లయ్యె
నిష్ఠురవిశాలశిలల్ నుఱు మయ్యె నయ్యె
డన్. భార. ఆది. ౬. ౨౯౭.

గీ. నుఱుము నుగ్గు పొడుము పొడి నురుము సు
న్నిచూ రనంగను విలసిల్లుఁ జూర్ణ మభవ.
ఆం. భా. ౨. ౨౨౦.

క. అతిముఱి నంగము లెల్లను, నుఱుముగ ని
ట్లుడురునర్జునునియముల కున్, వెఱచఱచి సూ
తపుత్రుఁడు,పఱచె...భార.విరా.౫.౧౦౯.
అచ్చ. రా. యు. ౧౩౧.

జ: నుఱుమాడు, నుఱుముచేయు.

**నుఱుముచే(సే)యు = నఱుముచేయు.** స. క్రి. (నుఱుము + చేయు.) ౧.సంహరించు,చంపు.

సీ...నుఱుముచేసె. గీ. నడఁచెఁ జెండె సనంగఁ
బొందగు వధించె ననుటకు సమాఖ్యలై...
ఆం. భా. ౩. ౧౨౩.

ఉ. వాతసుతుండు ముట్టికొని వారి బడల్పడ
వ్రేసి యందఱం, జేతులతీఁట వో నుఱుము
సేసె విశృంఖలవిక్రమంబునన్.భార.విరా.
౩. ౨౯.

గీ. మఱియుఁ జే రగుతులుఁనల నుఱుముసేసి.
నీలా. ౧. ౩.

౨. పొడిచేయు, పిండిచేయు.

క. మును గైదువులం బొరిగొని, చని జోళ్లను
నుఱుముసేసి సర్వాంగములం, గొని వ్రచ్చు
రాముశరము ... భా. రా. అర. ౧.౨౦౩.

సీ. ఉర్వీధరంబు లొండొంటితోఁ దాఁకించి
నుఱుముసేతు సుమామనోవసంత. చెన్న.
౫. ౧౮౦.

**నులక(లుꣳ).** వి.(√నులుచు-క. నులికె.)త్వక్సూ
త్రము, నారతో పేనినదారము.

సీ...చెలఁగుఁ ద్వక్సూత్రంబు నులక యనఁగ.
ఆం. భా. ౨. ౨౯౪.

ద్వి. ప్రకటింప వేయునులకత్రాళ్లు గూడి, యొ
కమ్రోను సరె సభ్యుఁ డొకఁ డైన వలదె.
పండితా. వాద. ౧౩౮ పొ.

సీ. పరఁగ నుల్కలు గూఁలు బండిమోకులఁ
గాదు ... నీతి. ౭౦.

ఉ...భద్రగజేంద్రము నుల్కత్రాళ్లచే, నోముని
నాథ కట్టువడి యుండును...భోజరా. ౪.
౨౦౩.

జ: నులకమంచము.

**నులక(లుꣳ)మంచము.** వి. (√నులక. క. నులి
మంచ.) నులకతో నేసిన మంచము.

ఆ. మలిన మైన నేఁత పలుచ నైనను నల్లులున్న
నుల్కమంచ మొప్ప దాఁడు.గి.పు ౪.౨౧౫.

**నులకశయ్య.** మి. వి. నులకమంచము.

మ. అహాహా బ్రహ్మము వారయే నులకశయ్యం
బ్రల్లి నిద్రింతుగా. శివరా. ౩. ౯.

**నులి.** వి. (√నులియు-౧. నులి.) చిక్కు, నులిక.

గీ. నెరులు గలుగునీలంపుటురులసిరుల,నరులు
గొనఁ జాలి నరులను మరులు గొలిపి, యిరు
లు గెలిచిన తుమ్మెదగములఁ దెగడు, కురుల
నులి దీర్చి విరులిడి కొప్పు పెట్టి.భాగ.౧౦.
ఉ. ౨౪౨.

సీ. కౌస్తుభోజ్జ్వలపదకంబునఁ బెనఁగొన్న హారు
హారమునులి చక్కఁజేసి. హరి. పూ. ౫.౯.

శా. తారాప్రోష్ఠులఁ గాలనూతుఁడు వియద్వా
రాశి వేఁటాడి ప్రాగ్ఘారంభం బనుబుట్టఁ బె
ట్టి నులి వాయం గుంజి యూఁ దాఁచఁ జె,
న్నారన్ వైచినబాలమో యనఁగ శోభాశోం
చనత్వంబునన్, దారానాయకమండలం బ
మరు నస్తాగ్రావకూటంబునన్. కాశీ.౪.౧౬౬.
ప్రభా. ౨. ౯౨.

బఱ=నులి. ౧. అల్పము, చిన్నది.

సీ. బలుగోడలఁ బొసఁగు నులిపచ్చపగడంపుఁబా
రుదూలంబులవార మాను, ఫలుదిండితాకం
బనుఁ లగరిమంబు ... ఉ. రా. ౬. ౧౨౩.

౨. మెలి పడినది, మెలికలు కలది.

ద్వి. పులిగోరు నేవళంబులు నంద మైన, నులి
కడియంబులు నూపురంబులును. నవ. ౪.
౧౮౬ పా. ౩౨ పం.

**నులించు** = నులుచు, నులుపు. స. క్రి. (√నులియు. శ. ర. చి. ని.) నులియఁజేయు, నులుపు.

ఉ. తానును దైత్యులావునకుఁ దద్దయు నొచ్చు
చుఁ జేర్చి దేవకీసూనుఁడు కొమ్ము లూఁది
మెడ స్రుక్కఁగ నెత్తి నులించి త్రిప్పి వే, వే
నెఱిఁ దప్పఁ ద్రోచుటయు...హరి. పూ.
౪. ౫౦.

**నులికొ(గొ)మ్ము(ల)మెకము.** వి. (√నులి.) ఇఱ్ఱి, మగజింక.

సీ. నులికొమ్ముమెక మన వెలయుఁ గృష్ణమృ
గంబు...సాం. ని. తిర్య. ౬౪.

క. నులిగొమ్ములమెక మిఱ్ఱన నిలమృగమున కొ
ప్పఁ బేళ్లు...ఆం. సం. తిర్య. ౬.

**నులిగాయ.** వి. (నులి + కాయ.) దృష్టిదోషము గాలిసోఁకు మొదలగునవి కలుగకుండుటకు చంటిపిల్లలకును పురుటాండ్రకును గట్టెడి కాయ, దిష్టిపూస.

గీ. త్రాట నులిగాయఁ గూర్చి పాదములఁ గట్టు,
నుప్పు జేఁపాకు వైఁ జల్లు నిప్పు లతివ, ద్రిప్పి
యిడు దృష్టిదోషంబు దీఱ వీథిఁ, బ్రేమ మీ
ఱంగ బిడ్డలఁ బెంచునపుడు. కాశీ. ౪. ౧౧.

ద్వి. పసిఁడి జేకుబ్బెత్తుపగిది వీడెమునఁ, బొసఁగి
నిగ్గులు దేఱుపుక్కిటితోడ, నులిగాయ లెడ
ను గానుఁగగింజమోవి, నులిచిన పేరు చన్ను
లఁమీఁద బెళఁక. అ. మ. క. ౧. ౨౬ పా.
౨౦ పం.

**నులిగొను.** అ. క్రి. (నులి + కొను.) ౧. చిక్కుపడు, మెలికపడు.

సీ. నులిగొన్న చెలఁదిపుర్వులనూలివల్లు నా నమ
రెడుముడుతకన్బొమలవలన. గీ. భావజుఁడు
వెల్లిపోయినపాడుమేడ, పగిదిఁ గాన్పించు మూ
డుసలిపడఁతి యొకతె. కళా. ౩. ౪౩.

సీ. దట్టమై నులిగొన్న యట్టిపందిరిబ్రాఁతి తీవ లిం
దెవ్వరో త్రెంచినారు. శుక. ౧. ౨౪౩.

౨. వలయితమగు, చుట్టుకొనఁబడినదగు.

క. పెనగొనె గిఱికొనియెను...నులిగొనె నన
నాఖ్య లగును వలయితమయ్యె ననుట
కును...ఆం. శే. ౬౩.

**నులిగొల్పు.** స. క్రి. (√నులిగొను.) మెలిపెట్టు.

ద్వి. ముదురుజుంజుఱుమీసముల నులిగొల్పి. ద్వి.
హరిశ్చ. పూ. ౨౦౬౨ పం.

సీ. నులిగొల్పి పావడఁ దలఁజుట్టె నొకయింతి
నెమ్మేనితఁడి యొత్తె కొమ్మ యొకతె. చంద్రా.
౬. ౪.

**నులిజెముడు.** వి. (√నులి.) వృక్షవిశేషము, చిన్న జెముడు.

సీ...నల్లేరు నులిజెము డాకుజెముడు. హంస. ౪.
౧౦.

**నులితడ.** వి. మహాబల.

గీ...గూబతడ నులితడ, యన మహాబల దనరు
వృషాధిరూఢ. ఆం. భా. ౨. ౫౬.

**నులిపచ్చి.** విశే. (√నులి.) కొంచెముతడిసినది.

ద్వి. పనుపడ నులిపచ్చిపయ్యెదకొంగు, మొనల
నానినకుచముల నొప్పు డాని. ద్వి. పరమ.
౪. ౨౯౨ పా.

**నులిప(వ)డు.** అ. క్రి. (√నులి.) ౧. దోఁపుడువడు.

ఆ. దోఁపుఁబోయె ననుట దోఁచు నులిపడెన,
నంగ...ఆం. భా. ౩. ౧౧౬.

౨. మెలికపడు.

రగడ. మగుద పలుకు లుం దిగిచి చూచుట మా
నుమా కలిగడియె దండలు. పారి. ౪. ౧౬.
గీ. సాలభంజికప్రతిమ లౌనులు నులివడంగ,...కత్తు
రు వేటజాతికొమిరె లెపుడు. ప్రబంధ.౧౯.
కళ. ౫. ౧౭౦.

నులిపురుగు. వి. (నులి+పురుగు.) కడుపులో
పుట్టుచిన్నపురుగు. (బ్రౌ.)
(వ్యవ.) వాయువిళంగము లరసము త్రాగినచో
కడుపులోని నులిపురుగులు పోవును.

నులిబిల్ల. వి. (√నులి.) చిన్నదయినయొకజాతి
నీటిపురుగు, జలచరవిశేషము.
సీ. నులిబిల్ల యొఱబిల్లపురుగు గోదురుకప్ప...
రొండ్రకాయ జలగ. హంస. ౪. ౧౭౬.
('నులిగుల్ల' ప్రాంతప్రతిపా.)

నులియచెంకె. వి. వృక్షవిశేషము.
సీ... తలపిడు చబ్బెంద నులియచెంకె. హంస.
౪. ౧౦. (ప్రాంతప్రతిపా.)

నులియు= నలియు. అ. క్రి. ౧. పొడియగు.
వ... మిడియుప్రేళ్లును నలియుకన్నులును నులి
యు వెన్నులును జడియుచెక్కులును ...
చంద్రా. ౬. ౭౩.
౨. (అలయికె మొ. వానిచే) చలించు, అల్లా
డు; వడకు.
క. అంగంబులు నులియంగను,నుంగే నీలిగే యు
టంచు నొకనిమిషము నోరం గాయ వేయ
కేడ్చుచు, నంగీకృతబాల్యచేష్ట నతఁడట్లుం
డెను. పరమ. ౧. ౧౨౫.
చ. కులుకు లెసంగ నబ్బురపుగుబ్బలు గుబ్బతి
లంగ పేనిచాయలు చిలుకంగఁ గౌను నులి
యంగ మెంగముసఁ గ్రమ్మి చెమటల్,జిలిబిలి
పొంగఁ బొందళుకుఁజేలమెఱుం గడరంగఁ
గంకణావళి గలుగ ల్లనంగఁ బటువం గపుకం
చె లతాంగి సిగ్గునన్. కృ. శతం. ౩. ౩౫.

జః నులక, నులి, నులించు, నులికాయ, నులిగొను,
నులిగొల్పు, నులిజెముడు, నులితచ్చు, నులి
పడు, నులిపురుగు, నులిబిల్ల, నులివంక, నులి
వాడు, నులివు, నులివెచ్చ, నులివెట్టు, నులి
వేడి, నులుపు, నులుము, నులుకు.

నులివంక. వి. (నులి+వంక.) ౧. కొంచెమువంకర.
సీ. కళలయిక్కువ లంటి గళముల సందిళ్లఁ గ్రొ
వ్వాడినులివంక గోరు లుంచి. భుటికా. ౨.
౧౧౬.
౨. పల్లకిబొంగుయొక్క దోషవిశేషము.
వ... నులివంక యగ్గిసోకుడు ... నీలధవళర
క్తహరిద్వర్ణంబులు మొదలుగాఁ గలదుర్గుణం
బులు లేక ... ప్రబంధ. ౬౦౫.

నులివాడు=ఉలివాడు[1]. అ. క్రి. (నులి+వాడు.)
కొంచెముగా వాడు.
సీ. నులివాడునాఁచుపల్లుల గొంతిగొగర్చి లేబొ
లపల్పుగాలి పే పోక యొదిగి. అము. ౨. ౫౩.
నులివాళ్లువాడు=కొంచెమువాడు.
క. నులివాళ్లువాడుచున్నవి, లలిత మహీతరుణ
దేహలతికలు మనరున్,జలకేళి యుచిత మన
వుడు, నెలఁతుక కిట్లనిరి చెలులు నిపుణత
మెఱయన్. విక్ర. ౫. ౩౮.

నులివు[1]. వి. (√నులియు.) ౧. నులియుట. (శ.
ర.) ౨. అభరణవిశేషము.
ద్వి...చంద్రాస్య రొూర్తు, తనకేలినులివు మధ్యము
నఁ బొంకించి, యురుదించి... ద్వి. పరమ.
౫. ౪౪౧ పా.

నులివు[2]. వి. విధము, రీతి.
ద్వి... వాఁడు నాగేతి నొండు, నుడువసేరక
మూఁగనులివున నున్న. ద్వి. పరమ. ౨.
౧౨౩ పా.

నులివెచ్చ. విణ. (√నులి.) కదువ్వము, కొంచెము
వెచ్చనిది.

చ. తెలినులివెచ్చయోగిరముఁ దియ్యనిచారులుఁ
దిమ్మనంబులున్. ఆము. ౧. ౭౧.

సీ. విరహులమై సోఁకి వేఁడి యౌవెన్నెలఁ బ
చ్చివెన్నెల నులివెచ్చఁ జేసి.పారి. ౨.౪౭.

ఆ... కదుష్ణనామ, మలఁతి గోరువెచ్చ నులి
వెచ్చ తనివెచ్చ, యన...ఆం. భా.౧.౭౩.
చంద్రా. ౨. ౩.

నులివెట్టు. స. క్రి. (√నులి.) ౧. మెలివెట్టు.

చ. అన విని నవ్వి యవ్వికసితాంబుజలోచన
వ్రేఁటుకొంగు కేలున నులివెట్టుచుం దళుకుళు
క్కునఁ జూపులఁ జూచి...శుక.౨. ౪౬౯.

సీ. తోఁక నూరక మేను సోఁకఁగ నులివెట్టు వె
డవెడ నాలుక వెడలఁ బెట్టు. భాగ. ౧౦.
ఉ. ౫౪౪.

౨. గ్రుచ్చు.

మ. ధర గంపింప మహాసభాభవనరత్నస్తంభ
సంభూతుఁడై, కరజంబుల్ నులివెట్టి రక్త
కణము ల్గాఱఁగ వీక్షించి రౌద్రరసద్రోణిక
లో యటంచు విబుధవ్రాతంబు వర్ణింప శ్రీ,
హరి రక్షోభుజమధ్యమండలము చెండాడెన్
నృసింహాకృతిన్. వరాహ. ౭. ౨౯.

నులివేఁడి. విణ. (√నులి.) కొంచెము వెచ్చనిది.

ద్వి. గుడిగుడి క్రన్నీరు గ్రుక్కుచు నొండు,
నుడువ నాలుక రాక నులివేఁడియూర్పులం
దండ నిగుడ...ద్వి. హరిశ్చ. ఉ.౧౩౮పం.

చ...ఓరి మనుజాధమ నిచ్చలుఁ దెచ్చువంటకం,
బును నులివేఁడికూరలు నపూపములున్ గొని
రా కహంకృతిన్. విక్ర. ౫. ౨౧౯.

నులివేఁడియెండన్=సంధ్యాసమయమున.

సీ. ఎచ్చోటు నులివేఁడియెండఁ బండులు రాలి
పూపార్కు కదనంబు బోసివడియె. భీమ.
౩. ౩౮.

నులుచు(ల్చు)=నులించు,నులుపు. (√నులియు.)
స. క్రి. నులియఁజేయు.

౧. నలుపు, పిసుకు.

సీ.భవసంగత నటంచుఁ దలఁడువ్వి ముడిచిన ము
రువ్రులౌ యని ముడ్డి మూతి నులుచు. శుక.
౨. ౧౧౫.

సీ. ఉపదర్భమెడ నుల్చి యూపంబుతోఁ గట్టి
...కు. సం. ౨. ౨౦౦.

౨. సంహరించు, నశింపఁజేయు.

సీ. గగ్గులకాడులుకావించె మగియించె నులి
చెను...గీ. వధించె, వనుటకు సమాఖ్యలు
...ఆం. భా. ౩. ౧౨౩.

గీ. వామనుఁడవై బలీంద్రుగర్వంబు చెఱిచి,
భార్గవుఁడవై సమస్తభూపతుల నులిచి,రా
ఘవుఁడవై దశాస్యువక్త్రములు దులిచి,ని
లిచినాఁడవు నీమాయఁ దెలియ వశమె.
వరాహ. ౧. ౫౨.

౩. మెలివేయు, మెలివెట్టు.

క.వైరమున నులిచి త్రెంపక,కారాకులు దుల్లినట్లు
కరము లెల్లం,దార పెడఁబాయవలయుట,
సారకృపం దెలియఁ జెప్పె శౌరి యతని
కిన్. భార. భీష్మ. ౧. ౨౦౪.

చ...మేరువు న్వ్రీలఁగఁ ద్రోచెద శేషుని బట్టి
నుల్చెదన్,వనజభవాండముల్ వగులవైచెద
దాఁటెద నేడుదీవులన్.భా. రా.కిష్కిం.
౭౧౯.

సీ. మొలకచ్చకట్టుపై మలఁగినపచ్చనినును
కొంగు దిండుగా నులిచి చుట్టి. హరి. పూ.
౮. ౧౩. దశకు. ౨. ౪౩.

నులుపు(ల్పు)=నులించు, నులుచు. స. క్రి.
(√నులుచు.) నలుపు, నలఁగఁగొట్టు.

వ...అక్కుండలికయనుండు...రాక్షసుల గుం
డెలన్ బగిలించుచు...శిరంబుల విదలిం
చుచు భూషణంబుల నులుపుచు దూషణం
బుల సలుపుచు...ఉ. రా. ౨. ౬౧.

౨. పన్నాగము, పన్నుగడ.

శా... నేర్పుల్ పచరించి బొంకిన నెఱుఁగరాదె యీనుల్పు వీఁ, డే నిక్కం బగు కన్నగాఁ డని ధరిత్రీశాగ్రగణ్యుం డనఁగ. విప్ర. ౫. ౬౨.

నులుము. స. క్రి. (√నలుచు.) ౧. మెలిపెట్టు, కండను రెండువ్రేళ్లతోఁ బట్టి యిటునటు త్రిప్పు.

వ... ఉరవడిఁ గొమ్ముల మెడల నులిమియుఁ దొడలు విఱిచియు... నీలా. ౩. ౭౪.

సీ. ధూర్జటి నే మని దూషించితి వటంచుఁ బువ్వుఁబోణి యొకర్తు బుగ్గ నులిమె. పారి. ౪. ౧౨౧. కళా. ౪. ౪౧.

౨. నలుపుకొను.

సీ. కాటుక నెఱయంగఁ గన్నులు నులుముచు వెడలుకన్నీటితో వెగచువాని. భాగ. ౧౦. పూ. ౩౭౨.

౩. గట్టిగా నొక్కు, పిసుకు.

(వ్యవ.) దొంగలు దారిలో వానిని గొంతు నులిమి చంపినారు.

౪. (ఇతరులనుండి) బలవంతముగ లాగు, ఒడిసి పుచ్చుకొను.

క. అని మరుబాములఁ బడలే, నని కైదువు దుప్పిదాఁటునాయితము బలెఁ, బెనఁగునలయుతియ యచే నుర్వియ నులిమి బలిమి విడిపించి యను ననురక్తిఁ. సారంగ. ౨. ౨౩౫.

వ... ప్రమథగణంబులచేత నచ్చక్రంబు నులిమి తెప్పించి తదనంతరంబ... వీర. ౪. ౧౪౬.

౫. ఉన్మూలించు, పెల్లగించు; నాశముచేయు.

సీ. బలిమి వాసవుచెట్టు నులిమి వాకిటఁ బెట్టుకలిమివాలుగఁ గంటిచెలిమివాని. చంద్రా. ౧. ౯౪

సీ. బంధనంబులఁ బటాపంచలు గావించు నోల యనాపదలను నులిమి వైచు. సీతారా. ౧. ౬౩.

౬. విడుచు.

సీ. అన నప్పు డెన్నిక సమరశత్రు విభీషణుఁడు భీష్ముఁ డనుశంక నులిమివైచి, పలుకుఁబంతము మీఱ... రాఘవ. ౪. ౫౩.

౭. వధించు, చంపు.

సీ... నుగ్గాడె, బరిమార్చె నులిమెను దైత్యులార్చె జదిపెఁ బొలిమెను సదమదమొనర్చె... గీ. అడఁచెఁ జెండె ననంగఁ బొందగు వధించె, ననుటకు సమాఖ్యలై... అం. భా. ౩. ౧౨౩.

నులుసు. వి. (√నలియు.) శేషము, మిగులు. (న్యూనత అని శ. ర. నిష్ఫలము అని ప్ర.)

తరలము. నలినలోచన... మనముఁ గాన్పుము భీతులఁ, నులుసు లేక ఫలించె నోచిననోము లెల్లను నీవ యై. భాగ. ౧౦. పూ. ౧౩౦.

నుల్లింద. వి. ఒకానొకచెట్టు.

వ... మఱియును బెదపిచ్చి చినపిచ్చి నల్లింద నుల్లింద యిప్ప కప్పురమద్ది... పి. శకుం. ౨. ౧౪.

నువత్. సం. శత్రు. నుతించుచున్న.

నువ్వు(వు)=నూవు. వి. సస్యవిశేషము, తిలసస్యము (దీని భేదములు అడవినువ్వు, కొండనువ్వు. అని శ. ర.)

ఆ. నువ్వుఁబువ్వు నవ్వు జవ్వనినాసిక... విజ. వి. ౧. ౯౪.

వ... నువ్వుమవ్వంబును... భీమ. ౩. ౬౭.

సీ. ఎడ లేదు నువుగింజ యిడఁగ సప్తద్వీపములయందు యూపముల్ పొదలుకతన. నీలా. ౨. ౧౫.

౨. ధాన్యవిశేషము.

ఆ. నూనె లేనిదివ్వె నువ్వుల మందునా, విశ్వదాభిరామ... వేమన. ౧. ౩౯౦.

ఆ. ఘటము గాఁగఁ జేసి కగణ మొద్దుగఁ జేసి, తవిలి కర్తములను నువులఁ జేసి, తెలిసి గాను గాఁడు తిలకారుఁడాత్మయు, విశ్వ... వేమన. ౨. ౨౭౫.

సా: నాల్కపై నువ్వుగింజ నానదు. (మాట దాఁగ దని భావము.)

గీ. నాల్కపై నువ్వు గింజైన నానవట్టి, యారివే
రంపుఁజపసి కయ్యఁపుఁగడుపుఁ, గూడుగాఁ
జేసి మెలఁగెడుకోడిగీఁడు, మదుర చదువుల
బాపనముద్దుపట్టి. చిత్ర. భా. ౫. ౪౫.
జ: నువ్వుచేను.

నువ్వుచేను. వి. (నువ్వు + చేను.) తిల్యము, నువ్వు
లుపండుచేను.
గీ...నువ్వుచే నవఁగఁ దిల్య, మలరు...ఆం. భా.
౨. ౨౨౯.

నుసము. వి. కసవు.
ద్వి. బలవంత మగుశీధి ప్రాణేశుఁ బాపఁ, బలవం
తఁ జెందినవరవధూమణికి...పూఁబొదరిండ్ల,
క్రంతలు వంతలు కమనీ కాసరసి, బిసములు
నుసములు పృథుమకరంద, రసములు విసము
లు...ద్వి. హరిశ్చ. పూ. ౨౫౨౩ పం.

నుసలు. అ. క్రి. ౧. కదలు, మెదలు.
ద్వి. చాల నీతని తుల్కి సత్యంబుకోలకు, నూ
లిపోఁగునఁ జిక్కి నుసల కున్నాఁడ. ద్వి.
హరిశ్చ. ఉ. ౧౫౨౬ పం.
౨. ఏమఱు, ప్రమాదమొందు.
ద్వి. నుడితప్పు వాతప్పు నుసలక సత్య, మెడ
లింపఁ గనిపట్టు నెపుడుఁ గౌశికుఁడు. ద్వి.
హరిశ్చ. ఉ. ౧౯౪ పం.
ద్వి. విసిగినఁ గసిగిన వెడ నిద్ర నొంది, నుసలిన
మసలిన నొప్పిఁ జెప్పినను. ద్వి. హరిశ్చ. ఉ.
౧౫౪౨ పం.
౩. పూను, యత్నించు.
క. మగువలు మగలని యెఱుఁగఁడు, మృగముల
కోరసిలఁ జేమి మిడిమేల మితం, డగపడు
నని తలఁచితి మేఁ, నుఁగుఁ గంబంబునకుఁ దివి
య నుసలితిమి సుమీ. రామా. ౨. ౧౧౩.
(శ. ర. చి. ని. పా. 'నుసిలితిమి' ముద్రి.)
౪. ఆడితప్పు.
ఆ. నొడివినంతవట్టు నుసలక యిచ్చుచో, నేల
కట్టు విష్ణుఁ డేఁటిమాట. భాగ. ౮. ౫౯౪.
స. క్రి. పట్టుకొను, గ్రహించు.
మ. పెసరుంగాయకు మెత్తకన్నులకునై పేటా
డుమ మన్గొజ్జెలక్, నుసలం జూచుచు దోస
చేల్ చెఱకుచాల్ నుగ్గాడుచున్...రా.
వి. ౨. ౬౫.

నుసి. వి. (తె. నొ. ని.) ౧. పురుగులు తొలువఁగా
రాలుమ్రానిపొడి.
చ...అప్పడఁతుకభ్రూలతాధనువు పట్టి మనోభ
వుఁ డింతనుండియుఁక్, విడుచునకాని మానఁ
డిది నిక్కము మట్టదకీటజుష్టమై, యుండుగక
కమ్మధూళినుసి యొల్కుచునున్న పురాణచా
పముల్. నైష. ౫. ౧౨.
క. ఘుణగణవివరణఁ జివికిన, మణిధనువునఁ దొ
రఁగునుసిసమానము లై ద్రర్పణ నిభ నభము
నఁ బరిణతి, శణకణహారిణములు పాండుజలద
ము లొలసెన్. ఆము. ౪. ౧౪౧.
౨. నిగుడు, కట్టెలు మొదలగునవి కాల్చుటచే
కలిగినబూడిద.
(వ్యవ.) కట్టెలు కాలి నుసి అయిపోయినవి.
విణ. నుసి పట్టినది, ప్రాఁతది.
ఉ. చూచి రఘూద్వహుండు సెఱజోదులు వేల
కొలంది యెత్తఁలే, రేచి బలాఢ్యు లయ్యు
నిపు డీనుసివి ల్లొకపెద్దకొండగాఁ, జూచెద
రెల్లవారు నది శూలికిఁ గాకిట నాకు లక్ష్య
మే. రామా. ౪. ౮౮.

నుసిపురుగు. వి. (√నుసిక. క. నుసిహుఱ. మ. నుచ్చు
పుఱు.) ఘుణము, మ్రాను తొలిచి నుసి రాల్చె
డిపురుగు. (శ. ర, బ్రౌ.)

నుసుఁగు. అ. క్రి. తొలఁగు, అపసరిల్లు.
గీ. అనృశంసుఁడు నుసుఁగు వైఖానసులకు, నా
దురాత్ముండు శ్రోత్రియు నపహసించు, నాఖ
ఋఁడు సోమయాజి నిరాకరించు, నక్కరా

తుఁడనుష్ఠాత ధిక్కరించు. శైవ. ౭. ౧౩౦.

ఉ. పంది నుసింగిపోయిన నృపాలకనూజుఁడు సిన్నవోయి ... విక్ర. ౩. ౭౩. (చి. ని. పా. 'మొఱంగిపోయిన'. ముద్రి. పా.)

**నుసుమ.** వి. ఎండకాలమున కన్నులందు ముసరెడు చిన్నదోమ. (శ. ర, బ్రౌ.)

**నుసుము.** స. క్రి. ఆకర్షించు, లాగు.

వ...చరణాంగుళిదంశికలం బట్టి నుసిమిన మిట్టిపడి యిట్టట్టు గదలనేరక...వసు. ౪. ౫౩.

**నుసులు.** అ. క్రి. (త. నొసివు.) ౧. కదలు, చలించు.

గీ. మధుఁడు సారంగధరుఁడు మస్తధుఁడు విధుఁడు, వసులపాఁతర లై వీరు నుసులనీయ, రెటుల నిటు తాళఁగల దని యెఱుఁగ వైతి. సారంగ. ౨. ౧౨౬.

ద్వి. రసికుండవేనియు వస దక్కి యాత్మనుసిలిన మతి మీఁద నోరెత్తఁగలవె. పండితా. పురా. ౧౧౪ పా.

౨. (ఒడలు) విఱుచుకొను.

చ...నిద్ర చేఁగసరినయట్లు మత్కరము గబ్బిచనుంగవపైకిఁ దార్చి పై, నుసులుచు నీవిజార్చినమనోహరలీలల కెన్న శక్యమే. శశాం. ౪. ౬౨.

౩. ఒదుఁగు, ముడిఁగియుండు.

చ. వెరవున నంగముల్ నుసుల వ్రేటులు వమ్ముగఁ దాఁకినప్డు దిక్కరిరదనప్రహారములఁ గంపము నొందక యుండు మేదినీధరములఁ బోల్పఁ బట్టగునుదగ్రపుమూర్తుల...భార. శల్య. ౧. ౧౪౬.

మ. గద లన్యోన్యసమాహతిన్ మిడుఁగుఱుల్ గ్రక్కంగ సారించుచుం, గదియం బాయఁగ వ్రేటు దప్ప నుసులంగా నేర్పు లంగంబులం, దొదవన్ ఘోరపరస్పరప్రహతు లత్యుగ్రంబుగా నెత్తురుల్, వెదలింపం బదశబ్దహుంకృతులు దిక్సీమంబులం దాఁటఁగన్.

భార. ద్రో. ౧. ౧౯౫.

స. క్రి. నులుము, నలుపు.

గీ. చంద్రరేఖయు ముఖకాంతి సడలి కనులు, నుసులుకొంచును మేల్కాంచి నుసలఁ జొచ్చె. చంద్ర. వి. ౩. ౧౩౫.

వి. ౧. చలించుట, వెనుదీయుట. (లాఘవము. అని శ. ర.)

వ...నుసులు లేక మాసంబు పనంబునకు ధనంబుగా వనంబునం గార్చిర్చ్యసం గమిరిన యట్లు రూపు సెడి పీనుంగు వెంట లగు చోట్ల శరంబులు రాలినను శిరంబులు వంపక...ఉ. హరి. ౩. ౯౧.

౨. (త. నుసుళ్.) ఓసుఁగుట, ముడుచుకొనుట.

వ...అవ్విడముడి పుడమి టీని వెడఁదయురంబు పలక్షించి లాఘవస్ఫారంబుగ గదాదండంబుఁ ద్రిప్పి వైవ నాతం డది మోనినుసులునం దప్పింప నది యిల చలింపంబడిన నన్నుసులు తెలిపిన యుక్తికి యద్భుతవేగుండగు నవ్వాయుపుత్త్రుండు గద పుచ్చుకొని తిరుగుసందున దుర్యోధనుండు...భార. శల్య. ౨. ౨౬౩.

జః నుసులుకొను.

**నుసులుకొ(ల్కొ)ను.** అ. క్రి. (నుసులు + కొను. స్వార్థమున.) మెదలు, దొరలు.

సీ. కుహనాకటికి లక్ష్మికుచకుంభములమీఁదికుంకుమంబున నుసుల్కొనఁగఁ గూడె. భీమ. ౧. ౩౪.

## నూ

**నూ.** వృత్తియందు నూపుశబ్దమునొక్కలు ప్తశేషము. (చూ. నూఁబువ్వు, నూఁబప్పు.)

**నూఁక.** వి. త. నూక్కం. వృక్షవిశేషము. (శ. ర.)

**నూఁకు=ఊఁకు.** వి. పూనిక, యత్నము.

సీ. చిఱుతనూఁకుల నంగి జీర్వాఱుగేహావప్రముల నిచ్చిన లేక ప్రాఁకప్రాఁకి. కవి. ౧. ౧౨౦.

నూఁగా(గుటా)రు. వి. (√నూఁగు.) రోమావళి.

ఉ. ఆరమణీలలామ నవయౌవనసంపద నివ్వటిల్ల శృంగారరసంపుబొమ్మ యనఁగా వలిచన్నులుఁ జిన్నిమోము నూఁగారుఁ గృశోదరంబు నలకావలియుం బొలుపొందఁగా దరస్మేర కటాక్షము ల్వ్యాలయఁ జెచ్చెర వచ్చె నిజేశుపాలికిన్. వా. రా. ౫. ౧౨౭.

సీ. ...నూఁగారు నా నలరు రోమ, రాజి ... ఆం. భా. ౨. ౧౪౭.

సీ. కరికుంభమధ్యసంఘటితనీలాంకుశం బనఁ గుచంబుల నూఁగుటారు మెఱయ. బలిర కతివేల్పుశతకము. (చి. ని.)

సీ. కమలోద్భవస్ఫూర్తి సుముఖఁబు భరియింప వారిలీల నూఁగుటారు రతిశయింప. ఇందు. ౨. ౧౯౧.

నూఁగు=నూఁగుడు. వి. ౧. ఆకులు కాయలు తీఁగలు వద్దు మొదలగువానిమీఁద బయలుదేఱు చిన్నచిన్న ముండ్లవలె నుండు సూక్ష్మావయవసమూహము. (దీనియామ్రేడితరూపము నూనూఁగు,నూఁగునూఁగు.)

ఉదా: దూలగొండినూఁగు, దోసనూఁగు, ధాన్యపునూఁగు, బెండనూఁగు మొ.

సీ. తాఁగరాయంచలు నూఁగారఁ బెరిఁగిన బిసములు తమపాలఁ బెట్టికొనఁగ. కవు. ౨. ౬౦.

ఉ. సమ్మదవారి గన్గడల జాలుగ మైగరుపాఱ నిందుబింబమ్మున దృష్టి నిల్పి పయిఁ బ్రాఁకు మరీచుల నూఁగునూఁగు లేఁగొమ్మలు వట్టఁ జంచుపుటకోటిఁ గదల్చి తెమల్చికొంచు శాఖ్యమ్మ విహంగమ మ్మయినయాకృతి నొంచెఁ జకోర మొక్కఁడన్. నిర్వ. ౬. ౫౧.

౨. అప్పుడే క్రొత్తగా బయలుదేఱురోమము, రోమాంకురము.

సీ. పెడపెడ నూఁగారివింతరై యేర్పడుదేరనివళుళలో నారునిగుడ. భార. విరా. ౧. ౨౪౫.

వీణ. తేఁతది.

సీ. నూనూఁగుమీసాలనూత్నయౌవనమున శాలివాహనసప్తశతి నొడివితి. కాశీ. ౧. ౭.

సీ. కలికిసింగారంపు మొలకలోయన ముఖాబ్జమున నూనూఁగుమీసములు తనర. దశా. ౮. ౫౧౨.

నూఁగునూఁగుఁబ్రాయము=నూత్నయౌవనము.

క. తొడరియుఁ దొడరని సిగ్గునఁ, బొడమియుఁ బొడమనియురోజములఁ జాపలమున్, విడిచియు విడువనినడపులఁ, బడఁతుకపై నూఁగునూఁగుఁబ్రాయం బయ్యెన్. కవిక. ౩. ౧౦.

జః నూఁగారు, నూఁగుము, నూఁగుదోస, నూదోస.

నూఁగుము=నూఁగు. వి. (√నూఁగు.)

(ఆకులు, కాయలు వద్దు మున్నగువానికి అంటియుండు సూక్ష్మావయవసమూహము.)

క. బ్రదికెడునంతకుఁ బురుషుఁడు, బ్రిదులక నిలువెల్ల వగలఁ బెనఁగొని యుండున్, గుదురకొని దూదినూఁగుము, పొదివిన కార్పాసబీజమునకుం బ్రతియై. కవిక. ౫. ౧౧౮. (శ. ర. పా. 'దూదిమాఁగుము' అని ముద్రి. పా.)

నూఁగుదోస=నూదోస. వి. (√నూఁగు.) కూఁతురుబుడమ.

ఆ. వెల్లిపప్పు పొట్లచిల్ల మూలము నూఁగు, దోస ముద్గయుగమధూకజాతి, జీరకములం గాఁచి నీరంబు లియ్యఁగా, నెట్టి పైత్యములును మట్టువడును. (చికి. చి. ని.)

నూఁబిండి. వి. (నూవు + పిండి.) నువ్వులపొడి.

సీ. ఉండ్రాళ్ళు నూఁబిండి పులద్రెక్కులుం దేనె యనఁటిపండ్లు... హార. ౬. ౫౫.

నూఁబూవు. వి. (నూవు + పూవు.) తిలపుష్పము, నువ్వుఁబువ్వు.

వ... నూఁబూవువంటి నాసికయు ... హార. ౩. ౨౩.

నూకలు. వి. (తె. నుక్కు.) తండులకణములు.

సీ. ధాన్యశకలములు దనరు నూక లనంగ ...
ఆం. భా. ౨. ౨౩౯. ద్వా. ౨. ౧౭౩.
(వ్యవహారమందు ఏకవచనము కానవగుచున్నది. ఉదా:-గోధుమనూక మొ.)

నూకించు. స. క్రి. (√నూకు. క. నూకిసు.) త్రోయించు.

గీ. ఆటిబల్లిని సోఁకురాయుండు నీప,డంతఁ జేఱి గొని యునిచె నే నెంతమంచి,బుద్ధిఁ జెప్పిన వినక యబ్బురపుఁగినుకఁ, గెరలి వడిఁ దన్ను వెడల నూకించె నిందు. అచ్చ. రా. యు. ౪౨.

నూకు. స. క్రి. (క. నూకు.) ౧. త్రోలు.

మ. హరిణం బొక్కటి ముక్కుతండమ్ముఁ బులిం దానీకముల్ ద్రోచి యు,ర్వరఁ గా లూఁదక దాఁటు నేటులనికిల్ వావాంబు నడ్డంబు నూ, కి రసావల్లభుఁ డేసె భల్లమున... మను చ. ౪. ౪౪.

గీ. అప్పు డతికాయుఁ డౌరౌర యద్రిచరులు, జమిలిచంపులు చంపి రిచ్చట నటంచుఁ, దచ్చమూమధ్యమునకు రథంబు దూఱి,నూకి పాపటు పుచ్చి... రామా. ౮. ౧౬౫.

౨. త్రోయు, గెంటు.

...ష్ఠుఁగాలను దొంటిశివుమీఁదిపూజ, పో తెచ్చినపుక్కిటినీటు,మాను గా శివునకు ...జ్ఞనం బార్చి. బస. పు. ౩. ౭౦౧ పం.

చ. చెలియవయోనులబద్ధ యగుసిబ్బెపుగుబ్బల కల్లి తొంటిలే,ముల డిగ నూకఁగా నవి సము త్కటభీతినిఁ బాఱుచో... కవిజ. ౧./౫౪.

వ... ఈబ్రహ్మచారి శంకరునిగుతించి యింకను వంకరకొంకరమాట లాడ నుంకించుచున్నవాఁడు ఇతని మెడ పట్టి నూకుం డని పలికి కోపావేశంబున. హర. ౪. ౩౩.

౩. పడఁద్రోయు, పడఁగొట్టు.

మ. పురముల్ గూలఁగఁ ద్రోచి సౌధభవనంబుల్ నూకి ప్రాకారముల్,ధరణిం గూల్చి ...భాగ. ౧౦ ఉ. ౩౯౮.

సీ. నుగ్గునూచంబు గా నూకుదు మేమేయధరణీధరంబు దోర్దండశక్తి. సుద. ౫. ౮౦. ద్వి. పరమ. ౫. ౪౨౨ పం.

విణ. త్రోయునది.

వ... చిగురాకుతొగయజిగిపొగరు నూకుటమగులజోడించినపాల వెండిపొగడమ్ములు... ప్రబంధ. ౭౮. (ఇట ఔపమ్యద్యోతకము.)

జ: నూకించు, నూకుడు.

నూకుడు వి. (√నూకు.) నూకుట, త్రోపుడు.

చ. లకుముకులట్లు సగ్వసులఁగూగునఁ గుక్కుటజాతిచాష్పసం, బికములలీలఁ బావురపుఁబిట్టలతీరున కౌక్లిపీటకఘ, నుకములవైఖరిం గవులనూకుడుభంగిని [illegible]వాళ్వయు, గ్రకముల రీతి సింహములగ్రకడిఁ బోరఁ దనూసచాతురిన్. హంస. ౩. ౨౩౨.

సీ. కడు మోరతో ప్రనూకుడుఁ జేసి కోరాడి కొమ్ముల నెగదట్టుఁ జిమ్మచిమ్మి. రామ. ౭౮౭.

త్రోపునూకుడు=బలత్క్యము.

ద్వి. గోపాలకునిఁ దనకురుని వాక్యమును, ద్రోపు నూకుడు చేసి తొల్లిమతేన్యేంద్రుఁ, దరిగిన త్రోవ... నవనాథ. ౨. ౧౦౦ పా. ౨ పం.

నూఁగు=నూవు. (శ. ర. 'నూకులు' ధాన్యవిశేషము అని బ్రా.)

నూచే(ము). వి. పొడి, చూర్ణము; ముక్క, శకలము. (ఇది నుగ్గుపదముతో కలసియే ప్రయోగములందు కానవచ్చుచున్నది.)

ఉ. కొన్నిటి హస్తముల్ సదియఁ గొన్నిటిః గొమ్ములు దుమ్ముదూళిగాఁ, గొన్నిటిఁ గుంభముల్ పగులఁ గొన్నిటిఁ గాళులు నుగ్గునూచగా ... అన్నిటి భీముఁ డుద్భటగదాహతిఁ జేసిక కేఁటులాడఁగన్. భార. భీష్మ. ౨. ౨౧౧.

(నుగ్గు నూచగా= పొడిపొడిగా, మిక్కిలి పొడిగా అనిభావము.)

స్రగ్ధర. కూలుం గుఱ్ఱంబు లేనుంగులు ధరఁ గడయుచుఁ గుప్పలై నుగ్గునూచై, వ్రాలుచున్ దేరల్ ... భాగ. ౧౦ ఉ. ౨౨౦.

మ. సమయాంభోనిధిఁ జొచ్చి చండతరచంచద్వాల మల్లార్చుచున్, సమరోజ్జృంభితజంభశాసనభుజాస్తంభాగ్రదంభోళిదుర్దమశృంగంబున వేదచోరవపురవ్యప్రశ్రేణికల్ నుగ్గునూచము గాఁ డాఁకె సుధాశనాసహానరోషాగర్భనిర్భేదియై. దశా. ౧. ౨౪౪.

(భీముఁడు.) చ ... ఒక్కచే నొగల్, వెరవునఁ బట్టి తేరు ప్రజ విస్తయ మందఁగ వీచి వైచినన్. అ. నుగ్గునూచ మైన నగుడఁ డొండొక, యరద మెక్కి యల్ల నరిగె సేన, మొగమునకు...భార. ద్రో. ౪. ౧౫౮, ౧౫౫.

క. అబ్బిత్తరికిం గన్నుల, పబ్బమ్ముగఁ జూచునపుడు ప్రమదంబునఁ బె, ల్లుబ్బెడుగబ్బిమెఱుఁగుచ, న్గుబ్బలచే రవికె నుగ్గునూచము లయ్యెన్. రా. వి. ౩. ౧౩౦. (నుగ్గునూచములగు=ముక్కముక్కలగు నని భావము.)

నూటయెనిమిది. స. (నూఱు² + ఎనిమిది.) నూఱును ఎనిమిదియు, అష్టోత్తరశతము.

గీ. దివ్యములు నూటయెనిమిదితిరుపతులకుఁ, బరమపద మైనశ్రీసర్వపురమునందు. భీమ.౨. ౬౬.

నూటిడి. వి. (√నూవు.) నూవులతో చేసినభక్ష్యవిశేషము.

మ.ఉడువీథీహరినీలరత్నమయపాత్రోత్సంగభాగంబునం, గడుగారామున శేఖుషాంశునకునంకచ్ఛాయ యన్కమ్మనూ, టిడితోఁ గూడ సుధాంశుబింబ మమ నేయిం ఛాయసాహారముం, గుడువం బెట్టెనొ బంతికూళ్లకును జాళోరంబు లేపారఁగన్. నైష. ౭. ౧౯౭.

నూతనము. సం. విశ. (అ. ఆ. అ.) ౧. నవీనము, క్రొత్తది. ౨. వింత యైనది.

నూతము. సం=నుతము.

నూత్నము. సం= నూతనము.

నూదము. సం. వి. అ. పుం. తూదము, బ్రహ్మదారువు, గంగరావిచెట్టు.

నూదోస-నూఁగుదోస. ౧. నూఁగుదోసచెట్టు.

(శ. ర.) ౨. రేణుకలుచెట్టు.

సీ...తెలియంగఁ దగును నూదోస రేణుకలు ... ఆం. భా. ౨. ౬౧.

క. నూదోసన రేణుక లగు...ఆం.పద.అచర. ౪౩.

నూనె(నియ). వి. (నూవు + నెయ్యి.త.నూవునెయ్యి.)

౧. నువ్వులచమురు, తైలము.

సీ. తైలాభిధానంబు దనరు నూనె యనంగ... ఆం. భా. ౨. ౨౫౭.

వ...ఆకులమోపున ౫౦ ఆకులు నూనెపె(ఱుక) వీసాలు ౨...ద. ళా. ౪. ౯౩౫.

ఉ.సంపెఁగనూనె యంటె నొకచంద్రనిభానన కంసవైరికిన్. పారి. ౨. ౭.

సీ. కమనీయగతిఁ దిలోత్తమ నేర్చుఁగాక నూనియ యంటు నెవ్వారు నేర్తురనుచు. వసు. ౫. ౪౪.

సీ. అతఁడు తైలాభ్యంగ మడిగినఁ బతి గమ్మనూనియ దెప్పించి మేను శిరము, నభ్యక్తములు సేయ...భార. అను. ౨. ౩౦౭.

౨. చమురుకలుగఁ జేసెడువిత్తులు కలచెట్టునకు పిదపవచ్చినపుడు చమురు అనునర్థ మిచ్చును.

ఉదా: కొబ్బరినూనె, ఆవనూనె, వేఁపనూనె మొ.

నూనెముంత. వి. (√నూనె.) గుచ్ఛబలచెట్టు.

గీ. నూనెముంత యనంగను నొప్పు గుచ్ఛ, బలయు. ఆం. భా. ౨. ౫౪.

**నూనెముడి.** వి. (√నూనె.) కీలుగంటు, జాఱుముడి.

సీ. నిడుదవేనలినూనెముడి వీడఁ జిగురాకుఁబోఁడి దూఱుఁ గార్చిచ్చుఁ గడియుకిరణి. మనుచ. ౩. ౩౧.

సీ. బెడఁగుఁ జూపెడునూనెముడి లోనుగా నంటఁగట్టినవాసెనకట్టుతోడ. శుక. ౪. ౩౭.

గీ. కేశబంధవిశేషాఖ్య కేరుఁ గ్రొమ్ముడి యన వెద యన నూనెముడి యన... ఆం. భా. ౨. ౧౪౫.

**నూనెయగిసె.** వి. (√నూనె.) నల్లగిసె, అతసి. (శ. ర.)

**నూపురము.** సం. వి. అ. పుం, న. మంజీరము, అందె.

**నూయమానము.** సం. విణ. (అ. ఆ. అ.) నుతింపఁబడుచున్నది.

**నూయి=నుయ్యి, నుయి.** వి. దే. చేఁదుడుబావి, కూపము. (బ. నూతులు.)

క. అనఘ యధర్మము ధర్మం, బనుమతిఁ బుట్టించుఁ దృణసమావృత మై ప్రచ్ఛన్నితలముచందమునఁ దోఁచిననూయింబోలె నూత్నచిత్ర తతలేమిక౯. భార. అను. ౫. ౪౦౯.

చ. నుతజలపూరితంబు లగునూతులు నూటికంటె నూన్నత,వ్రత యొకబావి మేలు... భార. ఆది. ౪. ౯౩.

నూతఁబడెదో పాతఁబడెదో=కష్టపడుదువా సుఖపడుదువా.

క. జడ లల్లుచుఁ జిన్నప్పుడె, పడఁతులు తను నూతఁబడెదొ పాతఁబడెదో, నుడువు మనుమాట నిజమై, పడె నూతనె యారనూఱుబారలనంగ౯. సారంగ. ౩. ౨౨౨.

నూతికప్ప=కూపస్థమండూకము.

క. విను నూతికప్పవిధమున, నిను నీవ యెఱుంగు దెఱుఁగ నేరవు గర్వం,బున నావలికొలఁది రణం,బున నొకఘుటి వెట్టుబడక పోనేర్చు దనే. భార. ఉద్యో. ౪. ౧౯౬.

నూర్చినూతఁబోయు=నశింపఁజేయు.

ఆ. జ్ఞాతికులము నూర్చినూతఁబోయక పోదు, డెంద మించుకైన డిందుపడదు. ప్రబోధ. ౨. ౫౭.

**నూర్గొనలపట్టెము.** వి. (√నూఱు².) నూఱంచులకైదువు, వజ్రాయుధము.

వ... నూర్గొనలపట్టెంబు పట్టువేల్పుఁజెలువుపలక౯ గట్టినగోపురంబు చూచి... ఉ. రా. ౩. ౨౨.

**నూర్వు(ఱువు)రు=నూఱుగురు.** స. (√నూఱు¹.) (నూఱునకుమహన్మహత్వ్యగకరూపము.) శతసంఖ్య కలవారు.

సీ. అతనికి నూర్వురు సుతులు ఋచీకాదు లుదయించి రఖిలభూవిదితతేజులు... భార. ఆది. ౩. ౮౦.

ఉ. నూఱుక్రావు నీఁతడు కనుం గొనునంతటిలో మనుష్యుల౯, నూఱువు రైనఁ గాని తిన నోటికి నాఁటు దటంచుఁ గూర్పఁగా, నూఱువు రైరి నేఁటికి మనుష్యులు నీవునుఁ గూడ నింతట౯, నూఱును నిండె నిందఱక నుగ్రహ మీళ్ళయఁజేమి సేయుదు౯. శాళ. ౩. ౨౦౫.

**నూర్వే(ఱువే)లు.** స. (√నూఱు.) లక్ష.

క. పాడఁగన్నంతనె వేయును, నుడివినఁ బదివేలు నగిన నూర్వేలు మనం, బోడఁబడి మెచ్చినఁ గోటియు, నడిగెడువారలకు నిచ్చు హాటకచయముల్. ద్వా. ౨. ౫౩.

**నూఱంచులకైదువు.** వి. (√నూఱు².) శతకోటి, వజ్రాయుధము.

ఉ. మించినపేర్మి నేయొడల మిన్నులుముట్టె నుంగునటినా,ఱంచులకైదువు౯ దృణకణాకృతియై పడబాయఁ జేర్చి దర్పించినధీరచిత్తములు వెల్కుఱ నాఁటి కలంప నాళ

మ్యాయంచితచారుచంచలకటాక్షము సమ్మిన
యస్త్ర మిమ్మెయిన్. నృసిం. ౨. ౯౭.

ఇట్టి: నూఱంచులవాలు. ఆం. సం. దేవ. ౧౭.

నూటాఱు(లు, ర్లు). స. (నూఱు² + ఆఱు².) అనేకము.

సీ. సంతలోఁ బ్రతి బిచ్చము లెత్తి నూటాఱు
వగలజన్నిదములు వడికి వడికి. శుక. ౪. ౧౦౯.

క. హెచ్చినరాముని శరముల, నొచ్చినతరువాత
గిరులు నూటార్లు పడన్, వచ్చెనె జలధరము
లపై, వచ్చెం బైపైన చెడ్డవారికిఁ జేటుల్.
రామా. ౭. ౧౨౯.

నూటిపి(ర్పి)డి=నటిపిడి. (శ. ర. √నూఱుచు.)

నూటిపోయు. స. క్రి. (నూఱు¹ + పోయు.) పాఠము మొ. నాఁటునట్లు చెప్పు, బాగుగా బోధించు.

క. తనయులకును మనుమలకును, దన నేరుపు
నూటిపోసి తాల్చినసర్గం, బుచభరము వారిఁ
బూనిచి, పని దీఱి విధాత యానభం
గోలువుండున్. కవి. ౩. ౧౨.

నూఱు¹. స. క్రి. ౧. సన్నెకంటిపై మర్దించు.

ఉ. నూఱక త్రావు నీకఁడు కనుంగొను సంతటి
లో మనుష్యులన్. కాళ. ౩. ౨౦౫. ౪. ౧౩౭.

ఉ. ఇప్పుడు విశ్వభారమును నేలని నేల నిజా
గ్రకోటితో, నొప్పన సేసె దన్యునకు నూరక
నూఱక త్రావువానికే. హ. వ. ౩. ౧౪.

౨. రాచు, నలఁచు.

ఉ. నున్నఁదనంబుగా నలఁగు నూటియుఁ జం
దన మట్లు రాచియున్. భార. విరా. ౨.
౨౨౧.

౩. ఆయుధము మొ. వాడి యగుటకు ఱాతి మీఁద ఒరపెట్టు.

గీ. మదనుఁ డమ్ముల నూఱె హిమంబు పేరె.
మనుచ. ౩. ౨౩.

చ...వేఁటకున్, దురుసుగ మారుఁ డస్త్రముల
నూఱెఁ దమంబును పేరె డిక్కులన్. ఉ.
రా. ౫. ౨౩౯.

సీ. జలమి గిఱ్ఱెట్టింతు మలుకఁ గోఱలు నూఱి
పైవచ్చుభూదారపతులపైన. హ. వ. ౨. ౧౯.

జః నూటిపోయు.

నూఱు². స. ఔ. (క. నూఱు.) శతము, వంద.

చ. నతజలపూరితంబు లగు నూతులు నూటికిం
బె నూన్పృత, వ్రత యొకబావి మేలు ...
భార. ఆది. ౪. ౯౩.

సీ. మనకులం బాదిగా వనగోచరంబుల వేఁట
చాటున నొక్క నూటిఁ జంపె. ద్వా. ౧.
౨౫౧.

ఉ...బాహువుల్, నూఱును జాఁచి పై పెనిచి
నూఱుశిరంబులు నూర్ధ్వదిక్తటుల్, దూఱఁ
గఁ గాలనేమి రణదోహలి యై కడఁగన్
సముద్ధతిన్. హరి. పూ. ౪. ౧౪౪.

నూఱును నిండు=ఆయువు చెల్లు.

ఉ. నూఱును నిండె నిందఱ కను గ్రహా మీశ్వ
రుఁ డేమి సేయునో. కాళ. ౩. ౨౦౫.

జః నూటయెనిమిది, నూర్గొనలపట్టెము, నూర్వు
రు, నూర్వేలు, నూఱంచులకైదువు, నూటా
ఱు, నూఱుగురు.

నూఱుగు(గ్గు)రు. స. (√నూఱు².) నూఱుమంది, వందమంది.

వ...గంధర్వదేవమానవకన్యకలం బదాఱువేలు
న్నూఱుగురు నప్సరోగణంబు లేడింటిం జెఱ
లుపట్టి... ఉ. హరి. ౧. ౭౪.

వ...పదుండ్రు నూర్గురు వేవురు లక్షకోటిసం
ఖ్యాకులం గూడుకొని... దశా. ౨. ౧౬౨.

నూఱుచు(గ్చ)=నుఱుచు.

(వ్యవ.) ఈవేళ మాపొలములో కుప్ప నూఱుచు
చున్నాము.

(నలుఁగఁగొట్టు.)
ప్రబోధ. ౨. ౭౮.

జః నూఱుపు, నుఱిపిడి.

నూఱుపు(ర్పు)=నుఱిపిడి. (క.ర. √నూఱుచు.)

నూలిగరసు. వి. ఇంద్రలుప్తకము, బట్టతల.

సీ...ఇంద్రలుప్తకం బగు నూలిగరసం చనఁ గను ... ఆం. భా. ౨. ౧౨౯.

నూలు. వి. ఔ. అసా. (క. నూలు. త. నూల్.)

౧. తంతువు, ప్రత్తిపడికినపోఁగు, దారము.

ఆ. ఆజ్ఞ వలయు నృపతి కాభీరభిల్లాది,కంపకోల నూల నాజ్ఞ చెల్లు, నంటు సార్వభౌముఁడైన భూపతియాజ్ఞ, కెల్లవారుఁ దల్లడిల్లవలదె. ఆము. ౪. ౨౦౫.

చ. సరసులమర్త మింపుల నొసంగఁ గదంబపు దండఁ గట్టుచోఁ, గరఁగుటఁ జెల్వుదృక్కర శకాంతులు నుత్తర మిచ్చునంతరాం, తర ముల నవ్వులు స్థలుపతండము మొల్లలు నంచు మిన్నుగ్రుచ్చి రహిని రిత్తనూ లొసఁగిసిగ్గు వహింతురు పుష్పలావికల్. ఆము. ౨.౨౦.

సీ. తనరు సూత్రము నూలు దార మనఁగ. ఆం. భా. ౨. ౨౯౫.

౨. (తామర మొ. వానిలోని) దారము.

చ. గొనయము తమ్మినూల్ చెఱకుకోల ధనుర్లత... క్రీడా. ౨.

గీ. శౌరి తామరనూలునఁ గొండ లెల్లఁ, గట్టువడినట్లు విశ్వేఁబు గట్టువడియె. వా. రా. ౨. ౨౪౮.

౩. మొలనూలు.

సీ. వజ్రాలనూలు నొఁగ్వనికటీతటి యొల్లు తాశ్వో పటుదర్భదామకాంచి. పాండు. ౪.౩.

సీ. చాఱలరెంటెంబు సన్నంపుగింటెంబు భాను పందులచాలు పసిఁడినూలు. వరాహ. ౯. ౭౮.

జః నూలుకొను, నూలుకొలుపు, నూలుకోలు, నూలుపట్టు.

నూలుకొ(ల్కొ)ను. అ. క్రి. (√నూలు.)

౧. పురికొను.

గీ. బీఱువోయి రథ్యంబులు మాఱుమొగము, వడినఁ దానొచ్చి యుండియుఁ దడవి కౌరి, నూలుకొనఁ జేసి తఱిమిన వ్రాలి తీవ్రభల్ల మునఁ గ్రీడి భీష్మునివిల్లు దునిమె. భార. భీష్మ. ౩. ౨౫౪, ౧. ౨౩౨.

గీ. వడలి తమతమచతురంగవితతు లెల్ల, నుచిత గతి నూల్కొనంగఁ జేయుచుఁ గడంగి,సంగరోత్సవసంభృతోత్సాహు లగుచు. భార. భీష్మ. ౧. ౯౪.

౨. చక్కఁబడు.

చ. కనుఁగొని ఫల్గునుండు దురగంబుల వాగెలు వట్టి యొత్తి తత్తనువులం నూల్కొనఁగా నివిరి... భార. విరా. ౪. ౧౪౪.

౩. పూనుకొను.

వ...యజ్ఞాదికృత్యంబులు ధనసామగ్రి లేక నడ పరాదు ధనంబు గలిగెనేనియు లోభంబున సంసారులు తత్కృత్యంబులకు నూలుకొన రు గావున నల్పప్రయాసంబున సకలవర్ణము లకు మోక్షంబు గల్గుమార్గం బానతిమ్ము... వరాహ. ౯. ౨.

౪. ఒప్పుకొను.

క. అనుపమము నాతఁడు తగ నూల్కొనివం దానుదితనినదకోదండుం డైయనితరసుల భోద్యము మున, ధనంజయుం డిట్టు లను నతని తో మతియుక్. భార. విరా. ౫. ౧౧౫.

చ...నాకతం,బునఁ బటురోగదుఃఖములఁ బొం దుచు నెచ్చెలు లిట్టు లుండఁగా,మునిజభో గలీలలకు మానస మెట్లయి నాతునూల్కొ నుక్. మార్క. ౫. ౫౦.

౫. సమ్మతమగు.

చ...ఏను కామధేనువ నిను మెచ్చితిక్ మది కి నూల్కొనునిష్టము వేఁడు నాపుడుక్.

ద్వా. ౧౦. ౫౭.

౫. స్థిరపడు.

క. మనము సరస్వతిఁ గనుఁగొని, జననీ నాయన
ను శోకసంతాపమునకు, బొనుఁగుపడి వివే
కమునకుఁ, గొనఁ గొఱయై చాల నూలుకొన
దని పలుకన్. ప్రబోధ. ౫. ౧౭.

చ...నీమది కార్యవృత్తి నూల్కొనియె సు
యోధనుం గని యత్యంతిత నిశ్చయమై...
భార. ఉద్యో. ౨. ౯౬.

౬. వ్యాపించు.

ద్వి. ఓరువరాక బిట్టోకిలిం తొదవ, నోరమ
ద్యపుఁగంపు నూల్కొనఁబలికె. ద్వి. హరిశ్చ.
ఉ. ౧౪౦౨ పం.

౭. కలుగు.

ద్వి. ఇల తొలఁగా లేనియీరామలక్ష్మణులచేత
నెకీను నూల్కొను నింక. రం. రా. యు.
౩౨౫ పా. ౨౧ పం.

స. క్రి. ౧. సమ్మతించు.

మ. ధన ముద్యన్నిధనంబు దేహము విపత్సం
తానగేహంబు భ్రామనితాంతంబు నరర్థమ
విషయాస్వాదంబు ఖేదంబు గన్గొన లోకం
బున శోకమిట్లుతెఁగి నూల్కొలేరు ప్రాణు
ల్ కటా, యనవద్యాత్మసమేధ మానసుఖప
ద్యావ్యాద్యసంచారముల్. ప్రబోధ. ౫. ౩౬

౨. స్థిరపఱుచు.

చ. పలికిన సేమి యన్నియును బల్కనగున్
మనరాజునొద్ద మూర్ఛలికెడువారు లేరు విను
పాండవమధ్యము గాండివంబుదీ, ప్తుల మిఱు
మిట్లు గొన్నకనుదోయి గుణధ్వని వ్రయ్య
లైనవీనులు నయినన్ బలే పలుకు నూల్కొ
నకుండుదు సూతనందనా. భార. ఉద్యో.
౪. ౪౧౭.

నూలుకొ(ల్కొ)లుపు(ల్పు) స. క్రి. (√నూ
లుకొను.) ౧. చక్కఁబఱుచు, సరిచేయు.

వ...అలికదేశంబునం గలయఁబడినయలకంబులు
నూలుకొలిపి...ఉ. హరి. ౫. ౧౪౦.

చ. ఎదురుగఁ బోవనిమ్ము రథ మీతని తేరికి
సన్నాతఁడున్, బదిలముతోడ రథ్యముల
పగ్గము లేడ్తెఱ నూలుకొల్పి యున్నదగతి
నట్ల చేసిన...భార. విరా. ౫. ౧౨౭.

మ. లలనారత్నము నొయ్యనొయ్య మొనత్రే
లన్ నేల వ్రాయించి నిశ్చలవృత్తిన్ వరవర్ణ
పూర్ణఫలకాసంగంబు నొందించి మిన్నుక్కులు
వేమాఱుఁ దదర్థచింతనలతో నూల్కొల్పి
నెయ్యంపుటాజ్ఞలు పైపై నెనయింపసాఁగెఁ
బటుశాస్త్రశ్రేణికాభ్యాసముల్. వసు. ౩.
౧౯౦. (ఇట 'పొందుపఱుచు' అని భా
వము.)

౨. పురికొల్పు, ప్రేరించు.

ఉ...ఈవృపుఁ దమ్ములు నేనును బుట్టినాఁ జ
న్మామండలి నూలుకొల్పికొని మాత్తర నో
ర్చినఁ గాక యొప్పునే. భార. భీష్మ. ౨. ౧౫.

క. కొనిపొండు పసుల నోడక, యని తా నెలుఁ
గించి వీటికై నూల్కొలిపెన్. భార. విరా.
౪. ౨౫౭.

౩. ప్రసరింపఁజేయు, వ్యాపింపఁజేయు.

సీ. హరిణాక్షిలసదపాంగాలోకనము నూలుకొ
లుపును నమ్మరిఁ గొలిపె మరుఁడు. కు. సం
౫. ౫౧౫.

సీ. బంధత్రయంబునఁ బవనంబు మధ్యమనాళి
మార్గమునకు నూలుకొలిపి. వరాహ. ౧౦. ౫౪.
(ఇట 'పూరించు' అని భావము.)

సీ. భ్రమరకంబులఁ బుట్టు ప్రస్వేదకణములు
నొసలికస్తురిబొట్టు నూలుకొలుప. హర. ౫.
౨౯. (ఇట 'అలముకొనఁజేయు' అని భావము.)

౪. కుదురుపఱుచు, నెలకొలుపు.

చ. మనసుల నూలుకొల్పి యనుమానము లెల్లను
బాచి...భార. విరా. ౪. ౧౭౬.

ఉ... సత్క్రియాదక్షత నాకు నూల్కొలి
పి...దశకు. ౩. ౨౦.

గీ. చెంత నందఱ నిడుకొని చేరఁదీసి,కన్నులను
గ్రమ్ముకన్నీరు కరతలమున, నప్పళించుచు
గాద్గద్య మడఁచి యెప్ప, దెలుఁగు నూల్కొ
ల్పి వారల కిట్టు లనియె. ఉ.రా.౬.౨౦౩.

౫. కలిగించు.

గీ. ఎట్టకేలకు భాగ్యంబు హృదయమునకు, నూ
లుకొలుపుచు నారాయణుండు రాముఁ,డనఁ
గ నున్నాఁడు చిత్రకూటాద్రి మీఁద,రామ
సంజ్ఞను వినుతింతు నామహాత్ము. వరాహ.
౫. ౪౪.

నూలుకోలు. వి.(√నూలుకొను.) నూలుకొనుట.
(శ. ర.)

నూలుపట్టు. అ. క్రి. (√నూలు.) దారము వేసి
నూటిగా నుండునట్లు చేయు.

గీ. కర్ణికారాంబికామహాకాళిగుడికి, నందముగ
నూలుపట్టినయట్టిచాయ, నూర్వ్యవీథికిఁ జనిరి
సంశుద్ధమతులఁ, బశ్చిమద్వారమునకు నై
పరమమునులు. భీమ. ౩. ౫౯.

నూవు=నువ్వు, నూగు. వి. సస్యవిశేషము, తిలస
స్యము.

క. నూవుంబువ్వను సంపెఁగ,పూవు గెలిచి బి
రుదుముత్తెపుంజల్లి తగఁ, దా వైచె ననఁగ
ముంగర,తో వసరుహనేత్రనాస తుల శే
కొప్పారు. శశిబిందుచరిత్రము. (శ. ర.)

సీ...తిలసంజ్ఞ నూవనఁ దేజరిల్లు. ఆం. భా. ౨.
౨౩౬.

ఇః నూఁబిండి,నూఁబూవు, నూటిడి, నూనె,నూనె
ముంత, నూనెమడి, నూనెయగిసె.

## నృ

నృ. సం. వి. ఋ. పుం. నరుఁడు, మనుష్యుఁడు.
(దీనికి తెలుఁగున వ్యస్తప్రయోగము లేదు. నృ
హరి, నృసింహము మొ.)

నృకేసరి. సం. వి. న్. పుం. నరసింహమూర్తి
యగువిష్ణువు.

నృగుఁడు. సం.వి. అ. పుం. ఒకరాజు. (వైవస్వ
తమనుపుత్త్రుఁడు శాపకాలాంతరమున ఊసరవె
ల్లియై శ్రీకృష్ణునిచే నుద్ధరింపఁబడినవాఁడు.)

నృజలము. సం. వి. అ. న. ౧. మనుష్యునిమూ
త్రము. ౨. మనుష్యునినేత్రజలము, మనుష్యు
నికన్నీరు. (వాచ.)

నృతి. సం. వి. ఇ. స్త్రీ. నర్తనము, నాట్యము.

నృత్తప్రియము. సం.=నృత్యప్రియము.

నృత్తప్రియుఁడు. సం. నృత్యప్రియుఁడు.

నృత్తము. సం. వి. అ. న. తాళముతోను లయ
తోడను కూడినయాట, అంగప్రత్యంగములచే
భావమును తెలుపుచు ఆడెడిఆట. (నృత్తనా
ట్యలాస్యతాండవ శబ్దములకుభరత శాస్త్రప్ర
కారము ఈషద్భేద మున్నను అవి కావ్యముల
యందు పర్యాయములుగా నే ప్రయోగింపఁబడి
నవి. పదార్థాభినయము నృత్యము, వాక్యార్థా
భినయము నాట్యము, అంగవిక్షేపమాత్రము నృ
త్తము అని సిద్ధాంతకౌముది.)

నృత్తశాల. సం=నృత్యశాల.

నృత్తస్థానము. సం=నృత్యస్థానము.

నృత్యప్రియము. సం. వి. అ. పుం. నెమలి.

నృత్యప్రియుఁడు. సం. విశే. (అ. ఆ. అ.)
తాండవమునందు ఇష్టము కలవాఁడు. వి.అ.పుం.
శివుఁడు.

నృత్యము. సం= నృత్తము.

నృత్యశాల. సం. వి. అ. స్త్రీ. నాట్యగృహము.

నృత్యస్థానము. సం. వి. అ. న. నాట్యరంగము, నర్తనము చేయుచోటు.

నృదేవుఁడు. సం. వి. అ. పుం. రాజు.

నృధర్ముఁడు. సం. వి. న్. పుం. -మనుష్యధర్ముఁడు- కుబేరుఁడు.

నృపకందము. సం. వి. అ. పుం- కందరాజము- రాజపలాండువు, పెద్దనీరుల్లి.

నృపతి. సం. వి. ఇ. పుం. ౧. రాజు, ప్రభువు. ౨. క్షత్రియుఁడు. ౩. కుబేరుఁడు.

నృపతిపథము. సం. వి. అ. పుం. - రాజు పోవు త్రోవ - రాజవీథి.

నృపతివల్లభము. సం. విణ. (అ. ఆ. అ.) రాజున కిష్టమైనది. వి. అ. పుం. గగనవాథునిచే కనుపెట్టఁబడినసర్వరోగనివారక మగు ఔషధభేదము.

నృపత్ని. సం. వి. ఈ. స్త్రీ. ౧. నరులను పాలించుస్త్రీ, రాణి. ౨. మనుష్యునిభార్య.

నృపద్రుమము. సం. వి. అ. పుం. ౧. రాజాదనము, పాలచెట్టు. ౨. ఆరగ్వధము, రేలచెట్టు.

నృపప్రియ. సం. వి. ఆ. స్త్రీ. ౧. కేతకి, మొగలి. ౨. రాజఖర్జూరి.

నృపప్రియఫల. సం. వి. ఆ. స్త్రీ. వార్తాకి, వంగచెట్టు.

నృపప్రియము. సం. విణ. (అ. ఆ. అ.) రాజుల కిష్ట మగునది. వి. అ. పుం. ౧. రాజామ్రము, రాచమామిడి. ౨-కోటచుట్టును ఆవరించి దుర్గమును కాపాడుటచే రాజున కిష్టమయినది- ఒకజాతి వెదురు. ౩. రాజపలాండువు, పెద్దనీరుల్లి. ౪. శాలిసస్యము, వరి. న. ఆతుల్యము, నేలతంగేడు.

నృపబదరము. సం. వి. అ. పుం. రాజబదరము, గంగరేఁగు.

నృపమానము. సం= నృపాభీరము.

నృపలక్ష్మము. సం. వి. న్. న. రాజులకు పట్టెడుతెల్లగొడుగు.

నృపవల్లభ. సం. వి. ఆ. స్త్రీ. ౧. రాజపత్ని, రాజ్ఞి. ౨. ఒకజాతిమొగలి. (రా.ని.)

నృపవల్లభము. సం. విణ. (అ.ఆ.అ.) రాజుల కిష్టమగునది. వి. అ. పుం. రాజామ్రము, రాచమామిడి. న. (వైద్య.) ౧. తైలభేదము. ౨. ఘృతభేదము.

నృపసభము. సం.వి. అ. న. ౧. రాజులగుంపు. ౨. రాజసభ, రాజుకొలువుకూటము.

నృపసుత. సం. వి. ఆ. స్త్రీ. ౧. గంధమూషిక, చుంచెలుక. ౨. రాజుకూఁతురు.

నృపాంశుఁడు. సం.వి. అ. పుం. రాజపుత్త్రుఁడు, రాజుకొడుకు.

నృపాత్మజ. సం. వి. ఆ. స్త్రీ. ౧. కటుతుంబి, చేఁదానుగు. ౨. రాజుకూఁతురు.

నృపాధ్వరము. సం.వి. అ. పుం. -రాజు చేయఁదగినయాగము- రాజసూయయాగము.

నృపాన్నము. సం. వి. అ. న. ౧. రాజుయొక్క అన్నము. ౨. రాజనములు, ధాన్యవిశేషము.

నృపాభీరము. సం. వి. అ. న. ౧. భక్తతూర్యము, రాజుయొక్క భోజనకాలమును తెలుపువాద్యభేదము. (వాచ.)

నృపామయము. సం.వి.అ.పుం.౧.రోగరాజము, క్షయ. ౨. రాజుయొక్కరోగము.

నృపాలుఁడు. సం. వి. అ. పుం=నృపతి.

నృపాహ్వయము. సం. వి. అ. పుం. ౧.-గంధముచేత రాజును ఆహ్వానించునది- రాజపలాండువు, పెద్దనీరుల్లి. ౨. రాజుయొక్క పేరు.

నృపుఁడు. సం.వి.అ. పుం. ౧.-మనుష్యులను పాలించువాఁడు- రాజు, ప్రభువు. ౨. నాలుగు ఆమడలపరిమితి కలదేశమునకు అధికారి.

నృపోచితము. సం. విణ. (అ. ఆ. అ.) రాజునకుఁ దగినది.వి.అ.పుం.రాజమాషము, బొబ్బర్లు.

నృమేధము. సం. వి. అ. పుం. మనుష్యుని పశువుగా ఏర్పఱిచి చేయుయాగము, నరమేధయాగము.

నృయజ్ఞము. సం.వి. అ. పుం. మనుష్యయజ్ఞము, అతిథిసత్కారము. (ఇది పంచయజ్ఞములలో నొకటి.)

నృలోకము. సం. వి. అ. పుం. నరలోకము, భూలోకము.

నృవరాహుఁడు. సం. వి.అ. పుం. నరాంశమును వరాహాంశమును కలవాఁడు,వరాహమూర్తి యగు విష్ణువు.

నృవాహనుఁడు. సం=నరవాహనుఁడు.

నృశంసుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) మనుష్యులను హింసించువాఁడు, ఘాతుకుఁడు.

నృసింహజయంతి. సం. వి. ఈ. స్త్రీ. నృసింహమూర్తిజన్మోత్సవదినము. (ఇది వైశాఖశుద్ధ చతుర్దశినాఁడు వచ్చును.)

నృసింహము. సం. వి. అ. న. ౧. రతిబంధవిశేషము. ౨. ముప్పదిరెండువిన్నాణములలో నొకటి.

వ...గళకర్తరియుఁ గానెనిల్కడయు నృసింహంబును నాది యగుముప్పదిరెండువిన్నాణముల నాణెంబు పరీక్షించి...హంస. ౧. ౧౦౫.

వ...గళకర్తరియు నృసింహంబును గానెనిలుకడయు ననుముప్పదిరెండువిన్నాణంబులను...ప్రబంధ. ౪౮.

నృసేనము. సం. వి. అ.న. మనుష్యసేన,పదాతి.

నృహరి. సం. వి. ఇ. పుం. నృసింహమూర్తి.

మ. నృహరీ వాదము లేల లేరె యితరుల్ నీరీ లకుఁ బాత్రముల్. ఆము. ౨. ౮౧.

## నె

నె[1]. విణ. నెఱ నెతిశబ్దములకు కొన్నిహల్లులు పరమగునపుడు వృత్తియం దంత్యవర్ణము లోపింపఁగా మిగిలినరూపము. (దీనికి కొన్నియెడల నుగాగమమును, కొన్నియెడల దీనిమీఁదిహల్లునకు ద్విత్వమును వచ్చును. ఉదా: నెఱశబ్దమునకు నెందోలు, నెచ్చెలి, నెత్తమ్మి, నెమ్మని, నెవ్వగ మొ. నెతిశబ్దమునకు నెన్నడ, నెన్నడుము, నెన్మేను నెమ్మొగము మొ.)

నె[2]. వి. నెలవుశబ్దమునకు లుప్తశేషము. దీనిమీఁదిహల్లునకు ద్విత్వము వచ్చును. (చూ. నెక్కొను, నెక్కొల్పు మొ.)

నెంజలి. వి. (త. నెంజిటిట్టల్.) మనోవ్యథ, అధి; ఖేదము.

సీ. నెంజలి యనఁగ మనికితం బనఁగఁ జుందుడు కనం దగు మనోవ్యథకు సమాఖ్య. ఆం. భా. ౧. ౧౩౪.

ఉ. మంజులపీఠమధ్యమున మన్మణిభూషణపంక్తిఁ బెట్టి యభ్యంజనతత్పరుండ నగునప్పుడు దాని హరించె నెవ్వఁడో, కుంజగుహాంతరంబుల నిగూఢము చేయునొ వానిఁ జొచ్చియు, నెంజలి బాయఁ జేయుటకు నేర్పరు లారయ మీరలే కదా. కులశేఖరమహీపాలచరిత్రము. ౪ ఆ. (చి. ని.)

క. నూనుఁ డని చాల నెంజల్పియా పెదుగా తల్లి దోస మనకిటు బలిమిఁ, బోనీక పట్టి పెనఁగిన, వానిఁ మఱి యేమి సేయ వలయుం జెపుమా. సారంగ. ౩. ౫౮. పాండు. ౪. ౧౩౩.

క. అలజడి నెఱజిలి పిమ్మట, సిలుగు తలపోటు
వంత నేగి నెగుల్ గొం,దల మలమ టడరు
గోడు,మ్మలిక వనటు కుఱదు నా నమరు దుః
ఖాఖ్యల్. అం. శే. ౧౦.

నెంద్ర. వి. గిరిజతృణభేదము. (బోదవంటిగంటు క
లిగి బోదకన్న సన్నమయినపరకలు కలది. పశు
వులు మేయునది. అని చి. ని.)

నెందోలు. వి. (నెఱ + తోలు.) పెద్దతోలు.
ద్వి. కాయ గాచినయుఱచేయి నెందోళ్లు,గోయఁ
జాఁకినయసిగోఁతడాచేయి. పండితా. దీక్షా.
౪౦ పా. (వ్రాతప్రతి పా.)

నెకబిక. వి. పట్టుదల.
క. ఒకని నోకించుకయును సోఁకక యుండెఁ
గటారిమొనలు కడు బెట్టు వడిన్, నెకబిక
లు గఁ బోట్లాడుచు,నిక సిల్లెడుసాకడిందివీరు
లయుందురు. కళా. ౭. ౧౦౨.

నెక్కురం. వి. ఒకానొకచెట్టు. (శ. ర, బ్రా.)

నెక్కొను = నెలకొను, నెలవుకొను. అ. క్రి.
(నెలవు + కొను.) ౧. వసించు; ఉండు.
క. విను మవ్యక్తం బనఁగాఁ,జను మూలప్రకృతి
పురుష చైతన్యము నెక్కొనినం జేతన య
గుచు భు,వనతంత్రం బెల్ల నడపు వైభవ మె
సఁగన్. భార. అను. ౧. ౩౩౩.
(ఏవం చేతనశ్చ భగవాన్ పంచవింశశ్చచి
న్తే నాధిష్ఠితా ప్రకృతి శ్చేతయతి నిత్యం
సహధర్మా చ... సం. భార. అను. ౩౯. ౩౭.)
సీ. నీకొలంకులఁ జేరి నెక్కొన్న కోకంబు కోక
మాఁజూమ్ము చకోరనయన. రసిక. ౩. ౯౨.
క. ఒక్కొకతె భయశోకంబుల,వెక్కుచు మెయిఁ
గలవిలాసవిభ్రమలక్ష్మల్, దక్కుటయును
నోకరయిఱ పై,నెక్కొన ధరణీశు నెదుర
నిలిచి వినీతిన్. మను చ. ౪. ౫౯.
౨. పాదుకొను, స్థిరపడు.
ఉ. అక్కజ మైనచెల్వమున నాత్మకు ప్రే
గయి పొల్చుపొలితి, నెక్కొనుచూడ్కిఁ
గ్రమ్మఱుప నేరక యూరక నిల్చె... భార.
విరా. ౨. ౨౩.
ఉ. నీ దెస నాదు చిత్తమున నెక్కొని యుండెడు
భక్తి భద్రసం,పాదిని గావుటచ్చెరువె ...
భార. శల్య. ౧. ౨౩౫. మార్క. ౨. ౩౦౯.
౩. తగులు, నాటు.
మ. ఇనుఁ డా రాముఁడు ప్రేమ సారసవనం బీడే
ర్పఁగాఁ జొచ్చి మిం,చినసంధ్యారుచి రక్త
ధారలు ప్రవర్షింపంగ వింటం గరం, బను
వొంద న్నిగిడించుచో సమయవాయవ్యా
స్త్ర ముద్వృత్తి నె,క్కొన మారీచనిశాచ
రుం డనమ్మాగాంకుం డంబురాశిం బడెన్.
సారంగ. ౨. ౧౭౫.
౪. ప్రసరించు, వ్యాపించు.
చ...వాఁడుము వడి వైచె నార్చుచుఁ గడున్
బెనుమంటలు మింటు నెక్కొనం, గనదురు
విస్ఫులింగములు గ్రక్కుమహోగ్నిఁ బోలు
శూలమున్. భా. రా. అర. ౧. ౨౪.
౫. పుట్టు, కలుగు.
వ...అఖిలజనంబులకుఁ బ్రీతి నెక్కొన నతఁ
డమ్మోహారంబు దీర్చునెడ... భార. భీష్మ.
౨. ౩౪౪.
ఉ...కనుగవబాష్పపూరముల్, నెక్కొని క్ర
మ్ముదేర... భోజరా. ౩. ౧౪౨.
గీ. వేఁడి వెలుఁగెండఁ గ్రాఁగినవిన్నుమేన,నెక్కొ
ను చెమటబొట్టునాఁ జుక్క లమరె. పాణి.
౨. ౩౯.
౬. ఫలించు, సిద్ధించు.
ఉ...ఎవ్విధంబులన్, నెక్కొనకున్నె మర్త్యు
లకు నిక్కము ప్రాక్తనభోగ్యకర్మముల్.
పారి. ఉ. ౪. ౬౬.
౭. అతిశయించు, అధికమగు; ఉబ్బు.

ఉ. చచ్చె ఘటోత్కచుండు మన సైన్యము
లెల్లఁ గలంగి సల్లడ, న్విచ్చుటఁ జూచి యేము
వగ నెక్కొన వంతెదము... భార. ద్రో. ౫.
౨౩౭.

ద్వి. చేరి యాదేవుని శ్రీలింగమూర్తిఁ, గోరి
సద్భక్తి నెక్కొనఁగ దర్శించి. ద్వి. హరిశ్చ.
ఉ. ౧౦౭ పం.

ద్వి. నెక్కొన్న చన్నులు నిరుపేదనడుము, పిక్క
టిల్లెడువల్దపిఱుఁదు... రం. రా. ఉ. ౧౦౦ పు.
౧ పం.

(ఈయర్థమున నిది కొన్నిపట్ల వాక్యాలంకారము
గా నుపయోగింపఁబడుచున్నది.)

క. ముక్కంటివరమునను మన, కెక్కుడుభయ
మావహింప హేతు వవధ్యుం, డక్కజుఁడు
పగతుఁ డద్దెస, నెక్కొని సిద్ధింప వెట్టినతికర్జ
ములుఁ. హరి. ఉ. ౨. ౨౨౧.

క. లెక్కఁ గొనక నరుఁ గృష్ణుని,ను క్కణఁగ
బిగించి మూర్ఛనొందించి ధరన్, గ్రక్కు
దల వైచి హయము, నెన్నెక్కొనఁ గొనిపో
యి జనకునిం గవి ప్రొక్కెన్. జై. భా. ౯.
౧౭౦.

౨. స. క్రి. పొందు, పడయు.

క. అక్కట సద్ద్విజజన్మము, నెక్కొనియును
జేసికొనిన నేరమి నిన్నుం, దెక్కొనఁ గష్టపు
బాములఁ, బొరక్కుచు నిన్నేండ్లు లెట్లు వోర
లితి తండ్రీ. పద్మ. ౩. ౯౨.

జః నెక్కొల్పు, నెక్కొలు.

నెక్కొలుపు(ల్పు). స. క్రి. (√ నెక్కొను.)
౧. పెట్టు, ఉంచు; పాదుకొల్పు.

వ... పాండవాగ్రజా నీమనంబున నెక్కొలుపు
మిక్కుధయభిప్రాయంబు. భార. అను. ౧. ౭౩.

సీ. వనమాలికలు వాఱవైచి రుద్రాక్షపూసలపే
రు లటుంత నెక్కొలుప వచ్చు. శుక. ౩.
౯౯. ('ధరించు' అని భావము.)

చ. పొలుపగుమావిశేఁజిగురుఁబొందికపోఁతపిరం
గిలోన నెక్కొలిపినపువ్వుగుచ్ఛ మనుగుం
డు పరాగపుమందు నించి... హంస. ౧.
౨౩౦.

మ. విను నీరూపము చూచి మాన్పపతి యుర్వి
శ్లాఘ నే నెమ్మియిం, బనిగొందుం దగ నిం
తులుం దగిలి నీపైఁ జూడ్కి నెక్కొల్పి
నెమ్మనముల్ విస్మయ మందఁ జూచెదరు
భామా పల్కు లింకేటికిన్. భార. విరా.
౧. ౩౨౧.

౨. సంఘటించు, కూర్చు.

క. అక్కట దైవము రాజ్యము, దక్కొని యా
లిం దనూజుఁ దెగ నమ్మంగా, నెక్కొలిపి హ
రిశ్చంద్రుని, నిక్కడఁ గాడ్పతిచె నింక నేగ
తిఁ బోదున్. మార్క. ౧. ౨౪౭.

నెక్కొలు. వి. (√ నెక్కొను.) నెక్కొనుట.
(శ. ర.)

నెగడి. వి. (త. నెగిటి.) ౧. దుష్టమృగములు
రాకుండ కాపాడుకొనుటకును చలికాఁచుకొ
నుటకును వేసెడుమంట.

గీ... నెగడికిఁ బాచనమున, కింధనము లిచ్చి ధన
ముల నెసకమెసఁగు. భార. అను. ౨.
౩౭౭.

సీ. శీతంబునకు నరశ్రేణు లొనర్చిన నెగడులు
తలుచుగా నెగడి మెఱసె. చిత్ర. భా. ౨.
౩౪.

౨. అగ్నికుండము.

గీ. ఎపుడు నీవు వనం బాసి యేఁగి తపుడె,
నీరమైనను నురిమైన నెగడిమైన, విడుతుఁ బ్రా
ణంబు... శివరా. ౩. ౧౩౦.

౩. కొఱవిదయ్యము, పిశాచము.

సీ... గాలి గాను నెగడి. గీ. కొఱవిరాలుపు
బూచి పోఁతుడు పిసాసి, దయ్య మనఁగఁ
బిశాచాభిధానము లగు. సాం. ని. దేవ. ౧౯.

నెగడించు. స. క్రి. (√నెగడు 1.) నెగడఁజేయు. ప్రవర్తింపఁజేయు.

ఆ. నింగి ముట్టియున్న జంగమమూర్తులన్, శరము నందుఁ గనినవస్తుకవిత, దగిలి వారియందు నెగడింతు రవికి దీపమున నర్చ లిచ్చుపగిది. పో. తి. కు. సం. ౧.౪౯.

౨. వర్ధిల్లఁజేయు.

ద్వి. మగువకు బుంసవనసీమంతోత్సవమున, నెగడింపఁ దొమ్మిదినెలలు నిండుటయు. ద్వి. భాగ. ౪. ౭౪ పా.

నెగడు[I]= నెవడు. అ. క్రి. (త. నిహళ్. క. నెగళ్.) ౧. బయలుపడు, ప్రకటితమగు.

ఆ. అనిన ధౌమ్యుఁ డిట్టు లనియె నీవత్సర, మొక్కఁడు నెట్టులయిన నుడిగి మడిఁగి, సంకటముల నోర్చి చరియించి యాపద, నిస్తరించి పిదప నెగడ వలయు. భార. విరా. ౧. ౧౪౩.

క. గగనంబున కట్టెగసిన, ఖగపతి నంగదుఁడు చూచి కపుల మనుప నీ, ఖగపతి కీ తాకృత్తము, నెగడఁగ వినిపించి చనియె నిజగృహమునకున్. భా. రా. కిష్కిం. ౭౫౯.

౨. ప్రసిద్ధికెక్కు, ఖ్యాతమగు.

చ. తగినసుపుత్రులన్ బడసి...పొందుగతుల్ ...దక్షిణ లిమ్ముగ నిచ్చి యజ్ఞముల్, నెగడఁగఁ జేసియుం బడయునేర రపుత్రకు లైన దుర్గతుల్. భార. ఆది. ౨. ౧౪౯.

క. ఏను బకాసురనను జుఁడఁ, గినాశుఁడ మానవులకుఁ గిమ్మీరుఁ డనం, గా నెగడుదు నీ కాన్యక, కాననమున సర్వసత్త్వఖాదనబుద్ధిన్. భార. ఆర. ౧. ౧౧౨.

ఆ. తనరు ఖ్యాత మయ్యె ననుటకుఁ బేరుగా, నెగడె ననఁగ... ఆం. భా. ౩. ౯౦.

౩. ఒప్పు, తగు.

(నారదుఁడు.) చ...వీణ మీఁటుచును నేడు పదంతులదొద్దనుం గడున్, నెగడెదువింద గల్గె నని నెమ్మది మెచ్చుచు వచ్చెఁ జెచ్చెరన్. కళా. ౩. ౧౨౭.

౪. వర్ధిల్లు, వృద్ధిపొందు.

చ ...నీ, మనమున ధర్మమున్ హితము మంచిగఁ జూచి విధించినట్లు చేసి నెగడువారు గాక నినుఁ జేరిన యాపద లొందనేర్చునే. భార. ఉద్యో. ౩. ౨౦౭.

రగడ. నీకను దెఱచిన నెగడును జగములు, నీ కను మూసిన నిలువవు జగములు. ఉ. రా. ౪. ౯౨.

గీ. పెంపుచెందెను దామరతంపరయ్యెఁ, బ్రబలె నెగడెను...అనఁగఁ బే ళ్లయ్యె వృద్ధిఁ బొందె ననుటకు...ఆం. శే. ౫.

౫. అతిశయించు, మిక్కుటమగు.

సీ. చెలువంబు నెగడఁ దీర్చినక్రొత్తకస్తూరిపట్టె లమేల్తావి మట్టుమీఱు. చంద్రి. ౧.౧౦౭.

సీ. శీతంబునకు నరశ్రేణు లొనర్చిననెగడులు తఱచుగా నెగడి మెఱసె. చిత్రభా. ౨.౩౪.

౬. గర్వించు, గర్వపడు.

క. తనయింట దివియ యుండఁగ, నను డాయు మనందు నెగడి నాతోఁ గొఱమాలినమాటల నిసుమంతయుఁ, గొనకుండఁగ నాడె నిట్టిపట్టిలఁదు కలఁడే. కేయూర. ౩. ౨౭౯.

౭. యత్నించు, పూను.

సీ. పొందమ్మికూండ్లతోఁ బొందు లీనెడుకాను డిగుచు బావి హసింప నెగడు నాభి. గంధ. ౧౯౯.

౮. నడచు, ప్రవర్తించు.

ఆ. విదురుమతము పాండవేయహితార్థంబు, వానిబుద్ధి నెగడ వలవ దన్య, పక్షపాతబుద్ధిఁ బరఁగుచు నుండెడు, నట్టివాని నాప్తుఁ డనఁగ నగునె. భార. సభా. ౨. ౧౫౦.

ఆ. ఇనుడు నరుఁ డిట్టు లను దేవ తమతమ, నేర్చుపనుల వెంట నెగడి బ్రదుక, వలయుఁ గాక నగరఁ దలము దప్పిన మెలం, కువల

కలుపు లియ్యకొనుట దగునె. భార. విరా.
౧. ౨౬౬.

౯. కలుగు, సంభవించు; ఉంకా, ప్రవర్తిల్లు.

గీ. బహువిధంబులఁ బగతుర బరవసమున, నిత్తె
అంగునఁ గలుగు క్రందెల్ల నోర్చి, నిల్చి గొ
ల్చిన సత్కీర్తి నెగడుఁగాక, దవ్వుదవ్వుల
నిలైన నవ్వ రెట్లు. భార. విరా. ౪. ౫౨.

చ... హొచ్చినఘృతపాయసాన్నము భుజించెడి
వారలకుఁ మనోజయంబు నెగడు నేని ఢిం
భ్యము సముద్ర జలంబులఁ దేలియాడదే.
భర్తృ. ౧. ౮౦.

గీ. అల్పులకు మ్రింగఁ జేఁ దైవహాలహాలము,
భంగిఁ బొంగెడు కోపంబు మ్రింగికొనఁగ, నీ
లగళు నెన్ని నిన్నెన్నఁ బోలు నట్టి, నీవు
పాలినఁగా కేల నెగడఁ జేరు. భార.
ఉద్యో. ౧. ౩౩౩.

గీ...మహేంద్ర నాయటిహితుఁడు, నీకుఁ గ
లుగ నసాధ్యంబు నెగడు నెందు. హార.
౩. ౪౪.

౧౦. వ్యాప్తమగు, వ్యాపించు.

గీ. నిండె నెగడె వెలసెఁ బర్వె నిగిడె ననఁగ
వ్యాప్త మయ్యె ననెడి వ్రేళ్ల కలరు సాంబ.
సాం. ని. మాన. ౫౦.

జః నెగడించు, నెగడ్త.

నెగడు². వి. క్రూరజలజంతువిశేషము, తంతునా
గము.

గీ. ఊఁతయలజల్లఁ జెఱువుల నుండ రాక, కా
ర్తొసల్లు నెగల్లను గవులు విడిచి, తగలి చెం
తల నూతిగుంతల వసించె. శేం. పంచ. ౧.
౨౬౪.

గీ. మీలు గప్పలు దాఁబేళ్ళు గాలిదిండ్లు, మొ
సలు లెండ్రలు నెగడులు మొదలు గలుగు,
నీరుద్రిమ్మరిపదుపులు నెఱయ బెఱయఁ, బొ
నరుమున్నీరు సేరి యబ్బురము మీఱ. అచ్చ.
రా. యు. ౩.

నెగడ్త. వి. (√ నెగడు¹.) ప్రసిద్ధి, ఖ్యాతి.

క. ఆలజార్యంతికకశ్యపకులఘాములను రైతె నెగ
డ్తయం జని బహుప్రస్తుతులఁ బడసి పేరుకొను
గొల్లఁ, తులఁ జూడఁగ సరిగ నతికుతూహల
జాగ్రత్తుఁ. కా. సం. ౧. ౧౧౧.

క. శ్రీకంఠగసగతకాన్వ, లోకనతత్పరుఁడు ని
శ్చలుం డఖిలసుకీ, లోకాసంచితకల్పా, నో
కహముఁ దగుమల్లిగుసుండు నెగడ్తఁ. కు.
సం. ౩. ౨౪౪.

నెగపు = ఎగపు. వి. (√ నెగయు. క. నెగవు.)
౧. ఎగురుట, ఉద్గమము.

సీ. అఖిలాండమూలు నొక్క నెగపున దాఁటంగఁ
గలయధ్యుతోగ్రవేగంబువాని. హరి. పూ.
౪. ౯౫. (చి. ని. తాళపత్ర ప్రతిపా. 'నె
గవు'. ముద్రి. శ. ర. పా.)

౨. ఎగసిపాటు, గర్వము. (శ. ర.) ౩. మండి
పడుట. (శ. ర.)

నెగయు = ఎగయు. అ. క్రి. ౧. (పక్ష్యాదులు)
ఎగుసు; పైకి లేచు.

ఉ...తార్క్ష్యుఁడు తల్లికిఁ మనః ప్రీతియొనర్చు
చుఁ నెగసె భీమజవంబున నభ్రవీథికిఁ.
భార. ఆది. ౨. ౩౯.

ఆ ... శాశ్వతంపు, నెలవు గలిగ రండు నెగ
యుండు పుణ్యలోకముల కని సమాదరము
నఁ బలికె. భార. అను. ౩. ౨౪౬.

సీ. నెగసికొన లేచి నింగి యంతంతకు నవుల
ద్రోఁగఁ దనరారుదాని. భార. విరా. ౧.
౧౬౨.

చ. పొగయుక రాఁజ కొక్కమొగి భోరన మం
టలు విస్ఫులింగములు, నెగసి ... పురారి
నేత్రశిఖి మల్చె మహాశనిపాతభీమ పై.
కు. సం. ౫. ౫౭.

౨. ఉద్గమించు, బయలువెడలు.

క. వగచినచిత్తము నలఁదురి, మొగిచినకనుఁగవయు నుదుట మోపినకేలున్, నెగిచివకఁరము నడుఁగక, నెగసిననిశ్వాసతతియు నీరజముఖికిన్. కు. సం. ౫. ౫౭౯.

ఉ. నావుడు నవ్వు నెమ్మొగమున న్నెఁయంగ జనార్దనుండు...ఉ. హరి. ౩. ౬౯. నైష. ౪. ౧౩౨.

౩. (జలాదులనుండి) పైకిలేచు, తేలు.

గీ. నీర ముంచినసొఱకాయ నెగసినట్లు, పేరుకొని పైచు తెల్లంటిచీరవోలె, నుంకు చెందు విధంబున నుత్తరించు,తములపాకు నిక్కెడు క్రియ దాఁటె నిట్టి. ఉ. హరి. ౪. ౨౯.

గీ. కాద్రవేయులు భూమియుఁ గైకొంగ,సుర గలోకంబు వెడలి తత్పరిఖనీట,నెగసి తోడనె క్రుంకుదు ర్నిలువ లేక,తత్తటాబద్ధగారుత్మతముల శిలికి. ఆము. ౨. ౯.

జః నెగపు, నెగయుదెంచు, నెగవు.

నెగయుదెంచు. అ. క్రి. (నెగయు + తెంచు. స్వార్థమున.) -జలాదులనుండి- పైకిలేచు, తేలు.

ఆ. బంధనంబు లెల్లఁ బాయుడు భీముండు,నీరిలోననుండి నెగయుదెంచె. భార. ఆది. ౫. ౧౯౩.

నెగలము. వి. దండము.

వ... అఖండవర్తిన్ నెగలమున దివియ... ద. శా. ౪. ౧౨౭౩.

నెగవు=ఎగవు. వి.(√ నెగయు.)ఉత్పతనము,ఉడ్డీనము. (శ. ర.)

నెగుచు=ఎగుచు. స. క్రి. తఱుము, వెన్నాడి పరుగెత్తించు.

ఆ. వనగజంబు నెగుచువనచారిఁ బొడఁగని, వనగజంబ కాన వజ్రిగజము, వెల్ల నైను రేంద్రు పైచి సుధాంధులు, పట్టఁ బట్టనీక బయలు వ్రాఁకె. భాగ. ౮. ౬౬.

నెగులు=నొగులు. వి. బాధ, కష్టము.

ఆ...నరులు జుంటి,చవియ కాని నెగులుఁ జటిరయుంబున నెక్కి, తారు విఱుగఁ బడుటఁ దలఁపలేరు. భార. శాం. ౬. ౮౩.

గీ. నిజము చెప్పిన నీకు నే నెగులు లేదు. కాశీ. ౪. ౨౨౮.

క. ఇన్నెగులు మాన్ప వలదా, కన్నారం గనిన బంటు గలఫల మనుచున్. కాళ. ౩. ౭౫. వసు. ౩. ౭౮.

౨. దుఃఖము, విచారము.

ఉ...అ,వ్వనితం దోడ్కొని వచ్చి యందతి నెగు ల్వారించి తంచున్ బ్రియం,బున నాచారణు వీడుకొల్పి తనగేముం జేరె...శుక. ౩. ౧౫౩.

సీ. తనవాగమృతధార ధరణిజప్రాణముల్ నిలిపి నామదిలోని నెగులు దీర్చె. ఉ. రా. ౫. ౮౯. సారంగ. ౩. ౯౭.

౩. కీడు, హాని; ఇడుము, ఆపత్తు.

క...ధృతరాష్ట్రసుతు లసద్వృత్తులు ని,ష్కారణవైరులువీరల,కారణమున నెగులు పుట్టుఁ గౌరవ్యులకున్. భార. ఆది. ౫. ౧౬౦.

ద్వి. నెగు లొందినప్పుడు నెఱేఁ దూలపోక. ద్వి. హరిశ్చ. పూ. ౧౨౬౫.

ద్వి. నెగు లింతయును నేమి నెపమున వచ్చె, మగువ నీపే శేమి మగనిపే శేమి. ద్వి. హరిశ్చ. ఉ. ౨౧౦౪.

౪. కోపము; విరోధము, పగ.

చ. మనమునయందు నీ నెగులు మానుము పర్వతపుత్రి... కాశీ. ౪. ౧౫౪.

ఉ. ఓనృప నాకుఁ జూడ నలయుత్తలి నీసుతు నిన్ మనోహరా,మానవిలాసుఁ జూచి నిలుపోపక పట్టిన లోను,గామి నెం,తే నెగు

లూని వానిఁ బొలియింపఁగ మాయలు పన్ని
నిట్లు...సారంగ. ౨. ౮౩.

జః నెగులుకొను, నెగులువెట్టు.

నెగులుకొను. అ. క్రి. (√నెగులు.) బాధపడు.

గీ...పాణిపంకజమున శోకమున్న, కంఠనా
ళాంతరమున గద్గదిక నెగులుకొను నెలుం
గును నెత్తి యాజ్ఞసేనతనయ. భా. రా. యు.
౫౭౯. (ఇట 'కంపించు' అని భావము.)

నెగులువెట్టు. స. క్రి. (నెగులు + పెట్టు.) బాధ
పెట్టు.

సీ. చారుమధ్యముఁ గని శరభముల్ మనిలేవు
నెమ్మోముఁ గని యళుల్ నెగులువెట్టు. భా
రా. అర. ౨. ౩౦౩.

నెగ్గడము. వి. (సం. నికటమ్. ప్రా. నిఘట్టనమ్.
త. నెరుక్కం.) ఒత్తుకొనుటము, సమ్మర్దము. (శ.ర.)
విశే. సాంద్రము, దట్టము.

గీ...అలరు సాంద్రంబు నెగ్గడ మనఁగ...ఆం
భా. ౩. ౧౫.

నెగ్గించు. స. క్రి. (√నెగ్గు1.) ౧. నెఱవేర్చు,
సిద్ధింపఁజేయు.

(వ్యవ.) ఏలాగుననో వాఁ డీకార్యము నెగ్గించి
నాఁడు.

౨. జయము నొందించు, గెలిపించు.

(వ్యవ.) శ్రీకృష్ణుఁడు భారతయుద్ధములో పాం
డవులను నెగ్గించినాఁడు.

నెగ్గు1. అ. క్రి. ౧. నెఱవేఱు, సిద్ధించు.

గీ. మీదుకార్యంబు నెగ్గదు మీర లరిగి, వేగ
సుగ్రీవుచెల్మి గావింపుఁ డటన, వచ్చు కారము
...మొ. రా. కిష్కిం. ౫.

౨. మను, బ్రతుకు.

క...చంద్రికా, మగ్గము వెట్టిన పొదలే, నెగ్గదరో
సింగభూప స్వప్నుమచాపా. చంద్ర. వి.
౩. ౮౩.

౩. శౌర్యసిద్ధినొందు, జయమునొందు.

(వ్యవ.) వానితో కఱుగట్టియున్నంటికి నీవు నెగ్గ
లేవు.

జః నెగ్గించు.

నెగ్గు2. అ. క్రి. (త. నెగ్గు.) బెండువడు, నిస్స
త్త్వమగు.

వ...హరి చటుగంగ బలంబున కూరగరుయు దారున
బెగ్గసిల నగ్గి వేఁటకాండ్రు చోపుడువెట్టఁ
బొదలు వెల్వడి ఓట్లు తగిరిపోవుచాడ్పున.
ప్రబంధ. ౭౦౦.

సీ. అతిశబాహువులతోఁ బ్రతి గాక పిగ్గున నెగ్గి
మృణాళముల్ నీటఁ బడియె. సానందో.
౧. ౭. ౫.

నెగ్గు3. వి. గుండె యదరుటయందలియనుకర
ణము. (దీనికి అనుధాత్వను ప్రయోగమున నెగ్గు
రను రూప మగును.)

ఉ. అరసి కాగ్రగణ్యుఁ డవు దయ్యెదరో భవిచి
త్రకేళికా, గారము సొచ్చి చొక్కుటవుఁ
గంకటీపై నొకమోహనాంగశ్చం, గారునితో
డ తీపకిలిక ర్వెలుఁగ న్నిదురించుచున్నయ,
స్త్రీరజగంధిఁ జూచి యెద నెగ్గురనం గడు
విస్మితాత్ముఁడై. శుక. ౧. ౧౧౫.

నెచ్చు. వి. మెత్తనిబియ్యపు పిండి. (త్రా. మి
క్కిలి సన్నమైన నూకలనుమా హాము అని శ.ర.)

నెచ్చెలి. వి. (నెఱ + చెలి.) ప్రియమిత్రి,
గాదిలిబిడ్డ.

ద్వి. కలపలికడఁ బలుకలఁతి నెచ్చెలి, కల
నొప్పఁ దక్కుఁ దవ్వల నొప్ప... ద్వి. పర
మ. ౩. ౫౧౪ పా.

నెచ్చెలి. వి. (నెఱ+చెలి.) ౧. ప్రాణస్నేహితురాలు; ప్రాణస్నేహితుఁడు.

ఆ. వచ్చి కొలువు సొచ్చి నెచ్చెలిపిండు నం, తంత నిలువఁ బనిచి యాలనల్లఁ, గదిసి ప్రౌఢ వనితకైవడి ముద్దియ, ముద్దు వుట్టఁ బనకు మ్రొక్కుటయును. భార. విరా. ౧. ౨౪౬.

సీ. తెలిగన్నుఁగవకు నెచ్చెలి యైనకేతన వ్యాలయంగ సరసంపుఁబలుకు వలికి. భార. విరా. ౨. ౬౪. (ఇట ఔపమ్యద్యోతకము.) భార. అర. ౩. ౧౩౪.

ఉ. కాంచిరి నిర్జరేశ్వరులు...ధీరతం, గాంచన భూధరంబునకు గాదిలినెచ్చెలి యైనవాని నిర్వంచితదానశక్తి సురరత్నముఁ బోలెడు వాని నైషధున్. నైష. ౩. ౮౦.

౨. స్త్రీ, ఆఁడుది.

ద్వి... వేల్పునెచ్చెలులపాలిండ్లఁ, గలకలనవ్వు బంగారు కుండలను. ద్వి. పరమ. ౩. ౧౪౬ పా.

సిరితోడునీడనెచ్చెలి=భూదేవి.

ద్వి. సిరితోడునీడనెచ్చెలి తనయింటి, కరుదెంచినప్పుడే యఖిలసంపదలు. ద్వి. పరమ. ౫. ౩౩౫ పా.

నెచ్చెలికత్తె. వి. (నెచ్చెలి+కత్తె- స్వార్థమున.) ప్రాణస్నేహితురాలు.

ఉ. ముచ్చిలి గంధవారణసమూహముకుంభవిలాససంపదల్, ముచ్చిలి మించుపయ్యెదలలోపల డాఁగుచు నుండు నెప్డు మీ, నెచ్చెలికత్తెచన్నుఁగవ నీవు విచారము సేయుమా మదిన్, ముచ్చులఁ గిట్టి పట్టుదురు నొంపుదురే మనవచ్చు రాజులన్. నైష. ౭. ౬౯.

ఉ. ఆడెడునమ్మఁ గన్గొనకు మమ్మ...తలిర్చుమావి క్రిందికిఁ బోకు మమ్మ యని నెచ్చెలికత్తెకుఁ జెప్పి సమ్మతిన్. కు. సం. ౫. ౬౧౦. ధీమ. ౧. ౪.

నెచ్చెలికాఁడు. వి. (నెచ్చెలి+కాఁడు- స్వార్థమున.) ప్రాణస్నేహితుఁడు.

సీ. మంగళాంగుపసిఁడి యప్పాఁగరకుఁడు చేదోడు నెచ్చెలికాఁడు తోడునీడ. పి. శకుం. ౪. ౧౨౪.

చ. అని వర మిచ్చి శూలి రజతాద్రికి నెచ్చెలికాని వెంటఁ దోడ్కొని చనుదెంచె... ఉ. రా. ౭. ౩౧౮. ఘటికా. ౧. ౮౩.

నెచ్చెలువ. వి. (నెఱ + చెలువ.) మిక్కిలి మనోహరురాలైనయాఁడుది.

సీ. తనజాతికొమ్మ సెండిసమున్నతి బంధుజీవంబు వడఁకె నెచ్చెలువ చూడు. ఉ. రా. ౧. ౧౩౧.

నెటిక(కె)= నెటికె. వి. (క. నెటికె. త. నెట్టి.) అంగుళిపర్వము, వ్రేలిగనుపు.

చ. నెటికలు దీసి యిష్టకము నేర్చి ప్రసంగము దీసి...విటులఁ గలంచి తీయఁ దగు విత్తములు త్తరవార కాంతకున్. విప్ర. ౪. ౨౩.

చ. నెటికలు దీసి చే విసికి సిక్కు యొకించుక యావులించినం, జటికలు వేసి...వాసి గను పొత్తులతొత్తుల కేవ సత్తెముల్. బహు. ౫. ౧౬౬. ద్వి. పరమ. ౩. ౨౦౪ పా.

నెటికలు విఱుచు=౧. వ్రేళ్లసంధులను విఱుచు.

ద్వి. అసలార నాయుష్యహస్తతలంబు, నటు సాఁగఁ దిగుచు నప్పటివ్రేళ్ల, నెటికలు విఱుచుచు నెమ్మి నొత్తుచును. పండితా. పురా. ౧౦౪ పా.

౨. ఏవగించుకొను.

సీ. తనకు లేమిని నొడ్లధనము పెంపును జూచి విధిమీఁద నెటికలువిఱిచి విఱిచి. పద్మ. ౨. ౨౩౯.

ఇక్లే: నెటికె విఱుచు.

సీ. మమతతో నాథుండు మాటాడి యుంచుక

యటు మొగంబైనచో నెటికెవిఱుచు శశాం. ౪. ౩౨.

**నెటికెతట్లు.** వి. బ. బాలక్రీడావిశేషము, పిల్లల యాటలలో నొకటి.

సీ. తిరుగుడుబిళ్లల త్రిప్పుళ్లు జరుగుళ్లు చిటితా ళములాళలు నెటికెతట్లు. హంస. ౩. ౧౪౭.

**నెటుకురు.** వి. వీపు మొదలగువానికిఁ గ్రక్కదలికవలన కలుగుధ్వని కనుకరణము.

సీ. అష్టోత్తరశతవ్రణాఢ్యముఁ డగురాజపిటుకు నటును వీపు నెటుకు రనియె. జై. భా. ౭. ౧౩.

**నెటుకుటు.** వి. (ఎముకలు మున్నగునవి) ఖండించుటయం దగుధ్వని కనుకరణము.

దండకము... వజ్రసారాసిపాళిఁ నెటుక్కుంచు ఖండించుచుఁ... దశా. ౪. ౨౩౨.

**నెట్ట.** క్రి. విణ. (త. నెట్టై.) మిక్కుటి, అధికముగా.

గీ. విరహకాలంబు మరుబాణవితతిఁ గొన్ని, గంటు లన్నియుఁ బ్రియుఁ గూడి కైపు మిగిలి, పెనఁగునెడ నెట్ట విరిసె నా వనితమేనఁ, గలయ నవనఖదంతవిక్షతము లడరె. కు. సం. ౭. ౧౩౭.

సుగంధి. చాలుఁ జాలు నెంత కెనఁ జాలు నున్న గన్నెరుల్, కేలపూల కేల గోల రేయు నిందులోనఁ బో, నేల తాళు మన్న నన్ను నెట్ట దిట్టె నక్కటా, మేలు మేలు ముద్దరాల మెచ్చు వచ్చె నామదిఁ. యయా. ౪. ౨౦.

**నెట్టన.** క్రి. విణ. (క. నెట్టన. త. నెట్టం.) ౧. మిక్కుటి, అధికముగా; నిండుగా, సమృద్ధముగా.

సీ... నెట్టన యెంతేని నెతి గరంబు... అత్యంతముగ ననుట శాఖ్య లయ్యె. ఆం. శే. ౫౩.

ఉ. నెట్టన ధర్మనందనుఁడు నిన్ను బలంబున నేసి యోడతోఁ, గట్టినయోడవోలె గతగౌరవుఁ జై కడుఁ దూలె... భార. సభా. ౨. ౪౦.

క. ఇట్టివిధంబులు నిఖిలము, నెట్టన ప్రత్యక్షము గను నీవలనను జూ, పట్టఁగ శిబికాభారం, బెట్టో లే దంచుఁ బలికి తిప్పుడు నాతోఁ. వి. పు. ౩. ౫౭౭.

మ... నేతులుఁ, వరుగుల్ చేరులు పప్పు లప్పడములుఁ దాలింపులుం బూపముల్, పరమాన్నంబులుఁ బెట్టు నెట్టన భుజింపఁ దల్లికిఁ దండ్రికిఁ. పాండు. ౨. ౨౪.

౨. అవశ్యము, తప్పక.

క... ముఁ, గట్టినకర్మఫలంబులు, నెట్టన భోగింపకుండ నేర్తురె మనుజుల్. భార. ఆసి. ౫. ౫౭.

క. పెట్టితిరి చిచ్చు గృహమునఁ, బట్టితిరి తదీయ భార్యఁ బాడడవులకుం, గొట్టితిరి వారు మనుపఁగ, నెట్టన భరియింపవలెనె నీ ప్రాణంబుల్. భాగ. ౧. ౩౧౨.

ద్వి. వినుము హరిశ్చంద్రవిభుఁడు వసిష్ఠముని మాట చెల్లింప మోరత్రోపునను, నెట్టన సత్యంబు నెఱపెద ననుచు. ద్వి. హరిశ్చ. ఉ. ౧౩౫౯. పం.

౩. న్యాయముగా, పాడితప్పక.

సీ. కవచధారణ మనుమఖునవిద్య గవ్వడి కే నె తింగించితి నితఁడు దాని, నేర్చుట నీతని నెట్టన నొప్పింప శక్యంబు గాదు... భార. ద్రో. ౨. ౧౦౫.

౪. నిజముగా, యథార్థముగా.

ఉ. నెట్టన యాపగాసుతుఁడు నేలకుఁ గూలె నసంగ విన్న నా, కట్టెడివీను లేమి వినుకాటియ కోర్వవు... భార. భీష్మ. ౧. ౩౫.

ఉ... ఏ, పట్టున నెల్లవారు గనుపట్టక హీనదశం జరించుచో, నెట్టన సర్వశూన్యుఁ డని నిందితుఁ డయ్యె దరిద్రుఁ డెంతయుఁ. నా. పంచ. ౨. ౧౧౧.

౫. చక్కఁగా, ఒప్పుగా.

ఉ. నెట్టన యల్ల లచ్చియును నీళియు భూపతి యుండ నీవు నీ, నెట్టిక పీలపై మనసు నిల్పుట కే మన వచ్చు... ఆము. ౬. ౧౧౧.

౬. తెగించి,సాహసించి.

క. నెట్టన సభలో నేవుర,కట్టెదుర వరాతితన ముగా కాంతయు వా,రెట్టితులువలో ద్రౌపది, నట్టులు పట్టిచెడిరె జూద మాడరె యెం దుఁ. భార. ఉద్యో. ౧. ౩౭౪.

క. ఎట్టిట్లు పలికి తీ విది, యెట్టోసరింపంగ వచ్చు నీపని దేహం, బెట్టోకనిదేహమున కై,నెట్టన యీవచ్చుఁ దండ్రి నిక్కము చెపుమా. మార్క. ౧. ౩౬.

౭. అనాలోచితముగా, తొందరపడి.

ఉ. నీతి దొలంగి కార్యముల నెట్టన యాగ్రహ వృత్తిఁ జేసినఁ, బ్రీతిగ సిద్ధిఁ బొందినను భీ తియుఁ గుత్సయుఁ బుట్టు... భార. శా. ౧. ౩౫.

చ...ఉదకంబుల నీ విటు తుండ ముంప నా, నినదము హస్తినాద మని నెట్టన యేసితిఁ దప్పు నేసితిన్. భా. రా. అయో. ౧౫౬.

౮. చెచ్చెర, శీఘ్రముగా.

(కీచకుఁడు.) చ ... పైకొనుతలఁ పొరగించు మదిఁ గోర్కులు పేర్చిన నప్పళించు నెట్టన తెగ నగ్గలించు నచటన్ జనులం బరికించు ...భార. విరా. ౨. ౩౧.

క. అట్టియెడ సకలసురులును, నెట్టన కొలువంగ వచ్చి నీరజభవుఁ డా,జెట్టిని భూలోకమున కుఁ, బట్టము తగఁ గట్టి సార్వభౌమునిఁ జే సెన్. వి. పు. ౨. ౧౫౩.

ద్వి. పట్టి వధించు టే పౌరుషం బనుచు, నెట్టన మొల నున్న నెతికత్తిఁ దివిచి. ద్వి. పాంచా. పూ. ౨౦౩౬ పం.

౯. కొంచెమైనను, అల్పమైనను.

చ. అనవుడుఁ బిన్నన వ్వ నగి యన్నరుఁ డన్న మొగంబుఁ జూచి నె,ట్టన బలుమాట లా డఁగఁ గడంగఁగ నొల్లక యత్యుదాత్తతన్. భార. భీష్మ. ౧. ౧౭౫.

నెట్టన(ణ)ము. వి. (త. నెట్టంకమ్.) ౧. అతి శయము, పెంపు.

గీ. అనిన నాపుప్పఁబోఁడి నెయ్యమునఁ బలి కెఁ, జిలుక కైవడి గండుఁగోయిలవిధమున,వీ ణె బాగునఁ జెవులకు విందు గాఁగ, నెట్టనం బునఁ దేరియ లుట్టిపడఁగ. చిత్రభా. ౫. ౩౪.

విశే. ౧. అనివార్యము, కాకతప్పనిది.

గీ. పాత్ర మెఱుఁగనిచెనఁటిభూపతులయిండ్ల, కట్టనియతాత్ములు నైన నేఁగఁ జేయు, ద్వారనిలయులు వారింప వారి నచట, నిలు వఁ బెటును గామంబు నెట్టనముగ. శివయో గసారము. ౨. ౨౧.

౨. పూర్ణము, సమగ్రము.

గీ. దరిసెనం బిచ్చెఁ దాతలతరమునాఁటి,కట్టు బండి యొక్కరికు నెట్టనముగఁ, బరుపుతోఁ గూడ నుర్వ్యులపట్టెమంచ, మర్పణముఁజేసె నొక్కశీతాంశుముఖికి. రుక్మాం. ౪. ౧౦౪.

౩. యథార్థము, నిక్కము.

సీ. ఎట్టివాఁడు గురుండు నెట్టణంబుగ శిష్యు లెవ్వరు సోదరు లెట్టివారు. శివయోగసా రము. ౨. ౧౯౦.

నెట్టపంట. క్రి. విశే. నిష్కారణముగా.

సీ. నెట్టపంట యనంగ నిష్కారణం బంట... ఆం. శే. ౫౬.

నెట్టము=నెట్టెము. వి. ౧. శిరస్త్రాణము, గుండ్ర పాగ.

వ. ఇట్లు సురాసురయోధులు హరిసనా థంబులై కవచంబులు నెట్టంబులుఁ బెట్టుకొని ...(ముద్రితప్రతులపా. 'నెట్టనంబులు' చి. ని.పా. 'నెట్టెంబులు' తాళపత్త్రప్రతిపా.)

౨. నెమలియీఁకలతోఁ జేసినదారములపాగ.

గీ. నెమలియీఁకలఁ జేసు దారములపాగ, నెట్ట
మని పల్కఁగాఁ దగు.. ఆం.భా. ౩.౩౪.
(క్రొత్తప్రతి, తాటాకుప్రతి బ్రౌ. పా. చి.ని.
'నెట్టెము' ప్రాఁతప్రతి పా.)

నెట్టించు. స.క్రి. (నెట్టు+ఇంచు. స్వార్థమున.)
౧. జయించు, గెలుచు.

శా. నీలుక్ శౌర్యగుణాలవాలు ననిలో నెట్టిం
చువారే రిలన్. సీతావి. ౧. ౧౦౯.

౨. అతిశయింపఁజేయు, పెంపొందించు.

క. గట్టిగ రాలను మంటను, గట్టిన దేవాలయ
మును గలిగినవారల్, నెట్టించి రాలచేతను,
గట్టించినయిల్లు నొక్కఁగతి పుణ్య మగున్.
శేష. ౨. ౯౨.

నెట్టిక = నెటిక. వి. (త. నెట్టై.) అంగుళిపర్వము,
వ్రేలిగనుపు. (చూ. నెటికసీల.)
జః నెటిక సీల.

నెట్టికసీల[1]. వి.(√నెట్టిక.) వ్రేలిగనుపులోనిసీల.

గీ...గొరిగపడుచు, వాడుచున్నది చూడు మూ
ర్ధాభినయము, తాను నెట్టికసీలంతగాని లేదు.
క్రీడా. ౧౪౩. ('చాలచిన్నది' అనిభావము.)

నెట్టికసీల[2]. విణ. (సం. నైష్ఠికశీలః. ప్రా. నెట్ఠి
అసీల.) ౧. బ్రహ్మచారి; బ్రహ్మచారిణి.

వ... ఆపాటి నెటికసీలఁ డిట్టుపడుచు కడుపు నిండ
మి రొమతింగి తరంగితాంతరంగ డై యాకు
రంగనయన యిట్లని వితర్కించు. పాండు.
౪. ౧౪౯.

క. పట్టినచలమున నీగతి, మట్టముగా నేనఁ బిలు
కుమార్చి గదలిరా, నెట్టికసీలలు మదిలోఁ,
బుట్టినహర్షముచఁ దమతపోవనమునకున్. జై.
భా. ౫. ౧౯౦. ('నట్టికసీలలు'. చి.ని. పా.)

ఉ. నెట్టన యల్ల లచ్చి యల నీళయు భూసతి
యుండ నీకు నీ, నెట్టికసీలమై మనను నిల్పుట
కే మనకచ్చు... ఆము. ౫. ౧౧౧.

నెట్టు. స.క్రి. (త. నెట్టు.) ౧. గెంటు, త్రోయు;
పడఁద్రోయు.

క. వీని మోదఁ బట్టి నెట్టుఁడు, పోనీకుం డనిన...
ఉ. హరిశ్చ. ౪. ౧౫౭.

ఉ. వారక సైపఁగాని బొగలించ్చు మహోవిరహాం
బురాశి సే, సేగహాఁ నీఁదుబానఁ దుది
నెన్నఁడు గ్రుంకుఁడు మాయఁజేనియుఁ, దీర
ము మీఁఱ నేఁడుఁ డోక నెట్టున నెట్టినఁ బోవ
నట్టియా, వితేఁడి జీర మేఁటి కని వేమఱు వే
మరు లేఁచుచుండఁగన్. కృ. శతం. ౨.
౨౧౧. ద్వి. నల. ౪. ౩౧౦.

క. నెట్టిరి విషాన్న మంటుం, గట్టిరి ఘనపాశము
లను గంగానదిలో, నెట్టిరి రాజ్యము వెడలం,
గొట్టిరి ధర్మంబు విడిచి కుటిలాత్మకు లై.
భాగ. ౩. ౧౩.

౨. నిరాకరించు, నిరసించు.

ఉ... వేడుచోఁ, నప్పన నెట్టి పోఁ డడిగినన్నివరా
లిడుఁ గొండమీఁదితి, మ్మప్పనివంటి కావ్యపతి
యబ్బుట యాబ్బుర మిబ్బు ధాత్రికిన్. రా.వి.
౧. ౨౫.

అ. క్రి. ౧. అతిశయించు, మిక్కుటమగు.

క. అనుటయు భగభగ మండెడు, కనుఁగవతో
నొడల వడయుకంపముతో నెట్టిననిట్టూర్పుల
తో మొగ, మునఁ దనికిన కెంపుతోడ ముని
పతి యుండెన్. ఉ. హరి. ౪. ౧౯౯.

వి. ౧. గెంటు, త్రోపు.

గీ. కుఱుచ నెట్టున నందియల్ చఱచి మొరయ.
కవిక. ౩. ౧౫౧.

ద్వి. నిడు పాగిలఁగ నెట్లు నెట్లు వడంగ, మెడ
పట్టి ద్రొబ్బి గామిడితొండ యనుచు. ద్వి.
పరశు. ౪. ౩౦౨ పు.

౨. ఉపహతి, నాశము.

గీ. ఉపహతియుఁ దావు నెట్టన నొప్పుచుండు.

ఆం. భా. 3. ౫౦.

3. విషయము, పట్టు.

క. విన నెన్నే నటుకలెం గా, నీనను కోరాదు గా
క యెల్లసుగుణముల్, నే నీయక లేదు సు
మ్మీ, యీ నెట్టున నీవె మీఁద నెతిఁ గద విం
కక. దశా. ౨. ౩౩౪.

4. తావు, ఉనికిపట్టు,

ఉ. అక్కొలినా త్తమునఁకు కస వారసి తె మ్మని
కూఁతు చేతికిం, జెక్కొడుఁ బాఱ యీఁయు వడి
నెట్టది శిల్వడి చేనిమంచె పై, నెక్కొనజారుఁ
గూడి రమియించి దిశాంతమునందు వచ్చి
బల్లాక్కొలునా మొగంబున విదుర్చును గొ
న్నిత్ర్పణాగ్ర ఖండముల్. శుక. 3. ౪౧౦.

ఉ. మట్టిన బిట్టు మిట్టిపడి మాని సముత్తితుఁ డ
య్యె మేనిపైఁ, బెట్టినపుట్ట నె ట్టవిని బీఁటలు
వాఱ...పాండు. ౫. ౨౪౯.

గీ. ఉపహతియుఁ దావు నెట్టన నొప్పుచుండు.
ఆం. భా. 3. ౫౦.

5. (బ) బాలక్రీడావిశేషము.

సీ. చీకటి మొటికిళ్ళు చిమ్ముబిల్లలు నెట్టు బొట్టన
గ్రోలలు బొమ్మరాలు. గీ. ఆదిగా శైశవక్రీ
డ లాడి రచట, రామకృష్ణులు గోపబాలకు
లఁ గూడి. వి.పు. 8. ౨౦౨.

౬. పూనిక.

గీ. అంజక యశేవ సుమనోవనాగ్ర దేశ, ముఖర
భూరిద్విజావళిప్రాల నెట్టు, గా నిలువ నేర్చు
నాత్మయోగంబుఁ బొటఁగి, సనుదు గా కని
తాల్చె రూఢప్రతిజ్ఞ. పా.స. ౧. ౨౯.

జః నెట్టించు, నెట్టుకొను, నెట్టుకోలు, నెట్టుకు
గాయు, నెట్టుపడు, నెట్టోము.

నెట్టుకొను = నట్టుకొను. అ. క్రి. (నెట్టు + కొను.)

౧. నెలకొను, నివసించు; కుదురుకొను, స్థిరపడు.

క. నెట్టుకొని యుండు నావర, పటునగున సకల
దితిజపతులమకుటసం, ఘటితపదపీఠుం డగు,
నట్టిజగన్నాయకుండు హరి యెల్లపుడున్.
పరమ. ౬. ౧౩౦.

ఉ... భక్తిరసంబు గడలా వనంబులలా, నెట్టు
కొనంగ రంగశయుని భజియించె... పరమ.
౫. ౩౭౯.

వ... గానలోభంబున వచ్చు టింటియ కాని మతి
పీఠ వారనుం బలెఁ జట్టనంబుల నెట్టుకొని
యిట్టునట్టు వహింప లుపచరించువారము
గాము... కళా. ౩. ౪౦.

౨. కలుగు, సంభవించు.

గీ. గురుని వెంబడిఁ గా నొకకొంతదూర, మరిగి
యాతనియనుమతి నంబుజాక్షి, క్రమ్మఱఁగ వ
చ్చునాలోనఁ గంబుకంఠి, పట్టఁ గూడనితమ
కంబు నెట్టుకొనఁగ. శకాం. ౩. ౪.

౩. అతిశయించు; చెలరేఁగు, విజృంభించు.

వ. ఇట్లెందు నెదురు లేక యతండు లెక్కకు
మిక్కిలి యగురక్కసిమూఁకల ప్రేఁకంబుల
తో జగంబులు వగలం బొగల నెట్టుకొని
కుతిలపెట్టుచు నొక్కనాఁడు. యయా.
౬. ౭౪.

గీ... పట్టుపగలె, నెట్టుకొని యెల్ల ప్రేతలనట్టులం
దు, గుట్టు లగయుచు మెలఁగునప్పటి మతి
యయి. నీలా. ౧. ౩౫.

వ... నాఁటి నిగ్గిరికి నిప్పుడు గొన్నివాసరంబుల
నుండి యీరసంబు పెరుగం గఱకతి నెట్టు
కొని సాఁగుచున్నది... కాశీ. ౧. ౧౦౦.

౪. కడఁగు, పూను; పూనుకొను.

సీ. కుదియించునది నెట్టుకొని యింద్రియవ్యా
ప్తి మనను చాంచల్యంబు మాన్పునదియు.
కాశీ. 3. ౧౧౯.

వ. కావున నీమనంబున ఘనం బైనవంత యావం
తయుం బెట్టుకొనక నెట్టుకొని యమ్మహాధ్వ
రంబు సాఁగింప నుద్యోగింపుము... జై. భా.
౧. ౩౪.

క. నెట్టుకొని కొలుతు నన్నయ, భట్టోపాధ్యా
యసార్వభౌమునిఁ గవితా, పట్టాభిషిక్తు భా

రత,ఘట్టోల్లంఘనపటిష్ఠగాఢప్రతిభుఁడు. భీమ. ౧. ౮.

౫. పట్టుపట్టు, అభినివేశము కలిగియుండు.

ఆ. నృపకులాబ్ధిచంద్ర నీ వింత నెట్టుకో,వంగఁ ద్రోచి పోవ నాకుఁ దగదు. భోజరా. ౪. ౨౩౬.

గీ. భరతశత్రుఘ్ను లిరువురు పాదయుగము, పట్టుకొని రాక విడ మంచు నెట్టుకొనఁగ, దొరయునగవునఁ దనదుపాదుక లొసంగి, పనిచె రఘుభర్త పురికి నుభరతుభరతు. దశా. ౭. ౨. ౨౫.

క. ఏమిటికి నెట్టుకొనియెదు, నీమాటల నాకుఁ గడుపు నిండునె పుత్రవ్యామోహ మేల విడువవు, నాముందటఁ బ్రదులవచ్చునా నీ కింకన్. భోజరా. ౬. ౫.

౬. స. క్రి. త్రోసికొను, గెంటుకొను.

క. నెట్టుకొని వరుని గనుచోఁ, బట్టనమునఁ గల సమస్తభామల కవాహో, యెట్టివిచిత్రమొ మనమునఁ, బుట్టినవాఁ డపుడు మనసుఁ బుట్టించెఁ జుమీ. విజ. వి. ౧. ౧౫౪.

నెట్టుకొలుపు(ల్పు). స. క్రి. (√నెట్టుకొను.) కావించు, కలిగించు.

వ... తమలపాకుఁదీఁగెయల్లికలమీఁద మించి వెల్లితలచుట్టుకట్టడలు నెట్టుకొలుపుతోలు బట్టలపాదుగుళ్లమెఁగ్రొమ్ముడుఁగు నెతిబిటును చుంగులనిక్కిచెక్కను...కళా. ౬. ౨౨౮.

మ. అమితిం గన్నులు త్రిప్పఁ జేయుఁ గడు వింతా గాత్రభంగంబు వి,భ్రమవాక్యంబులు నెట్టుకొల్పు మదనాపస్మారము... మల్లభూ. శృం. ౫౪.

౭. ఉండఁజేయు, ఉంచు.

వ ... అజ్జలజభవుండు తద్విరహాదశావికలితధైర్యుం డయ్యు నుల్లంబునం గల్లగుట్టు నెట్టుకొలిపి యెట్టకేలు తెల్పుటకుం జొరకుండి... కళా. ౫. ౧౪.

నెట్టుడుగాయ. వి. (√నెట్టు.) బాలక్రీడావిశేషము.

సీ...ఒడ్డు,విడువు నెట్టుడుగాయ పిండ్లములాట లుపులిజూదములు...ఆడుకొంటిఁ, జదువునై సంధ్యాపై నాస్థ చాల లేక. హంస. ౩. ౧౮౬.

నెట్టుపడు. అ. క్రి. (నెట్టు+పడు) గెంటఁబడు, త్రోయఁబడు.

సీ. తొలుదొల్త గుహ్వెఁ గోలలు కొన్ని వైచేసి యవి నెట్టుపడి పోవ నాడుగడచి. వాశ్రీ. ౨. ౯౫.

నెట్టె. వి. (క. నెణె.) ఉద్ది, జత.

ద్వి. నిండారుప్రేమతో నెట్టెలు గట్టి,చెండున దండెంబుఁ జెలువొప్పఁ బట్టి. రం. రా. బాల. ౨౧ పా. ౯ పం.

నెట్టె(ట్టియ)ము[1] = నెట్టము. వి. ౧. కిరీటము.

సీ. తనయుడుకుందమ్ములను రాచనెట్టెంపుఁబులు దిండితాతుమ్మెదలు మెలంగ. యయా. ౧. ౫౪.

౨. చుట్టకుదురు. (శ. ర, బ్రా.)

౩. శిరస్త్రాణము గుండ్రపాగ.

చ. నును పగుపచ్చపట్టునఁ గనుంగొన నొప్పుగ దిండుగట్టి న్యూ,తన మగుబర్హిబర్హకృతదామము నెట్టెము జుట్టి కప్రకా, ననతరుపుష్పమాలిక దనర్చ నురస్థ్సలి నుద్వహించియుం, బొసరఁగ వేణునాదనరసోత్సుకుఁడై హరి యొప్పె హరి. పు. ౬. ౧౪౯.

సీ. వినుమానములు గాఁగ వసతోడఁ బెనకట్టి నెట్టెంబు గాఁ బ్రేవు చుట్టినాఁడు. మనుచ. ౪. ౭౩. ఉ. హరి. ౨. ౧౨౪.

వ...కెంజడముడి బిగియించి నెట్టియంబు చుట్టిన జగజెట్టిపాఁపటేనియాదలమాణిక్యంబులతు ఱంగలి మెఱుంగులు వెనువెంట మింటఁ దాఁకను జరిగి...భీమ. ౫. ౯.

నెట్టము². వి. ధ్వని, అఱపు.

క. అని తలఁచి నిలిచి ఠీవిం, బనివడి చిరజీవి
యొరుపడ నొక నెట్టెం, బొనరించినఁ గ్రమ్మతి
పరి, మును పై యత్తోలులఁ జుట్టుముట్టె న్వ
ట్టెన్. వేం. పంచ. ౩. ౧౫౪.

(‘మందం మందం శబ్ద మకరోత్’. అని మూలము. ౧౫౫ పా. ‘ఆకాకము కావు కావు రని రొదలఁగింపన్’ నా. పంచ. ౩. ౧౬౯.)

నెట్టోడు. అ. క్రి. (నెట్టు + ఓడు.) చేష్టలుడుగు.

ద్వి. బిట్టులిక్క మూర్ఛిలి బిమ్మిటిఁ బొంది, నె
ట్టోడి లింగసన్నిహితులు దక్క. బస. పు.
౫. ౧౩౦ పం.

నెడిమె. వి. ద్వీపము. (శ. ర, బ్రౌ.)

నెత్త. వి. మత్స్యవిశేషము. (బ్రౌ.)

నెత్తకమ్మ. వి. (నెత్తము¹ + కమ్మ.) పాచికల పందెము.

సీ. నిలు మహా బొంకకు నెత్తకమ్మ యటంచుఁ
బతు లుల్కుడు నొయ్యఁ బల్కు మనుచు.
కళా. ౬. ౧౨౦.

నెత్తటిల్లు. అ. క్రి. (√ నెత్తము².) క్రమదీర్చుకొను.

గీ. వేడుకలు మీఱ సురతాంతవేళ యందు, నెఱ
యఁగాఁ బూవుఁబాన్పున నిద్రఁ జెంది, నెత్త
టిల్లిరి మలయాద్రి నిలయపవన, గతుల నూప్ప
లు విలసిల్లఁ బతియును సతియును. భాను. ౪. ౯౪.

నెత్తపలక = నెత్తపుఁబలక. వి. (నెత్తము¹ + పలక. క. నెత్తవలగె, నెత్తదపలిగె.) జూదపు బల్ల, శారిఫలకము.

సీ. భావజన్మునినెత్తపలకలఁ బురుడించు పాలు
పారువెన్నెలలు బొఱడు లయ్యె. పద్మ. ౩.
౧౮౯.

ఉ... క్రొత్త నెత్తపలకల్ తెరలుం బకజారి పారు

వ్యాపిట్టల గూండ్లుఁ గ్రొమ్మెఱుఁగు బిందెలుఁ
గొందఱు తెచ్చి రయ్యెడన్. వాసి. ౩. ౮౪.

నెత్తపుఁబలక = నెత్తపలక.

సీ. అష్టాపదాభిన లగుఁ జదరంగపుఁబలక నా
నెత్తపుఁబలక నాఁగ. ఆం. భా. ౨. ౩౦౫.

నెత్తము¹. వి. (క. నెత్త = నేత్ర శబ్దభవము. కన్నులవంటిగుఱుతులుకలది. దీనికి వృత్తియందు కొన్నిపట్ల వైకల్పికముగా మువర్ణలోపము. చూ. నెత్తపల.) ౧. పాచికలాట, జూదము; ద్యూతవిశేషము.

గీ. అన్నదమ్ములు నెత్తము లాడి సతుల, తలలు
పట్టి సభాస్థలంబులకు నీడ్చి, చీర లొలిపిం
తు రే... భార. ఉద్యో. ౩. ౩౬౨.

ఉ. నెత్తముమీఁదఁ గౌతుకము నిర్భరమై జని
యించె నిప్పు మా, చిత్తములందు నీవు గడుఁ
జిత్రపుజూదరివి... హరి. ఉ. ౩. ౨౨౪.

శా. సోళాదొప్పియు నెత్తముల్ మొదలుగా
జూదంబు లీవాడున, వ్వేళన్... శై. భా. ౩.
౪౨. ఆం. భా. ౩. ౬౨.

౨. పందెము.

సీ. తనకు లాగైన నెత్తంబు గైకొని పన్ని పాచి
కల్ తాళించి పాటెతెంగి. ఉ. హరి. ౩.
౧౨౦.

జః నెత్తకమ్మ, నెత్తపలక, నెత్తపుఁబలక.

నెత్తము². వి. ౧. (కొండమీఁది) విశాలసమప్రదేశము, సానువు; (మేడమీఁది) చదునుప్రదేశము.

సీ. ఉదయతరపూర్వభూధరము నెత్తమునఁ బోలు
చు గైరికగండశిల యనంగ. దశకు. ౫.
౧౨౮. ఆం. భా. ౩. ౬౨.

గీ. కదలి పోదము రం డని కలువకదళి, కాసు
ఖదభద్రకరికిఁ గైలాసగిరికి, దత్తఱంబున

నేఁగి నెత్తమున నిలిచి, చఱులఁ బ్రతిశబ్ద
ములు పుట్ట మొఱలు వెట్టె. వరాహ. ౫. ౧౦౮.

సీ. నెత్తము లేకొండ నెత్తములం బాడు విద్యా
ధరీకోటి విటులతోడ. మనుచ. ౪. ౮౯.

ఉ. మేడలమీఁది నెత్తముల మే లగుచంద్రకి
సాంద్రపింఛముల్, జోడుగ విప్పి వారఁ గొని
సొంపుగ నాడెడి నెమ్మిపిండువుం, జూడఁగ
వచ్చి యందుఁ బురసుందరుల న్వెసఁ జూచి
యచ్చెరల్, వ్రీడ ఘటింప మోము లరవె
ట్టుదు రీశులకున్ మఱుంగునన్. కులశేఖర
మహీపాలచరిత్రము. ఆ. ౧. (చి. ని.)

౨. ఊరివారందఱును పశువులను మేపుకొను
టకై విడిచిపెట్టినగయాళుభూమి, బీడు.

క...కా ల్గట్టి విడువ నెత్తంబున మెత్తనిగఱిక
మేసి...అము. ౪. ౩౪.

నెత్తమ్మి. వి. (నెఱ + తమ్మి.) ఫుల్లాబ్జము, విరిసిన
తామర; తామర.

సీ. నెత్తమ్మిరేకుల మెత్తఁదనము దెచ్చి యచ్చునఁ
బెట్టి న ట్లుంద మంది. భార. విరా. ౨.౫౨.

గీ. తప్పు లేకుండ నేల నెత్తమ్మి మొగడ, విసరి
వక్షఃప్రదేశంబు వ్రేటుగొంటి. హర. ౧. ౨౮.

సీ...తమ్ములు వెలయు నెత్తమ్ము లనఁగ. ఆం. భా.
౩. ౫౨.

నెత్తమ్మివిరివిందు = సూర్యుఁడు.

గీ. తోఁచె నెత్తమ్మివిరివిందు తూర్పునందు.
రాజ. చ. ౩. ౨౯.

నెత్తఱి. వి. (నెఱి + తఱి.) ౧. చక్కనివళి; కడు
పుమీఁదిముడుత.

సీ. వాలికముఖికి నెన్నడుము కానఁగనయ్యెఁ
దనరు నెత్తఱులబిత్తరము దరలె. వసు. ౩.
౨౦.

సీ. తఱులు నెత్తఱులు నాఁ దగును వళిసంజ్ఞ
...ఆం. భా. ౨. ౧౩౮.

౨. పెద్దయల, కల్లోలము.

చ. చిఱునునుఁజెందొవల్ చిగిలిచంద్రికపైపఱ
పు ల్పరాగముల్, పఱచిన నెఁడిప్రాఁతవలిపం
బులు పాయనిజంటజక్కవల్, పొలుపతిలాఁ
డబిల్లలుగఁ గోమలి యుప్పటఁ గానవయ్యె
నె, త్తెఱు లలరాజహంసవనితాతతి దూఁగెడు
డోలలో యనన్. చంద్ర. ౪. ౨౫.

౩. అడుగుటచే స్ఫుటముగా నేర్పడినరేఖలు,
నొక్కులు. కాశి. ౫. ౨౯౪.

నెత్తావి. వి. (నెఱ + తావి.) నిండుపరిమళము, సు
వాసన.

సీ. అరవిరినెత్తావి నడరించుచున్నద్రవిటపీటి
సౌరభవితతి వొదల. భార. ఉద్యో. ౨.
౧౧౨.

సీ. కోమలినిట్టూర్పు గ్రొవ్వేఁడినెత్తావి మెంకరి
తేఁటులను మూఁతిమూట్ల వెఱచె. నైష. ౨.
౧౧౩. హంస. ౨. ౨౧. విక్ర. ౧. ౯౫.

నెత్తి. వి. (క. నెత్తి.) ౧. తల, శిరము.

గీ. నెత్తిపక్కటి ధూమంబు నెగయునపుడు,
మరణదశ యావహిల్లెడు మానవునకు. భార.
శాం. ౫. ౧౨౯.

చ...కొప్పు లగడ్తలోఁ బడం, జతవముమీఱ నె
త్తి కడు సంతసమొప్పఁగ నెత్తిఁ బన్నగ,
ప్రతతులు దాల్చుఁగాక మతి పాముల కే
డివి జాతిగత్నముల్. దశా. ౧. ౯౫.

౨. శిరోజములు, వెండ్రుకలు.

ఉ. ముంగట నిల్చి యొప్పారుగుముద్దియ నాప
తి నెత్తి మాసె నే, నంగడి కేఁగ లే విప్రుఁడపూ
ర్వుఖ పొత్తిఁ దెచ్చి యిచ్చెదం, జెంగటిగో
డఁజేరి యొకచిట్టెడునూనె యొసంగలేవె
...శుక. ౨. ౩౯౧.

౩. దూషణవిశేషము, ఒకానొకతిట్టు.

(వ్యవ.) అక్కడ నేమున్నది? నీనెత్తి. ఇటు
చూడుము.

నెత్తిఁ గట్టుకొనిపోవు=(చచ్చునపుడు) విడువక కూడ తీసికొనిపోవు.

క. ఇలు నెత్తిఁ గట్టుకొనిపోఁ, గలుగుదురే దివికిఁ దాము గడపటఁ బోరుగూ,రులవెంటఁ జనరె యప్డు డీ,యులమట వాటిల్లదే దయాస్థితి వలదే. శుక. ౩. ౧౮౩.

నెత్తిఁ జేతులువెట్టుట=ప్రమాణము చేయుట.

ద్వి. రిత్తప్రొక్కులు ప్రొక్కి ప్రియములు వలికి, నెత్తిఁ జేతులువెట్టి నిక్కముల్ నొడివి. ద్వి. హరిశ్చ. ఉ. ౬౧౪ పం.

నెత్తివ్రాఁత=లలాటలిఖితము, నుదుటివ్రాఁత.

గీ. అరసికుం డైననరపతి నాశ్రయించి, కృతు లొనర్చెడికవి నెత్తివ్రాఁత కోఁత. వేణు. ౧౮.

శ్లో. అరసికాయ కవిత్వనివేదనం శిరసి మాలిఖ మాలిఖ మాలిఖ. (చాటుప.)

నెత్తిపిడుగు=హానిచేయువాఁడు, వినాశకారి.

చ. ఖలదచరిత్ర కన్గొనుము వీ రసమానబలుల్ సమిన్నిరం,కుశులు దశాస్యనెత్తిపిడుగుల్ దనుజాటవి కాదవానలుల్. రామా. ౬. ౨౭.

జః నెత్తికాయ.

నెత్తికాయ. వి. (నెత్తి+కాయ.) తలకాయ, శిరము. (శ. ర, బ్రౌ.)

నెత్తురు(త్రు). వి.దే. (క. నెత్తరు. త. నెత్తోర్.) రక్తము.

క. అత్తతిఁ బాషాణంబులు, నెత్తురు నెమ్ములును గురిసె నిష్ఠురనినదా,యత్తమయి నభము పిడుగుల, మొత్తంబులు వడియె ...భార. ఉద్యో. ౪. ౧౬౦.

ఉ. ...దుర్నీతి వధించి యేఁ బడయు నెత్తుటఁ దోఁగినరాజ్యభోగముల్, ప్రీతి యొనర్చునే ...భార. భీష్మ. ౧. ౧౮౩.

సీ. నిండి భోరనఁ బాఱునెత్తురుటేఱులఁ గరఁగి పాఱినమాంసకర్దమమున. కు.సం.౧౧.౩౬౧.

గీ. రథములను సామజములఁ దురంగమముల, మఱికనెత్తుటేఱుల నీఁదె భటులు నడచి, పోరి కేటును వ్రేటును బోటు నొక్క, యలవిఁ జెలఁగంగ నఘనమనైన్యములు వాసె. భార. భీష్మ. ౩. ౨౭౫.

చ. తలలు సరోజముల్ మెదడుకందము క్రొన్నరు వంత్రజాలముల్, జలఘణులసిఖండములు శంఖములై తగు నెత్తుటేర్లలోఁ, గలభకపాలనాచయము గ్రక్కున నెక్కి చరించు సంగరస్థలుల నృసింహనిర్దళితశత్రువసారసమత్తభూతముల్. వరస. ౩. ౨౦.

జః నెత్తురుఁగందు, నెత్తురుఁగళ, నెత్తురుఁద్రావుడు, నెత్తురుఁబోతు, నెత్తురుబ్రొద్దు, నెత్తురుగడ్డ, నెత్తురుబంక.

నెత్తురు(త్రు)ఁగందు. వి.(√నెత్తురు.) ఒంటిపై రక్తము తేఱుచున్నలేఁతబిడ్డ, జొత్తుపాప.

గీ. ఇట్లు శైశవక్రీడల నెసఁగుచున్న,కొడుకు దెసఁ జూచి కన్నీరు గ్రుక్కుకొనుచుఁ, గటకటా యిట్టి నెత్తురుఁగందు నిచట, వైచి పోవంగ వలసెనె నీచగతిని. భోజరా. ౬. ౨౫.

క. అత్తటిని శమంతంబులు, తత్తనువున కెండగాలి దాఁకకయుండన్, మెత్తనయాఁకులఁ బొదువుచు, నెత్తురుఁగందుఁపయి నిల్పె నయ్యప్రోగ్రపయుజ. ప శిసం. ౨. ౧౮౩.

గీ. మంచులకు నాయులఫుట్టుపుచ్చవారు, నేత్రములు విప్పనట్టియా నెత్తుఁగందు, వలల నెత్తెంచె సవ్యోరవాఁడొ యనుచు, విలయ హారిఁ దెచ్చి పనుతు దివ్యాటిసతులు. పాండు. ౩. ౧౫౬.

నెత్తురుఁగళ. వి. (నెత్తురు+కళ.) నెత్తురు చూచుటవలన కలుగుమూర్ఛ.

వ... త్రెట్టువలు గట్టి యున్నక్రొన్నెత్తురులు గ్రుంగోని నెత్తురుఁగళ్లఁ బట్టి తమకు దామ వ్రాలువారును... కుచేల. ౨. ౧౪౭.

నెత్తురుఁద్రావుడు. వి. (నెత్తురు + త్రావుడు.) రక్తపాయి, రాక్షసుఁడు.

క. అత్తఱి నీల్గక చిక్కిన, నెత్తురుఁద్రావుడుల వలన నెవ్వఁడిఁ జాల్పన్, గుత్తుకలరక్కసుఁడు విని, మెత్తంబా టూని లోన మిగుల నడలుచున్. అచ్చ. రా. యు. ౧౯౫.

క. కావున మీ రా నెత్తురుఁద్రావుడువంగడపుఁ గడలితామరదాయ, న్నేవేగ తెందు నేఁడ, ద్దీవికి దొరఁ జేసి యునుతుఁ దిర మొప్పారన్. అచ్చ. రా. యు. ౫౦.

నెత్తురుఁబోడ. వి. (నెత్తురు + పోడ.) ఎఱ్ఱపోడలు కలయొకజాతిపాము, ఈమెత్తలోనిముఱ్ఱుపాము, మాతులాహి. (శ. ర, బ్రౌ.)

నెత్తురుఁబొత్తు. విణ. (నెత్తురు + పొత్తు.) ప్రాణస్నేహితుఁడు.

క. ఇత్తెఱఁగునఁ దొయ్యలికిన్, నెత్తురుఁబొత్తగుచు నతఁడు నిచ్చలు మదిలో, హత్తినప్రేముడిఁ జదివెన్నుత్తఱి నొకనాఁడు తీపటుంతఁ గడంకన్. యయా. ౩. ౧౧౫.

నెత్తురుఁబ్రొద్దు. వి. (నెత్తురు + ప్రొద్దు.) మధ్యాహ్నము.

వ... అత్తఱిఁ గడొంది నెత్తురుంబ్రొద్దగుట ... మను చ. ర. ౫౦. (సంధ్యాకాలము అని శ. ర.)

నెత్తురుగడ్డ. వి. (నెత్తురు + గడ్డ.) ఒకవిధమైన ఉబాపు, సెగగడ్డ. (బ్రౌ, వా.)

నెత్తురుబంక. వి. (నెత్తురు + బంక.) మలముతో నెత్తురును జిగురును పశువ్యాధివిశేషము. (శ. ర, బ్రౌ.)

నెనడు. వి. (క. నెణ.) ఎముకలలోనిక్రొవ్వు, మజ్జ.

చ... నెత్తురున్, నెనడును క్రోలి భూతములు నిక్కుచు నీల్గుమఁ జొక్కి యుండఁగన్. భార. ద్రో. ౨. ౩౧౨.

ఆ. నెనడు మెదడు మలము నెత్తురు శుక్రంబు, మూత్ర మనెము నీరియు ముసలుగాఁగ, గుబిలి చెమట పుసులు గసు శ్లేష్మం బశ్రు, జలము లివి శరీరమలము లయ్యె. విజ్ఞా. ఆచా. ౪౨.

సీ... నెత్తురు నెనడును నెమ్ములు నెఱచియుఁ గండలు నెనసి సమర. గీ. తలము ఘోరంబు గా... భార. ఉద్యో. ౨. ౧౪౪.

నెనయు = ఎనయు. అ. క్రి. ఒప్పు.

ద్వి. జనకనందనతోడ సకలరాజ్యంబు, నెనయు రాముని కిష్ట నీదిష్ట తెలిసి. రం. రా. యు. ౫౧౪ పొ. ౧౧ పం. (చి. ని. సా.)

నెనరు. వి. ౧. ప్రేమము, స్నేహము.

(కద్రువ.) క... అధంగిన్, జనివతినాగులఁ జేర్కొని, నెనరు విడిచి యానెలఁత నిష్ఠురమతియై. భార. అను. ౧. ౧౯౫.

చ. నెనరునఁ జెయ్యి పట్టి తరుణీ ధరణీసరణిపురందరుం, డనుపక పోవు టెట్లు ... వసు. ౩. ౬౪. దశా. ౧. ౧౪౧.

౨. (స్త్రీపురుషుల) వలపు, మోహము.

క. ననుఁ జూడ రాఁ డదేమో, యని నిను దూతికొనుచుండు ననుఁ గనుము నాపై, నెనరు గలందుకు గుఱుతిదె, కనిపించెను మనము వేనుకలు గనఁ గ్రాలన్. సారంగ. ౨. ౫౧.

గీ. నిన్నుఁ జూచునపాల్పడు నెనరు లేదె, హృదయ మియ్యాఁదు పతిభీతి యింత కాక. దశా. ౬. ౧౦౭.

ఆ. హిమకరశైలసైకతమునందు విహరించు, ఖైరవేష వేష ఘననిభాంగ, నెనరు దవుల దవుల నేచూచి క్రీడిగా, సలిగె యేర యేర గొందుకవన. విజ. వి. ౧. ౫౯.

౩. మచ్చిక, చనవు.

౪. అని కనకకశిపునుమత, మున బాలునిఁ దోడు
కొనుచుఁ బోయిరి గేహం, బునకున్ శుక్ర
కుమారులు, నెనరునఁ డి ద్దేహాకునను నెలకొని
యతఁడున్. దశా. ౪. ౧౯౧.

ఉ...తానునుం, దానును నేఁటిదాఁక మమతం
దగ నగ్నిగిఁ గూడి యున్నవా, రానెనరెన
నుం దలఁపఁడయ్యెను దీని గణించియేని
యున్. విప్ర. ౪. ౩౨.

౪. దయ, కనికరము.

గీ. అకుచేరుఁడు నవ్వి బళా మఱేమి, దశము
ఖుఁడు మంచిపని సేయఁ దలఁచె హితవు,
దలఁచినన్ మతి ముఖ్యకోఁత లనుమాట,
నేఁడు నిజ మయ్యె నిఁక నేల నెనరు దలఁప.
ఉ. రా. ౩. ౬.

విణ. ౧. ప్రియము, ప్రేమాస్పదము.

గీ. వనిత నాకన్న నెన రైనవారు నీకుఁ గలుగ
నేర్తురె... భాగ. ౧౦ ఉ. ౩౪౦.

సీ. వెనుక ముందఱలేరు నెన రైనచుట్టాలు...
నైష. ౧. ౧౦౨. అం. శే. ౬.

౨. కృతజ్ఞుఁడు, విశ్వాసముకలవాఁడు.

సీ. దీవెనల్ వినయవిధేయతతోడఁ జేకొనుచు
ను వెండియు నెనరుదొరలు. ఆ. గౌరవము
లొనర్పఁ గైకొంచుఁ గ్రమమున...రాఘవ.
౨. ౧౬.

నెనవు. వి. (క. నెనవు.) సంస్మృతి.

క. వనజనిభాకారుం డై, వననిధిలోఁ దేలుచు
న్నరటపత్రిముపై, దనుఁదాన చూచి
చొక్కుచు, నెనవున నానందయోగనిద్రం
జెందున్. వేం. మా. ౬. ౨౪౬.

నెన్నడ(పు). వి. (నెఱి+నడ.) చక్కనినడక, సువిలాసగమనము.

సీ. నెఱినీటు గులుకులనెన్నడల్ పరికించి క
ధుమందగతి గాంచె గంధకరటి. దశా. ౨.
౩౦౨.

ఉ. హెచ్చుకిఱుఁదుభారము సహింపక నెన్నడ
లింత కొంచఁగా. ఉ. రా. ౪. ౧౯౨.

సీ. పూఁదీఁగఁబోఁడిచూపులు చంచలము లని
మెలపు నెన్నడపున మేళవించె. విక్ర. ౪.
౧౪.

నెన్నడుము. వి. ఔ. ౧. (నెఱ+నడుము.) నట్టనడిమిప్రదేశము, సరియైనమధ్యభాగము.

గీ. తరుణి రొంటఁగవె వీటికాదానవేళ, గుడ
జనప్రాంతమునయందు గూఢవృత్తి, నాగవల్లీద
ళంబు నెన్నడుమఁ జీఁజీ, మడిచి యందిచ్చి
నపుడు గో రిడుదుఁ గేల. నైష. ౭. ౭౪.

సీ. చెరువంగ నేర్చిరి శిఖలనెన్నడుమలఁ గమ్మ
నిక్రొత్తచెంగలువవిరులు. కాశీ. ౧. ౩౪.

సీ. పుణ్యాత్మ యేదేశములను నెన్నడుమగాఁ
బ్రవహించుఁ బుణ్యతరంగ గంగ, జాహ్నవీ.
౧. ౧౫.

౨. (నెఱి+నడుము.) చక్కనికౌను, సుందరావలగ్నము.

సీ. తూలుతీఁగెలవెంటఁ దూఁగుతేఁటులువోలె
నసదు నెన్నడుముల నారు లొలయ. ఉ.
హరి. ౫. ౨౪౬.

సీ. గాటంపునిడుదకీల్గంటు పెన్ వ్రేఁగున నసదు
నెన్నడుము జవ్వాడి వడఁక. రసిక. ౩. ౪౩.

సీ...పిడికిట నడఁగు నెన్నడుముదాని. గీ. సాగ
కునడదాని నక్కన్నెఁ జూచె నతఁడు. ఉ.
రా. ౨. ౧౨౮.

నెన్నుదురు=నెన్నొసలు. వి. ఔ. ౧. (నెఱ+నుదురు.) విశాలఫాలము; ఫాలము.

క...ఈతటినిం, గనుఁగొనుపుణ్యుఁడు మిక్కిలి,
కనుఁ గొను నెన్నుదుట నెన్నఁగాఁ దర
మగు నే. దశా. ౧. ౧౨౩.

మ. ...ద్యూత కేళింగోయి నెన్నుదుటన్ జేరిచి
కెల్లెం గ్రొవ్వుఱ ఫలాంబుం దాదశగ్రీవు
తోన్. ఉ. రా. ౨. ౩౧౧.

౨. (నెఱి + నుదురు.) చక్కని నుదురు, సుందరఫాలము.

మ. పరియాగ్వెన్నసరిండిపట్టు మవనీపాలావతం
సంబు నెన్నుదుటం గట్టె లతాంగి యోర్తు
...నైష. ౬. ౫౩.

నెన్నెఱులు. వి. బ. (నెఱి + నెఱులు.) నిడుద కెంద్రుఁగులు, దీర్ఘకేశములు.

సీ. ...నగారి కైతవంబునఁ బరిచర్య సల్పుచు
వినీతుఁడై యుండి యొక్కనాఁడు దంష్ట్రి
నెన్నెఱు లంట గళుచియై కూర్కొనయ్యె
తివకుత్తి. గీ. దూతి...చం. రా. ౩. ౨౪.

నెన్నొసలు=నెన్నుదురు. వి. దె. ౧. (నెఱి + నొసలు.) విశాలఫాలము; ఫాలము.

చ. వనజభవుండు నెన్నొసట వ్రాసినసొమ్ము
ఘనంబో కొంచెమో, విను మరుభూమి కే
గిన లభించును మేరువుఁ జేరఁ బోయినన్,
ధన మధికంబు రాదు...భర్తృ. ౧. ౪౧.

౨. (నెఱి + నొసలు.) చక్కనినుదురు, సుందరఫాలము.

మ. అసదుంగొను జలింప గుబ్బలపయిన్ హా
రాళి గుల్కంగ నెన్నొసటన్ ముంగురు
లాడ...నై, ర్పసంగన్ నూనియ యంటె
నొక్కచెలి యయ్యుత్స్వేదరాణ్మౌళికిన్.
ఇందు ౩. ౧౭.

సీ. చిన్నిక్రొన్నెల నెన్నునెన్నొసళ్ల నొయారి
యలఁతికస్తురిరేక లనువు మీఱ. అచ్చ. రా.
బాల. ౭౭.

నెపపడు అ. క్రి. (నెపము + పడు.) నెపమునొందు, దోషియగు.

క. కృప గట్టిపెట్టి మీపాపపుబుద్ధులఁ బట్టిపట్టి
పసఁగట్టి విని, వక్కటముఁ గఘనకునిఁ జోరి
గొని, నెపపడి పడియుండఁ వాఁడె నీ కేనకటా,
వేం. పంచ. ౧. ౫౧౪.

నెపపెట్టు స. క్రి. (నెపము + పెట్టు.) దోషియను.
(వ్యగ.) నీ విప్పుడే చెప్పుచున్నావు, తర్వాత నన్ను నెపపెట్టఁగలవు.

నెపము=నెవము. వి. (సం. నిభః, ప్రా. ణిహ్వ. క. నెవ, నెవను. త. నిపమ్.) వ్యాజము, మిష; మిథ్యాహేతువు.

క. గంధర్వు లను నెపంబున, సంధతముసగూఢ
వృత్తి ననిలసుతుఁడు గర్వాంధమతి యైన
నూతు సబాంధవముగఁ జంపెఁ గాక పరు
లకు వశమే. భాగ. విరా. ౩. ౧౧౯.

క. ద్రుపదతనూజం బణముగఁ, గపటద్యూత
మునఁ జేయఁగాఁ దగునె జనాధిప యిది
దుష్టద్యూతము, నెపమునఁ బరిభూత యయ్యె
నిక్కరుణులచేన్. భార. సభా. ౨. ౨౨౨.

ఉ. నాసఁ దొఱంగి చుంబన మొనర్చెనె గా
దొకఁ డొక్క చంద్రబింబానన మోముఁ
జంద్రుఁ జమత్కాంతర బింబితునిన్ పునః
పునః, పానకపానకర్మము నెపంబునఁ జేసి త
దోష్ఠపల్లవం, బానుచు నాదరించెను సమం
చితసీత్కృతచూత్కృతంబులన్. నైష. ౭.
౧౩౭. భార. అను. ౪. ౧౨౭.

ఉ... ఏ కాంతమునందు నున్నజవరాండ్రు నె
పం బిడి బల్కరించులాగింతియు కాక నీ
వెఱుఁగవే మును వచ్చినత్రోవచొప్పు...
మనుచ. ౨. ౪౧.

౨. కారణము, కతము.

క. విపరీతమతిని నుండుఁడు, నుపసుందుఁడుఁ
బోకి పొడిచి రొండొరులతోడన్, గుపితా
త్ములయి తిలోత్తమ, నెపమున దృఢముష్టి

ఘాతనిర్ఘాతములన్. భార. ఆది. ౭. ౧౧౨.

ద్వి. భక్తవత్సలుఁ డైనపంకజోదరుని, భక్తి భావంబున భర్త గాఁ గోరి తపముఁ గైకొంటి నాతపమున కిదియె, నెప మీతపశ్శక్తి నిఖిలంబు గాంచు. రం. రా. ఉ. ౩౪ పా. ౧౧ పం. ఉ. రా. ౩. ౧౨౪.

౩. తప్పు, దోషము.

చ. కువలయనేత్ర నీమనసు గూడినవారికి నెన నెప్పుఁ జెప్పఁగలదు దాన నొండొక నెపంబు ఘటింతు రెఱింగిరేని నీసఖులు... భార. అర. ౫. ౩౧౭.

క. నెప మొకటి గలదె నాపై, నపవాసము తోడ బడలి యుండఁగ నీ కే, యపరాధము చేయంగదె, కృపతోఁ గఱకుట్టు లారగింపంగదవే. కాశీ. ౩. ౯౦.

౪. విధము, రీతి.

క. ఆనెపమున ద్రోహమునకు, వానిన కాదరని యతనివంశం బెల్లన్, గానుపునఁ బెట్టి యార్చిన, నేనియుఁ జాల దిది పెద్దయే దక్షునకున్. కు. సం. ౨. ౨౯.

గీ. ఎంతకాలంబునకు నాకు నీనెపమున, శాపమోక్షంబు గల్గెను సజ్జనాగ్రగణ్య... చిత్రభా. ౩. ౯౪.

క. మానిసి పై తోల్ గప్పిన, యీ నెపమున నున్న రుద్రులీశ్వరభక్తుల్, మానుసులె వారు... శివ. సా. ౧౪౯.

జః నెపపడు, నెపపెట్టు.

నెప్పర(ళ)ము. వి. వేగము, త్వర.

వ. అత్తఱిం దత్తఱంబునం దత్తఱులం బల్లింపక యు నెప్పరంబున నెక్కం బోవువారును... పారి. ౪. ౬౬.

క. అప్పుడు నాగదసంయమి, చెప్పిన విని కళవళంబు చిత్తాబ్జములో, నుప్పతిల నంచ తేజీ, నెప్పళమున నెక్కి నలువ నిలువక వచ్చెన్. వరాహ. ౪. ౩౩.

వ... దురంతదంతకుంతంబుల నింతంతలు తునియలయి నెప్పళంబునం బునుకచిప్పలు గుదుల్లు దప్పి రక్తంబులు గ్రమ్ముకొన ... భాగ. ౭. ౫౫.

నెప్పరి. విణ. (నెప్పు + అరి³.) నేర్పుకలది; నేర్పు కలవాఁడు.

క. అప్పరి గలయుప్పరిగల, నెప్పరు లగుమగువ లెక్కి నిక్కి తమనెఱిం, గొప్పుల కలకల్పకముల, గొప్పను మము లేరి కోరి కోయుదురచటన్. ముకుంద. ౧. ౨౬ పా. ౫ పం.

నెప్పరించు. స. క్రి. (నెప్పరి + ఇంచు.) వాదించు, నిరూపించు. (శ. ర, బ్రా.)

నెప్పఱు. అ. క్రి. (నెప్పు + అఱు¹.) స్థానభ్రంశము నొందు, నిలుకడ తప్పు.

ఉ. అప్పుడు దానవాధముభయంకరరూపముఁ జూచి సాధ్వసం, బుప్పతిలన్ మహీతనయ యుర్విర వ్రాలె హరిత్కరీంద్రముల్, నెప్పఱె కూలె తూలె రజనీచరభాస్కరబింబముల్ రుచుల్, దప్పె సమస్తతారకవితానము రాలె నరాళిభంగులన్. రామా. ౫. ౧౭౪.

ఉ. అప్పుడ యప్పయోనిధిశయానుఁడు మేల్కనె గర్భయుక్తమై, యొప్పు జగత్త్రయంబు తన యొప్పమి గానఁ బరస్పరవ్యథన్, నెప్పఱి పద్మపత్త్రయుతనీరగతిం జలనంబు నొందనా, చప్పుడు లోన నెచ్చరిక సల్పఁ బ్రబోధము నొందెనో యనన్. రామా. ౩. ౩౧.

నెప్పు. స. క్రి. త్రోయు, గెంటు.

మ. భువనస్తుత్యగుణానురూప మగుజంబూద్వీపమం దాత్తక, గవితానంబు గుణంబు గాఁ దవిలి గర్భప్రాప్తుఁ డై జీవుఁ డు, ద్భవకాలం

౨. స్నేహము, మిత్త్రభావము.

క. మిత్త్రనరపతుల శాత్త్రవ, ధాత్త్రీశుల నెమ్మిఁ బరుసఁదనమున వశతాఁ, బాత్త్రములుగఁ జేయుదె సుచరిత్త్ర యుదాసీననృపపరీక్ష నడచునె. భార. ఆశ్ర. ౨. ౪౮.

సీ... చెలిమి చుట్టఱికంబు చెల్మి నెమ్మి, నెయ్యము నేస్తము నెయ్యమి సంగడి... గీ... అనఁ, బరఁగుచుండును మిత్త్రభావంబు ... అం. భా. ౨. ౧౮౬.

ఉ. ఇమ్మెయి నర్థమెల్లను వ్యయింపఁ బురిం గల వైశ్యులందఱున్, నెమ్మిఁ బురందరుం గదిసి... విక్ర. ౨. ౧౬౬.

౩. ఆసక్తి, తత్పరత.

ఉ. నెట్టన నశ్వమేధములు నెమ్మి ననేకము చేసి వైరులం, గిట్టి వధించి లోకములఁ గీర్తి దళంబుగ నించె మించఁగా. వి. పు. ౫. ౭౫.

గీ. మఱియు సగర్థమూలము లైనమహితపుణ్య, కర్మములు నెమ్మి నొనరించు ధర్మనిరతి. విక్ర. ౨. ౧౬౫.

౪. ప్రసాదము, అనుగ్రహము.

ఆ... పెక్కు లేండ్లు నిష్ఠ, గురుని గురుతనూజుఁ గొలిచి యయ్యిరువుర, నెమ్మి వడసెఁ దనదు నేర్పుపేర్మి. భార. ఆది. ౩. ౧౧౦.

౫. సుఖము; సుఖస్థితి.

క. అనఘా నీప్రస్తవమున, నని నీల్గినవీరభటుల యనుపోష్యులనెల్లను బ్రోతె భోజనాచ్ఛా, దనముల వారలకు నెమ్మి దఱుఁగక యుండన్. భార. సభా. ౧. ౩౯.

శా... ఈవసుమతీచక్రేశపుష్పాయుధుండు... జై, మీదాఁపత్యమునం జిరాయు వయి నెమ్మిం బొందుఁగా కంతయున్. వైజ. ౬. ౭౬.

క. మమ్మెఱుఁగు దెదిరి నెఱుఁగుదు, నెమ్మి యెఱుఁగుదు ధర్మసిద్ధినెఱి యెఱుఁగుదు వ్యాఖ్యములపద్ధతి నెఱుఁగుదు, పో మ్మెవ్వఁడ నేను నీకు బుద్ధులు సెప్పఁగ. భార. ఉద్యో. ౩. ౩౪.

౬. క్షేమము, కుశలవార్త.

గీ. అన్న గాదిలిచుట్టము వగుచు నేని, నెమ్మి యెఱిఁగించి యసురులు నిలిపినట్టి, నిన్నె కింతయు నగ్గింప నేరను ... అచ్చ. రా. సుం. ౮౬.

౭. సంతోషము, ప్రీతి.

ఆ... ఇమ్మహీభారంబు, నీవ తాల్పఁ వలయు నెమ్మితోడ. భార. ఆది. ౨. ౧౨౫.

క. నెమ్మిని నీదక్షిణహ, స్తమ్మున వెనువ్రేలు దునిమి దక్షిణ యిమ్మిష్టమ్మిది... భార. ఆది. ౫. ౨౪౩.

క. అమ్మేటిగేస్తునకుఁ గడు, నెమ్మి యొనర్చుచును ...నీలా. ౧. ౫౧.

౮. నిర్భయత్వము, నెమ్మది.

క. ఇమ్మణిమతీపురంబునఁ, దమ్ముండును దాను నతిముదంబున నుండఁగ, నెమ్మిని నిల్వలుఁ డనువాఁ, డిమ్మహి ధనవంతుఁ డతఁడ యెవ్వరి కంటెన్. భార. అర. ౨. ౩౩౮.

చ. అనవుడు బ్రహ్మదత్తుఁ డది యట్టిద నీదెసఁ గీడు లేదు నీ, చనుటకు నాకునం బతివిషాదముఁ బొందెడుఁ దోఁటియట్ల న్నెమ్మిన నిలుమన్న... భార. శాం. ౩. ౨౫౨.

గీ. నిమ్మళంబన నెమ్మి నా నెమ్మది యనఁ, దనరు పేళ్లు నిరాతంకమునకు నీళ. అం.సం.సూన. ౬౯.

౯. నెమ్మిక, నెమ్మిసేయు.

నెమ్మి[4]. వి. (సం. నేమిః.) నేమి, బండిచక్రమునకు చుట్టునుండుకమ్మి.

గీ. నేమి దనరారుచుండును నెమ్ము నెమ్మి, కమ్మి యనఁగను... అం. భా. ౨. ౨౦౨.

ఆ. అంచు లైదు నెమ్ము లాఱు నాభులు మూఁడు

౨. స్నేహము, మిత్త్రీభావము.

క. మిత్త్రనరపతుల శాత్త్రవ, ధాత్త్రీశుల నెమ్మిఁ బరుసఁదనమున వళితా, పాత్త్రములఁ జేయుదె సుచరిత్త్ర యుదాసీననృపపరీక్ష నడచునే. భార. ఆశ్ర. ౨. ౪౭.

సీ... చెలిమి చుట్టఱికంబు చెల్మి నెమ్మి, నెయ్యము నేస్తము నెయ్యమి సంగడి...గీ... అనఁ, బరఁగుచుండును మిత్త్రభావంబు ... ఆం. భా. ౨. ౧౭౬.

ఉ. ఇమ్మెయి నర్థ మెల్లను వ్యయింపఁ బురిం గల వైశ్య లందఱున్, నెమ్మిఁ బురందరున్ గదిసి...విక్ర. ౨. ౧౬౬.

౩. ఆసక్తి, తత్పరత.

ఉ. నెట్టన నశ్వమేధములు నెమ్మి ననేకము చేసి వైరులం, గిట్ట వధించి లోకములఁ గీర్తి దళంబుగ నించె మించఁగా. వి. పు. ౫, ౩౫.

గీ. మఱియు నగమూలము లైనమహితపుణ్య, కర్మములు నెమ్మి నొనరించు ధర్మనిరతి. విక్ర. ౨. ౧౬౫.

౪. ప్రసాదము, అనుగ్రహము.

ఆ... పెక్కు లేండ్లు నిమ్మ, గురుని గురుతనూజుఁ గొలిచి యయ్యరువుర, నెమ్మి వడసెఁ దనదు నేర్పుపేర్మి. భార. ఆది. ౩. ౧౧౦.

౫. సుఖము; సుఖస్థితి.

క. అనఘా నీ ప్రస్తవమున, నని నీల్గినవీరభటుల యనుపోష్యులనెల్లను బ్రోతె భోజనాచ్ఛా, దనముల వారలకు నెమ్మి దఱుఁగక యుండన్. భార. సభా. ౧. ౩౯.

శా... ఈవసుమతీచక్రేశపుష్పాయుధుండు... క్షై, మీదాంపత్యమునం జిరాయువు వయి నెమ్మిం బొందుఁగా కెంతయున్. నైష. ౬ ౨౬.

క. మమ్మెఱుఁగు దేదిరి నెఱుఁగుదు, నెమ్మి యొఱుఁగు ధర్మసిద్ధినెఱి యెఱుఁగుదు వ్యాక్యముల పద్ధతి నెఱుఁగుదు, పామ్మెవ్వఁడ నేను నీకు బుద్ధులు సెప్పన్. భార. ఉద్యో. ౩. ౩౪.

౬. క్షేమము, కుశలవార్త.

గీ. అన్న గాదిలిచుట్టము వగుచు నేని, నెమ్మి యొఱఁగించి యసురులు నిలిపినట్టిని న్నె కింతయును సగ్గింప నేరను ... అచ్చ. రా. సుం. ౭౬.

౭. సంతోషము, ప్రీతి.

ఆ... ఇమ్మహీభారంబు, నీవ తాల్ప వలయు నెమ్మి తోడ. భార. ఆది. ౨. ౧౨౫.

క. నెమ్మిని నీదక్షిణహ, స్తమ్మున నెనువ్రేలు దునిమి దక్షిణ యి మ్మిట్ట మ్మిది...భార. ఆది. ౫. ౨౪౩.

క. అమ్మేటిగేస్తునకుఁ గడు, నెమ్మి యొనర్చుచును ...నీలా. ౧. ౫౧.

౮. నిర్భయత్వము, నెమ్మది.

క. ఇమ్మణిమతీపురంబునఁ, దమ్ముండును దాను నతిముదంబున నుండున్, నెమ్మిని నిల్వలుఁ డనువాఁ, డిమ్మహి ధనవంతుఁ డతఁడ యెవ్వరి కంటెన్. భార. అర. ౨. ౩౩౭.

చ. అనవుడు బ్రహ్మదత్తుఁ డది యట్టిద నీదెసఁ గీడు లేదు నీ, చనుటకు సామనం బతివిషాదముఁ బొందెదుఁ దాఁటియట్ల నెమ్మిన నిలు మన్న...భార. శాం. ౩. ౨౫౨.

గీ. నిమ్మళం బన నెమ్మి నా నెమ్మది యనఁ, దనరు పేళ్లు నిరాతంకమునకు నీళ. ఆం.సం.సూన. ౬౯.

జః నెమ్మిక, నెమ్మినేయు.

నెమ్మి⁴. వి. (సం. నేమిః.) నేమి, బండిచక్రమునకు చుట్టునుండుకమ్మి.

గీ. నేమి దనరారుచుండును నెమ్ము నెమ్మి, కమ్మి యనఁగను...ఆం. భా. ౨. ౨౦౨.

ఆ. అంచు లైదు నెమ్ము లాఱు నాభులు మూఁడు,

కలిగి నూత్నగమనకలిత మగుచు, సంయ
మీంద్ర వినుము సంవత్సరాకృతిఁ, గాలచ
క్ర మందుఁ గ్రాలుచుండు. వి. పు. ౩. ౧౫౭.

నెమ్మించు. స. క్రి. (నెఱ + మించు.) అతిశయించు.

వ... లేఁతవెన్నెలల నెమ్మించుక్రొమ్మించులుం గల
మేడలును... పి. శకుం. ౧. ౭౬.

నెమ్మిక=నెమ్మి³. వి. (నెమ్మి³ + ఇక-స్వార్థమున.) ప్రేమము, అనురాగము.

ఉ. నేయము లజ్జయుం గరుణ నెమ్మిక కోపభ
యైకలేశ మే, నేయెడఁ జూచినన్ మదికి
నించుక యించుక...రస. ౩. గుచ్ఛము.
(శ. ర. పా.)

నెమ్మిజోట్టు. వి. (√నెమ్మి¹.) బర్హిచూడము. (శ. ర.)

నెమ్మిరవుతు. వి. (నెమ్మి¹ + రవుతు.) మయూరవాహనుఁడు, కుమారస్వామి. (శ. ర.)

నెమ్మిఱేఁడు. వి. (నెమ్మి¹ + ఱేఁడు.) మయూరవాహనుఁడు, కుమారస్వామి. (శ. ర.)

నెమ్మిలి=నెమిలి. (శ.ర.)

నెమ్మిసేయు. అ. క్రి. (నెమ్మి³ + చేయు.) సంతోషపడు, ప్రీతినందు.

గీ. ఊరుసంవాహనమునకు నుత్సహించు, ఘన
నితంబంబుపై నుండ మనసువెట్టు, నిమ్న
నాభికి డగ్గఱ నెమ్మిసేయుఁ, బద్మలోచన
మరగి భూపాలుకరము. నైష. ౪. ౧౪౨.

నెమ్ము¹. వి. తడి, తేమ. (శ. ర. బ్రా.)
చూ: నెమ్ముకొను.

నెమ్ము². వి. (త. నెమ్బు - 'బ' అని శ. ర.) ౧. రెండువైపులను మొన గలిగి బల్లలు మొదలగువానిని అంటఁగూర్చుటకు నుపయోగించు మేకు.

ద్వి. తలుపు నెమ్ములు గ్రక్కదలఁ దన్నుఁ దను
చు. పండితా. దీక్షా. ౪౩ పు.

౨. బండిచక్రమునకు చుట్టు నుండునెమ్ము, నేమి. ఆం. భా. ౨. ౨౧౨.

౩. (వి.నెమ్ము.) ఎముక, అస్థి.

సీ. అస్థిమయమూర్యాశ్వ లలను నెమ్ము లనంగ...
ఆం. భా. ౩. ౪౪.

క. పెల్లుగ మఱియును డెందము, డిల్లుచు వా
నేర సతఁడు చిదురుప నెమ్ములె, మొల్లనె
[illegible]స్వరమానతి, ఒల్లింపఁగఁ బట్టు పెద్దజల్లెడ
యనఁగన్. చంద్రా. ౫. ౭౫.

నెమ్ముకొను. అ. క్రి. (నెమ్ము¹ + కొను.) చెమ్మగిల్లు.

(వ్యవ.) అగ్గిపుల్లలు నెమ్ముకొన్నవి.

నెమ్మేను. వి. (నెఱి + మేను.) [illegible]శరీరము; శరీరము.

గీ. అతులమాణిక్యదీపము లాఁగ్ని[illegible], దనదు
నెమ్మేనిచాయ న త్తఱి శయించి, యున్నయు
డిగంపుఁ బూఁబోఁడ్ల...దశా. ౧. ౨౪౦.

క...ననుఁ, గనుఁగొని నెమ్మేను మిగుల గడఁగడ
వడఁకెన్. శృం. ౩. ౧౭౫.

గీ. మేను నెమ్మేను మై మయి మే మెయి
రొడ, లన శరీరంబు దనరు... ఆం. భా.
౨. ౧౩౪. ఉ. రా. ౫. ౨౪౫.

నెమ్మొగము=నెమ్మోము. వి.

(నిండుమొగము; మొగము.)

చ. నగరిసమీపమైన నరనాథునిసన్నిధి కోపా
టించిన, మోము వివర్ణతం బొరయు్ రోఁగ
...లక్ష్మణకుమారకుఁ డాన్యముఁ దున్నచోటి
కిన్. నిర్వ. ౯. ౫౯.

సీ...అదర్శంబు నెమ్మొగం బగుట పొందియును
గలదె... అము. ౨. ౩౦.

(చక్కనిముఖము.)

చ. పుడమిథనంబు నాకమునిభూతిచరుఁ కేళ

నరుని నల్లన, శ్వేతునభిమన్యునెమ్మొగము
వేయగుపాలును బోలనేర్చునే. భార. ద్రో.
౨. ౧౪౫.

నెమ్మోము. వి. ౧. (నెఱి + మోము.) నిండుమొ
గము; మొంగము.

సీ. చెలువంపునెమ్మోము నెలమిసొం పినుమడి
గా నల్ల నవ్వినఁ గాదె యింతి. భార. విరా.
౨. ౪౫.

౨. (నెఱి + మోము.) చక్కనిముఖము.

సీ. దౌహృదశ్రీ నిల్చుభవళాంబుజముపోల్కిఁ
దెలిగఁటినెమ్మోము దెల్లఁ రెయ్యె. ఉ. రా.
౨. ౧౩౪.

నెయి = నెయ్యి. వి. ఆజ్యము. (దీనికి ప్రథమైక
వచనమునందే ప్రయోగములు కానవచ్చుచు
న్నవి.)

చ. మగలవనోనివాసముల మానిని దృష్టిద
నాస్త్రపావకుఁ, దగులుకొనఁ రగిల్చి చిర
న వ్వనుగందపుఁగొండగాడ్పుచేఁ, బొగలెగ
యించి పల్కునెయి వోయుచు మఁడఁగ
మాయకట్టైచే, సెగసనఁ ద్రోచి యార్పఁ దగు
నించుకయించుక కూర్తిఁపరఁ. కాశీ. ౪.
౩౪.

గీ. బూదిలో వేల్చునెయివోలె పొల్లుపోవు.
శేష. ౫. ౨౫౧.

వ... నిత్యమాసుండుఁ నెయి... దశా. ౪. ౬౭౭.

నెయ్యపుఱేఁడు. వి. (నెయ్యము + ఱేఁడు.) వల
రాజు, మన్మథుఁడు.

ఉ. తొయ్యలి ముద్దరాలు కుచదుర్గము లాశ్రిత
ద్యోకవందనఁ, నెయ్యపుఱేనిపాల్పడిచి
నీవియుఁ గోల్పడఁగాఁ దలంచెఁగా, కరుయ్యో
డ సేలతో యునిచె నాత్మళయన్వితయంబు
ముస్నెలో, నయ్యె పరాగమై నృపకరార్ప
ణ కింకఁ బెనంగ నేర్చునే. వసు. ౬. ౭౭.

నెయ్యమాడు. అ. క్రి. (నెయ్యము + ఆడు.)
చెలిమిచేయు, స్నేహించు.

సీ... నూఁగారుసౌరు శంబరవైరినిడువాలువాలు
తో నెయ్యమాడ. వి. పు. ౨. ౨౦౯. (ఇది
ఔపమ్యద్యోతకము.)

నెయ్యమి = నెయ్యము. వి. ౧. స్నేహము, మైత్రి.

సీ. నెయ్యము నేస్తము నెయ్యమి సంగడి...
గీ... పొందిక యనఁ, బరఁగుచుండును మిత్ర
భావంబు... ఆం. భా. ౨. ౧౭౬.

౨. ప్రేమ, అనురాగము.

సీ. నెయ్యము నెయ్యమి నెమ్మి నేస్తము నెన
రెలమి మే ల్కారిమి చెలిమి యరితి. గీ...
మక్కువ యనఁ, బ్రేమ దోఁచును... ఆం.
భా. ౧. ౧౩౬.

౩. ప్రీతి, సంతోషము.

క. అయ్యా కల దొకయుపవన, మియ్యెపవన
సీమ నిప్పు డే నేర్చుగతిఁ, నెయ్యమి నొక
పూఁజప్పర, మొయ్యన రచియించితిని సమ
జ్జ్వలభంగిఁ. చమ. ౧. ౯౦.

నెయ్యము = నెయ్యమి. వి. (సం. స్నేహః. క.
నెయ్. త. నేయం.) ౧. స్నేహము, మైత్రి.

ఉ. నెయ్యము దప్ప నొండొకటి నీయెడఁ
దోఁచెనె నాదుపల్కులం, దెయ్యెడ సంజ
యా... భార. ఉద్యో. ౧. ౩౦౪.

క. కయ్యము గాని తెలంగున, నెయ్యం బగున
ట్లు గాఁగ నెఱఁ బలికితి... భార. ఉద్యో. ౪.
౩౫. ఆం. భా. ౨. ౧౭౬.

౨. ప్రేమ, అనురాగము; వలపు.

ఉ. నీవు సుభద్రకంటెఁ గడునెయ్యము గార
వముం దలిర్ప సంభావనసేయు దిట్టినసుఁ
బంకజనాభ... సభను నీడ్చెఁ గులాంగన ని
ట్లానదగునే భార. ఉద్యో. ౩. ౧౧౦.

ఉ. నెయ్యము లేనిసంగతియు నిక్కము లేని
వచోవిలాసముల్..., కయ్యము లేనిశూర

కేయుఁ గైకొని యూరక మెచ్చవచ్చునే.
ఉ. పారి. ౫. ౩౨. నైష. ౨. ౪౪.

ఆ...వనాంతరమున రేతస్స్కన్ద,మయ్యె వల
నిపతికి నెయ్యమొనర. భార.ఆది.౩.౨౪.

చ...నెయ్యము హృదయేశు దూఱవల దంచు
నిరోధ మొనర్చినో యనక. నరస.౩.౪౨.

౩. ప్రీతి, సంతోషము.

వ...కలన నెక్కటికయ్యంపు నెయ్యంబునం జె
నంగువారును...విక్ర. ౪. ౭౭.

గీ. అట్టిగోలోకమునయందు నధివసింతు, రభవు
చేఁ బ్రొద్దుప్రొద్దు నెయ్యంబుఁ గనుచు.కాశీ.
౨. ౭౭.

౪. తమి, ఆసక్తి.

సీ. అమ్మహోత్సవము నెయ్యమ్మున జూడంగఁ
దివిరి...భార.ఆది. ౬. ౧౯౨. (ఇంపు అని
శ.ర.)

౫. ఒప్పిదము, మనోహరత.

సీ. నాఁటినాఁటికిఁ బ్రోదినవకంపుఁదీవలనునుబో
దనెయ్యంబు నూలుకొలిపి. భాగ.౭.౨౬౬.

౬. బాంధవ్యము, చుట్టఱికము.

గీ. అగవుతగవు లటంచు నెయ్యంబు లనుచు,
సంపకము లంచు మతి యెన్నియైనఁ గలవు,
కాంక్షలు...కువల. ౩. ౬౫.

విణ. ప్రియము, ఇష్టము; అనుకూలము.

సీ. నీవుఁ బ్రెగ్గడయును నెయ్యంపుఁజెలియును సై
కయ్యంబునకు నెడ్డు కాలుద్రవ్వ. భార.
ఉద్యో. ౪. ౨౩౪.

సీ. పేమణిహనుమంత బిరుదాంకు లగురాచవా
రికి నెయ్యంపువరనుతుండు. నైష.౧.౩౨.

క. ఈనయమునఁ గడునెయ్యము,గా నడువఁగఁ
విశ్వసించె ఖచరాధీశుఁడు, దానవనాథుఁడు
...దశా. ౨. ౧౩౦.

నెయ్యపుఁగలను=సురతము.

మ. తళుకుంజప్పరకోళ్లమంచమున విద్యాజాజి
పూసెజ్జపైఁ, బలుకుంజిల్కలకోల్కిరాచిలు
కబాబాసాహిబూ నెయ్యపుఁ, గలనకా సా
క్ష్యము గాంచి మెయి బడలఁగా గాటంపు
నిట్టూర్పు, ల్వాలయుగ నిద్రిగుఁ దైనపద్మ
భవు నాలోకించి గోలోకలని. దశా. ౧.
౨౬౮.

నెయ్యపుఁగినుక=ప్రణయకోపము.

చ. నను భవదీయదాసుని మనంబున నెయ్యపుఁ
గినుకఁ బూని తాఁచినయని నాసు మన్న
నయ...పారి. ౧. ౧౨౩.

నెయ్యపుటలుక=ప్రణయకలహము.

క. పొలయలుక యనఁగ నెయ్యపుటలుక యనక
ప్రణయకలహ మలరారు...ఆం.శ. ౬౨.

జ: నెయ్యపుతోడు, నెయ్యమాడు, నెయ్యరి,
నెయ్యుఁడు, నెయ్యురాలు.

నెయ్యరి. విణ. (నెయ్యము + అరి.) స్నేహితు
రాలు; స్నేహితుఁడు.

సీ. నేర్పులేక చెడంగ నెండపేగురు నుండి యన
నోడువారు నెయ్యరులు గారు. రామా.౪.
౪౪. (చి. ని. శ. ర. పా.)

నెయ్యి=నెయి,నేయి. (దీనికి ప్రథమైకవచనమం
దే ప్రయోగములు గానవచ్చుచున్నవి.) ౧. ఆ
జ్యము.

క. నేయి నెయి నెయ్యి నే యనఁ,బాయక శబ్ద
ముల నిలుచుఁ బర్వతనిలయా. సర్వ. సా.
౧౧౪.

సీ. ప్రక్షాళితం బైనపసిఁడిచట్టువమున నన్నంబు
నునిచి నెయ్యభిఘరించి. కాశీ. ౬.౧౪౧.

గీ. అనిన నెయ్యి వోసినయగ్గియట్ల మండి.విక్ర.
౩. ౬౪.

౨. చమురు, క్రొవ్వు.

క. చెడుగట్టల గ్రుచ్చినసం,జుడు మంటలఁ దగి
లి నెయ్యి జోటజోట వడియుగ.మను చ.
౪. ౧౭.

పా: పాయసముపైని నెయ్యొలికినట్లు. (తలవని తలంపుగ శుభ మొనగూడుట.)

ద్వి. నెరయఁ బాయసముపై నెయ్యొల్కినట్లు, యొగవు నా కయ్యె నాయొడయ సోమేశ. పండితా. పురా. ౧౩౧ పా.

నెయ్యుఁడు. విణ. (బ. నెయ్యురు, నెయ్యురులు.) ౧. మిత్త్రుఁడు, స్నేహితుఁడు.

ఉ. వానికి నెయ్యుఁడై యమరవంద్యపదాంబుజుఁ డంబికాబ్రహ్మా,త్పీనపయోధరాగ్రపరిపీడితవక్షుఁడు...భార. సభా. ౧. ౬౬.

క. భవదీయస్నేహమునా, కవిరళతేజోనిధాయియగు నెయ్యుఁడ వైరవరవలేక మనీషి,ప్రవరా వర్తింపు మన హిరణ్యకుఁ డనియెన్. వేం. పంచ. ౨. ౪౧.

క. పురపురఁ బొక్కుచు బకపతి, కరంకమునం దేరఁ బనిచి గారవమున నెయ్యురఁ దాను నగ్ని యిచ్చి య,సురపతి యున్నంత వచ్చె సురపతి నెమ్మిన్. భార. శాం. ౩. ౫౧౨.

ద్వి...చెలియు నెయ్యురలైనయట్టి,కన్నియల్ గొలువ...ద్వి. పరమ. ౫. ౪౧౧. నిర్వ. ౩. ౧౧.

౨. ప్రేమాస్పదుఁడు, ఇష్టుఁడు.

చ. అనుమతి నెయ్యుఁడున్ హితుఁడు నైనవయస్యుఁడు సేయుకృత్యము, ల్పొనరఁగఁ జేసి తీవు...భా. రా. కిష్కిం. ౬౪.

ఆ. నెయ్యుఁ డట్టిపనికి నియతుఁడ తగుఁ గాక, గృహితకంటె చేటె కీడు గలదె, గురుహితంబు నూఁది యురిఁ బడ నే నోప, ననుచు బ్రహ్మచర్య మయుతుఁ డొంది. పాండు. ౫. ౧౭౫.

క.హనుమంతుఁడ నెడి పేరం, దనరారెడువాఁడఁ దొవలదాయయనుఁగుబిడ్డనికిం గడు నెయ్యుఁడ నీ, వెనిమిటికిం గూర్చునట్టి బిరుదుమగండన్. అచ్చ. రా. సుం. ౬౫.

నెయ్యురాలు. విణ. ౧. స్నేహితురాలు, నేస్తకత్తె. (శ. ర.) ౨. ప్రియురాలు, ఇష్టురాలు.

గీ. చొచ్చి తన నెయ్యురాలికిఁ జూపి దాని,తల్లి పాతరలాడ సామెల్ల నొసఁగె. ప్రబంధ. ౭౨౪.

నెర=నెఱ, నెఱా, నేఱా. విణ. (√ నెరయు.)

౧. పూర్ణము, గొప్పది.

మ. నెఱవిల్కాఁడవు నీవె రామ...రామా. ౬. ఆ. (శ. ర.)

౨. నేర్పరి, ఉపాయశాలి.

గీ. మత్తకరివండ నెర యైనమావటీఁడు, బుద్ధియెఱుఁగనికొమరునిపొంత దాది, యతులగర్వాంధుఁ డగురాజునందు నాప్తమంత్రి యొకవేళ నైన నేమఱఁ దరంబె. శుక. ౧. ౨౪౬.

క్రి. విణ. ద్రు. మిక్కిలి, అధికముగా; పూర్ణముగా.

మ. పురియభ్రంకషసౌధపంక్తిఁ గని వేల్పుందంతి శైలాళి యం,చు రహిం గొమ్ములఁ ద్రవ్వి యాడుటకు నచ్చోఁ జేరి యందుగ్రవై,ఖరిఁ గన్పట్టెడుకృత్రిమేభరిపుసంఘంబుల్ నిరీక్షింప వే, నెరఁ బాఱున్ వెలవెల్లనై యనిమిషుల్ నిర్విణ్ణులై చూడఁగన్. ఘటికా. ౨. ౨౦౦.

క. ధగశుసకభోగ్యమును నిహ,పరదూరము నైన తను వుపాదేయముగా, నెర నమ్మి వస్త్రమాల్యా,భరణంబు లలంకరించు పామరజనులున్. భాగ. ౩. ౪౭౪. (చి. ని. పా. 'తనువుఁ బాథేయముగా నెఱి నమ్మి' అని ముద్రి. పా.)

నెరడు. విణ. విషమము, ఎచ్చుతగ్గులు కలది.

సీ. మౌక్తికం బొప్పును ముత్తియ మన...గీ. అదియ నెర డైన గొగ్గి యం చనఁగ వెలయు. ఆం. భా. ౨. ౨౬౭.

బుల నెరసినవాఁడు. రం. రా. బాల. 3
పా. ౨౩ పం.

సీ. భూనాయకుండును...కై సేయంగ భూష
ణంబులతలంపునను బారి,యవి మున్నుఁ దాఁ
బెట్టినట్టిచో టరయించి ...గీ. నెరయ లే
కున్కి విని యారసేఁకు వింత,చందములు
పుట్టె...పరమ. 3. ౫౮.

ఆ. ధనము నెరయ లేదు తల మున్నె గొరిగిం
చుకొన్నవాఁడు గాన నున్నతలఁపులుడిగి
సీమ వెడల నడచుసే శాస్త్రోక్తశిఖ యితని
కట్ల సేయుఁ డనుచు. వైజ. ౪. ౧౧౩.

౨. వ్యాపించు, ప్రసరించు.

మాలిని...ఇంద్రు,ండరిగె దివికి దివ్యానంతర
త్నాంశుజాల,స్ఫురితసురవిమానంబుల్ నభో
భాగ మెల్లన్, నెరసి వెలుఁగుచుండన్
నిర్జరశ్రేణితోడన్. భార. ఆది. ౭.౧౯౭.

సీ. ఇందుబింబముమీఁదికిందు పందంబునఁ గురు
లు నెమ్మొగమున నెరసి యుండ. భార.
విరా. ౨. ౧౩౭.

మ. ధరణీమండలి నెందునుం బరగి పాతాళం
బునం బర్వి నిర్జరనాథప్రముఖామరాఖిల
నివాసశ్రేణులం దోలి మై,నెరసెన్ బంకజ
సంభవాలయముకన్ నిండారె నవ్వేళ శ్రీ,
కరదైతేయుతనూభవోద్భవకథాకల్యాణ ము
ద్ఘోష. మై. నృసిం. 3. ౧౪౧.

3. చెదరు; చెదరిపడు; పడు.

ద్వి. అదటఁ గనుఁగొనుచప్పు డయ్యింతి,నెరసి
నవురులును నెఱి ధూళిఁ దూలి, విరిసినసీమం
తవీథియు...ద్వి. హరిశ్చ. ఉ. ౨౦౭౫.

గీ. భూమిసుతశిరంబున నున్నపుష్పమాల,నేలఁ
బడి యున్న యది దీనిఁ బోలఁ జూచు, మ
నుజ విరు లివె నెరసిన పవనిపుత్రి,యుండ
నోపు నీఘన మగుకొండమీఁద. భా. రా.
అర. ౨. ౩౧౨.

చ...కేలుదోయి నొంపడౌరుపయి సమ్ముదంబు
లిగుర్కొత్తఁగ మాటికిఁ జల్లుసేసఁ బ్రాల్నెరసె
ననంగ వ్రాలెఁ గుహాళీవిగళన్నవకోరకావ
ళుల్. పారి. 3. ౫౩. ద్వి. హరిశ్చ. ఉ.
౨౪౧౯.

౪. నెఱవేఱు, సిద్ధించు. (శ. ర, బ్రౌ.)

౫. విడివడు,తప్పించుకొను.

రగడ. నెరసి పోఁ జూచెదవు నిలు నిలువుమా
కనము,గురియుతే నెలజీబుకొన్న దంతట వ
నము. మను చ. 3. ౭౪.

జః నెర,నెరపు, నెరయించు, నెరయిక, నెరవ
చ్చు, నెరవరి, నెరవు[1].

నెరవంజి=నెరవెంద. వి. తీక్ష్ణగంధము, మునగ***.**
(శ. ర, బ్రౌ. నెలవంజి. అని చి. ని.)

నెరవచ్చు. అ. క్రి. (నెర+వచ్చు.) అధికమ
గు, ఎక్కువయగు.

సీ. కాంతిసంపద నిశాకరుతోడ నొరసిన మె
చ్చు మీఱఁగ నెరవచ్చువాఁడు. ఆ...మం
త్రిభాస్కరుండు. దశకు. ౧. ౭౫.

నెరవరి. విణ.(నెరవు+అరి[3].) నేర్పరి,కుశలుఁడు.

చ...అట్టిదుర్నయపుటూరడి కెంతయు నియ్య
కొల్పుటల్, నెరవరి గాఁడు రాజనుచు
నిష్ఠురవాక్యము లుగ్గడించుచున్. రంగా.
౨. ౧౦౯.

నెరవిడి. వి. (క. నెఱవణిగె.) అతిశయము, ఆధి
క్యము.

సీ. రథ్యాప్రతీకోత్థరవముచే గిరికోటి పిడుగుల
నెరవిడిఁ బిఱుఁదుకొనఁగ,ఉ. పారి. 3. ౨౪.
(శ.ర.పా,చి.ని.పా. నెఱవిడి. ముద్రి.పా.)

క్రి. విణ. నిండుగా,పూర్ణముగా.

క. మెఱుఁగు లగువాఁడిమూర్కులు, నెఱఁకు
లుగాఁడఁగొన నగజ నెరవిడిఁ జూడన్,డె
బ్బలకోనుకతనఁ గా కెటు,దెలువాఁ దమ్మరు

నెరవు[2]. అ. క్రి. (క. నెఱవు.) గుమిగూడు.

ద్వి. అంత విద్వజ్జను లంతంత నెరవి, చింతమైఁ జేతులు నెక్కిళ్ల నూఁచి. పండితా. మహి మ. ౨౪౪ పా.

ద్వి. పొరిఁబొరి నీక్రియఁ బురుషులు దారు, నెరవి పుణ్యాంగనానికర మేతేర. పండితా. పర్వ. ౩౪౩ పా.

నెరవు[3]. వి. ఒకానొకచెట్టు.

ద్వి. కొగవులు నెరవులు గురువిందపొదలు, నరుదుగాఁ బొదలినయంబాళములును. రం. రా. ఉ. ౧౧౯ పా. ౧౫ పం.

నెరవెంద=నెరవంజి. వి. తీక్ష్ణగంధము, మునగ చెట్టు. (శ. ర.)

నెరసు. వి. ౧. సికతావిశేషము, ఒకవిధమైన యిసుక.

సీ... సికతాఖ్య యిసు మన నిసుక నా నెసఁగుచుండుఁ. గీ. దద్విశేషంబు నెరసు నాఁ దనరు... ఆం. భా. ౧. ౧౫౫.

౨. నలుసు, రేణువు.

ద్వి. కరతలాంగుళములఁ గను లెప్పలెత్తి, నెరసున్న దని పొలి నిక్షించి యూఁదు. బస. పు. ౩. ౭౭౩ పం.

గీ. అనిమిషులగుండెలో గాల మఖిలలోక, నేత్రమున నాఁటి వేధించు నెరసు గాలి, కాలి ముల్లు కుభృత్పాలిపాలిపిడుగు, రావణుఁడు డిండె భువనముల్ రక్తిఁ జెందె. ఉ. రా. ౧. ౧౪౯.

రగడ. నింతు నింతులకంటెఁ బుప్పొడి, నెరసు నెరసులు పల్కు నింతయు. వసు. ౩. ౧౪౭.

సీ. అతివచూపులకును బ్రతి యనవచ్చునే మరునిబాణములకు నెరసు దఱుచు. తపతీ. ౧. ౧౭. ('దోషము.' అని ధ్వన్యర్థము.)

౩. గవుండ్లవాఁడు కత్తులునూ రెడుపొడి. (శ. ర.)

౪. చిన్నతప్పు; లోపము; దోషము.

గీ. నెరసు పొడగానలేఁ డయ్యె నెమకి నెమకి, సాంబుఁడై బాంచజన్యరథాంగపాణి. కాశీ. ౭. ౭.

ద్వి. నెరసులఁ దప్పులు నెమకుచు నొక్క, వెరవు చిత్తంబున వెదకి... ద్వి. హరిశ్చ. ఉ. ౧౫౯౩.

ఉ. కరభములకుఁ బుష్పితరసాలవాటికఁ, దిరుగఁ గంటకంబు దొరకనట్లు, కుకవికీటములకు సుకవికావ్యములోన, నెమక వీసమంత నెరసు లేదు. ప్రబోధ. ౧. ౩౦.

మ... అద్దేవుని నాశ్రయింప నలని స్వీక్షించి యాచూడ్కి యే, నెరసుం బొందక యుండ వచ్చి మముఁ బ్రానెమ్మిక మహాభాగ్యసుం, దరుఁ డబ్రారుఁడు చూచుఁగాత... హరి. పూ. ౭. ౯౫.

౫. కళంకము, మఱక.

సీ. నిండారు చందురు నెరసు తక్కువపడఁ దిలకించు ముద్దుమోముల బెడంగు. హరి. ఉ. ౭, ౪౭.

౬. అసత్యవచనము, కల్లమాట.

రగడ... నింతు నింతులకంటెఁ బుప్పొడి, నెరసు నెరసులు పల్కు నింతయు. వసు. ౩. ౧౪౯.

విణ. నలుసు, చిన్నది.

సీ. నెరసుఁజూపులతోన నెయ్యంబు కూర్మికి నెర వైనతియ్యంబు నిగుడుచుండ. విక్ర. ౪. ౨౦౩. (క్రేఁగంటిచూపులు అని భావము.)

నెరసుదెగడు=తప్పులెన్ను, నిందించు.

సీ. కను కెంపు వెట్టినతన కొయికన్నులు నెతివిరి దముల నెరసు దెగడ. భా. రా. అర. ౧. ౪౩. (ఇట ఔపమ్యద్యోతకము.)

నెరసు వెట్టు=దోషినిఁ జేయు.

సీ. నెరసు వెట్టితి పరాశరులంతవాని నట్టిటఁ బామరకన్యగాఁడు మరపి. పి. శకుం. ౩. ౧౪౯.

నెరి=నెఱి. వి. వక్రత, కౌటిల్యము.

సీ. నెరిఁ జుట్టుసిగ నాఁటిపారగుడ్డ పనివడిఁ దీర్చుకో నెలకుంటు తిరుమణులును. రా. వి. ౨. ౫౩.

సీ. మొలకచీకటి జలజల రాల్పఁగా రాదె నెరులు మించినపీరిపురులయందు. పాండు. ౧. ౧౧౪. (శ. ర. పా. 'నెఱులు' ముద్రి.)

విశ. వంకరయైనది, కుటిలమైనది.

సీ. నెరిపురు ల్చెదరి క్రొవ్విరిసరుల్ వసివాడ నొప్పూదప్పినగొప్పకొప్పుఁ జూచి. శుక. ౧. ౨౨౫.

నెరుకు. విశ. (త. నెరుక్కు.) ముదుకరమైన, దట్టమైన.

ద్వి. పిరిగొన్నపూసలపేరు లొక్కొంత, నెరుకుఁ గాసియలపై నిగనిగ మనఁగ. అ. మ. క. ౧. ౫౦ పా. ౧౯ పం.

నెరుము. స. క్రి. రాచు; గ్రుచ్చు, పొడుచు.

ద్వి. నెరిమి డాకాలఁ బెండేరంబుఁ బెట్టి. ద్వి. సారంగ. ౨. భా. (శ.ర.)

చ. గురుకుచ వానితో మ్ముఁ జనుగుబ్బమైన న్నెరమంగ వాఁడు న్యయ్యరవిరిబోఁడిమోవిచిగు రానఁగ నెం చిసుమంత కొఁకినక్. శకుం. ౩. ౯౦.

నెఱ= నెర, నెఱా, నేఱా. విశ. (త. నిఱై.)

౧. నిండు, పూర్ణము.

సీ. నెఱచందురుని సిగ్గువఱుపంగఁ జాలునీనెమ్మోము తాలిమి వమ్ము సేసె. భార. అను. ౧. ౫౧.

చ...కన్పడినెఱగిన్క కొట్టిమగవారను నోర్తురె యిజ్జగంబులక్. భార.ఉద్యో.౧.౨౪౭.

సీ. ఫణివిభవహ్నిఁ జేర్పడియున్నశశిరేఖ నెఱ విదుపునఁ గాంతి వఱలునట్లు. కు. సం. ౪. ౯౯౪. దశా. ౨. ౨౪౧.

౨. పెద్దది, గొప్పది.

క. నెఱిగొంపెలు గొప్పలుచే, [illegible] యూరుం టిని[illegible] [illegible] [illegible] టిట్టఁ ప్రౌ[illegible] [illegible] [illegible] ద[illegible] [illegible] తా. ౩. ౪౯.

సీ. కలహాం[illegible] [illegible] [illegible] గార్యవిని [illegible] [illegible] రాలి. [illegible]. ౩. ౧౯.

చ... మత్కు[illegible] [illegible] బోను [illegible] [illegible] నిల్పఁ బ్రఫుల్ల[illegible]డి. వసు. ౪. ౯౫.

౩. ఉత్తమము, ప్రశస్తము.

ద్వి. నెఱరంగుని[illegible] [illegible]న్నా[illegible], గలిగొన గాజు నిగిడ్చి [illegible] నిం[illegible]. ద్వా. [illegible]. పూ. ౨౯౩౨.

ఉ. ప్రా[illegible] [illegible] లంబునఁ బుస్తి...[illegible]. ౩. ౩. [illegible]. ౫.౧౫.౨.

౪. వాఁడి, నిశితము.

వ...వనంబు [illegible] [illegible] [illegible] నఱకి పడ్డ[illegible] దగు[illegible] గాఁ[illegible]దిగొ[illegible]ని... పారి. పూ. ౫. ౪౯.

క. ఒక్కొకనెఱ నాగసుమున, [illegible]కుఁడవడి వారియుగము నేసి నిలుపుముక్. భా. రా. యు. ౧౧౨౫.

ఉ. కిమ్మనిరింటినోదు [illegible] [illegible] లేనమిటారి తమ్ము లీలతమ్ముల [illegible] నో[illegible]... వసు. ౫. ౧౦౧.

౫. సమర్థుఁడు, దక్షుఁడు.

గీ. పరఁగు నమ్మేటి నెఱ రాతుప్రోలిశీశీన. ప్రభా. ౨. ౩౩.

సీ. గోడ దొల్చెడుచోఁగ గుబ్బంపునెఱజోదు గాటంపుటక్కటికములపాదు. అప్ప. రా. బాల. ౪. రామా. ౪. ౯౯.

నెఱఁకులాడు. అ. క్రి. (నెఱఁకులు+ఆడు.) అయుపుపట్టున గ్రుచ్చుకొను.

ఆ. ఎఱుక నన్ను నఱక యేసినశరములు, నెఱఁ
కులాడి నాదు నిశితదివ్య, విశిఖతతులయట్లు
వేదన గావించు, టిది యపూర్వ మింతఁ జె
ప్పఁ దొడఁగె. భార. అర. ౧. ౩౧౪.

క. ఇనుఁ డస్తమించెఁ జీకటి, యును మింగులును
సడ్డగించె నస్త్రలి నాకుం, జన శక్తి లేదు దర్ప
కు, నస్త్రశస్త్రములు నెఱఁకులాడెడుఁ దో
ర్ణో౯. మార్క. ౨. ౧౬౩.

గీ... విశల్యకరణిచలన, నెఱఁకులాడినయలుఁగులు
వెలికి పోయి. భా. రా. యు. ౧౧౨౦.

నెఱఁకులేయు. స. క్రి. (నెఱఁకులు + ఏయు.)
మర్మభేదనము చేయు.

గీ. తరుణి నతనాభికుండలోదంచనాభి, రాను
రోమావళీజ్యావిరాజమాన, నీదుతను వుండ
విలు సేసి నెఱఁకులేయు, రతివరుఁడు పారగు
లికల రాజహంసు. వైజ. ౨. ౯౩.

ఇష్టో: నెఱఁకులుమీటు.

చ. కఱతలు నెద్ద వీని కిటు కాటియఁ జెట్టెడు
మాన మేమిటన్, నెఱఁకులుమీటుచుండుఁ
దననీచపుమాటలు... నృసిం. ౪. ౧౩౫.

నెఱక. వి. (త. నెరికళం.) పెండ్రుక, కేశము.

సీ. మత్పాదరత్నుఁడు మావువెన్నెఱకఁ గుట్టిన
రూటితిపిరిదండెయును మెఱయ. ఆము.
౬. ౬.

ద్వి. తుఱఁగలింపఁగ భక్తి నెఱక లుప్పొంగ.
పండితా. పురా. ౯౦. పా.

సీ... పెండ్రుక నెత్తి నెఱక నాఁగఁ దనరుఁ గే
శము... ఆం. భా. ౨. ౧౪౫.

గీ. నెఱులు కురులు పెండ్రుకలు నా నెఱకలు...
ఆం. నం. మాన. ౧౯.

నెఱకాఁడు. విణ. (నెఱవు + కాఁడు. త. నిరైయ
న్.) ౧. పూర్ణుఁడు. (శ. ర. బ్రా.) ౨. ప్రియుఁ
డు, ఇష్టుఁడు.

వ... బెడంగుతరఁగలతో డొరయు నెఱకాని నె
నరుఁబలుకుల వెనుదవిలి యలరించుజక్కవ
పెంటులును... అచ్చ. భా. ౨. ౧౬. పా.
(సహచరం=ప్రియమ్ అని. సం. కిరాత. ౬.
౭ శ్లో. వ్యాఖ్య.)

నెఱతనకాఁడు. విణ. (నెఱతనము + కాఁడు.)
పూర్ణుఁడు, నెఱతనముకలవాఁడు.
(స్వారో. చ.) చ. నెఱతనకాఁడవై మెఱసి నిర్మ
లకాంతి విలాసరేఖలన్. మనుచ. ౪. ౭.

నెఱతనము. వి. (నెఱ + తనము.) ౧. వైశాల్యము,
పూర్ణత.

సీ... నెఱతన మన నాభోగసంజ్ఞ యై యడ
రును... ఆం. భా. ౨. ౧౬౩.

౨. కుశలత, జాణతనము.

సీ. వినయవిధేయవివేకశీలతలచే ననుకూలతయు
నెఱతనము నేర్చి. వి. పు. ౪. ౨౨౦.

క. అవిరటితోన యాతని, లావును నెఱతనము
తేజు లాగుకొని... అచ్చ. రా. బాల. ౨౦౭

సీ. తారుణ్యములె చాలుఁ దలఁపులు గరఁగింప
నెఱతనం బేలొకో నేర్చి రిట్టు. కవిక. ౧.
౨౦.

౩. శక్తి, సామర్థ్యము.

సీ. వాతాపి జఠరాగ్ని వైచి పొక్కిటి క్రింద
నిమ్మ రజీర్ణించిన నెఱతనంబు. తారకబ్రహ్మ
రాజము. ౧. ౮.

౪. ధర్మము, న్యాయము.

ఆ. పొలసుదిండికొలపుతలకట్టవై పెఱ, తెఱవఁ
గొనుట నీకు నెఱతనంబె. అచ్చ. రా. యు.
౩౦.

నెఱను. వి. బొ. (దీనినువర్ణమునకు ఏకవచనమున
వికల్పముగాను బహువచనమునందు నిత్యముగా
ను బిందుపూర్వక మగు 'కు' వర్ణ మాదేశముగా
వచ్చును. ఉదా: నెఱఁకన్, నెఱఁకులు మొ.)

క. కోరినవంటకములు నా, నేరిమిఁ దగ నెఱపి కొలుతు నిశ్చలభక్తిన్. భార. విరా. ౧. ౨౧౯.

చ. పలికినచందముల్ నెఱపి పైతృకమై చను రాజ్యభాగ మిమ్ములఁ బడయం దలంచి బలముం జలము న్నెఱపం గడంగుమీ, రలు నొరు వేఁడఁ బోదురె... భార. ఉద్యో. ౧. ౨౬. కాశీ. ౨. ౧౧.

వి. వ్యాపనము. (శ. ర, బ్రా.) విణ. అధికము. (శ. ర.)

నెఱమీటుమొన. వి. (√నెఱ.) మల్లబంధవిశేషము, పండ్రెండు మొనలలో నొకటి.

వ... లో మొన... నెఱమీటుమొన సరితాళంపుమొన యాదిగాఁ గలపదిరెండుమొనల నారితేఱి... హంస. ౧. ౨౦౬.

వ... నెఱమీటుమొన సరితాళంపుమొన లాదిగాఁ గలపదిరెండుమొనలు... ప్రబంధ. ౭౫.

నెఱయించు=నెఱపు.

(వెలయించు.)

గీ. సిరుల నలరించె సిద్ధంపుజిగి ఘటించె, నొయ్య నెఱయించె నొకయింతయొఱపు నించె, ...చేదిమేదినీనాయకుండు. వసు. ౬. ౯౧.

నెఱయు=నెరయు. అ. క్రి. (దీనితుమున్నంత రూపము. 'పూర్ణముగా' అను నర్థమును క్వతి శేకక్రియలతోఁగూడి కొన్నిపట్ల 'ఎంత మాత్రము, బొత్తిగా' అను నర్థము నిచ్చును.) ౧. నిండు, పూర్ణమగు; అతిశయించు.

సీ. సింధురారోహణశిక్షల దక్షుఁడై నీతిప్రయోగముల్ నెఱయ నేర్చు. భార. ఆది. ౫. ౧౫.

చ. ఎఱిఁగితి నీతెఱంగు విను మీదుముఖీ యొకనాఁడు ముగ్ధలం, దఱమును గూడియాడఁగ సుధాకరశేఖరుకాంత నీమదిన్, నెఱసిన కోర్కి దీర్ప నొకనేర్పరి సీకల వచ్చు నంటకుం, దఱి యిది... హ. హరి. ౫. ౯౭.

వ... శాలీనుచిత్తంబు జానపదత్వముగ్ధత్వదోషంబునంజేసి ము న్నశ్యంతాపూర్వనస్త్ర భూషణాద్యాడంబరంబునం దలంకి తదలంకృతపత్నీరూపంబునకు నెఱయఁ గొలుప కుంటుటయు... కళా. ౪. ౧౩౯.

ద్వి. నెఱసినకడిమిమై నిన్నుఁ బూజించి, మఱి పోవువాఁడనై మది నిశ్చయించి. రం. రా. అర. ౧౪౮ పు. ౯ పం.

౨. వ్యాపించు, ప్రసరించు.

సీ. కౌరవాధీశ్వరుకన్యకారత్నంబుఁ గామించి సాంబుండు గజపురంబు, సొచ్చి ముచ్చిమిసేయఁ జూచిన నెఱిఁగి యప్డారాజు కారాగృహంబునందు, నిగ్రహీతునిం జేయ నెఱసె నవ్వార్త వేగమ... హ. హరి. ౧. ౯.

గీ. నెఱసె నొకయెడఁ దామ్రపర్ణీజలార్ద్రి, చందనాచలపవమానకందళములు. పారి. ౩. ౪౬.

ద్వి. పామ. ౩. ౧౮౩.

౩. చెదరు; చెదరిపడు.

సీ. శ్రవణావతంసవాసనఁ గ్రోలు నెలదేఁటిగఱులతెమెరల ముంగురులు నెఱయు. దశా. ౨. ౨౯౬.

గీ. కేసరంబులరజము పుష్పాసవంబు, నెఱసె నిదె చూడు కన్నుల నీరు గ్రమ్మె. హర. ౧. ౨౭.

౪. నెఱవేఱు, సిద్ధించు; చక్కఁగా జరుగు.

గీ. కలుగు నొకొ నాకు నొకనాఁడు కన్నులార, శివునిఁ జూచుపుణ్యం బనుచింత నెఱయ, మొదలివేలుపుఁ బొడఁగంటి మ్రొక్కఁగంటి. హ. హరి. ౨. ౧౩౩.

క. నీ వదితినందనుఁడ వగుటయు, దేవత లందఱును దేవదేవ ధ్రువముగా, దేవాహ్వయంబుఁ దాల్తురు, నీవాత్సల్యంబు గోర్కి నెఱ

యుఁగఁ బడెడే. హరి. ఉ. ౧౦. ౨౦౮.

క. రథ మవిరథ మైనను సా,రథిపని నెఱసిన మహాస్త్రరాజి విధికృతిక్, పృథ గాఢ స్నను గర్ణునిఁ, బ్రథనంబున గెల్వ దేవపతి కిక్ వశమే. భార. కర్ణ. ౧. ౪౩.

౫. వెలయు, ప్రకటితమగు; ప్రకాశించు.

సీ...పదఘట్టనంబులఁ జదిసి దొలు. ఆ. నుఱుము గాఁగ నిట్లు నెఱయంగ సత్వంబు, మెఱసి రాతి రెల్ల నుఱక పవన,తనయుఁ డరిగె... భార. ఆది. ౭. ౧౭౦.

గీ. అనిన విని వార లందఱు నగ్గలికలు, నెఱయుమాటలఁ దనతన తెఱఁగు మెఱయ, బహువిధంబుల నతనికి బాస యిచ్చి, యేచి నిజసైన్యములలోని కేఁగి రధిప. భార. భీష్మ. ౧. ౧౦౦. భోజరా. ౭. ౩౧౭.

మ. కఱయుఁ మాఁగును లేక పుట్టినభుభాంగం బద్భుతాపాది యై, నెఱయం గన్నులు విచ్చి చూచుతనయుఁ వీక్షించి మోదంబు నక్. హరి. పూ. ౫. ౧౧౯.

జః నె,నెఁదోలు, నెచ్చెలి, నెచ్చెలి, నెచ్చెలికత్తె, నెచ్చెలికాఁడు, నెచ్చెలువ, నెచ్చెలువము, మొ.

నెఱవణి(డి). వి. (√నెఱ-క. నెఱకణిగె.) ౧. పరిపూర్ణత.

ద్వి. మఱి యట్లు కాక యచ్చిఱుతొండఁ డర య, నెఱవణి కలభక్తినిరతుఁ డేనియును. బస. పు. ౪. ౧౨౪ పే.

౨. యుక్తి, చమత్కారము.

(వ్యవ.)వాఁడు నెఱవడిగా వ్రాసినాఁడు. (వ్రా.)

నెఱవాది. విణ. (నెఱ + వాది-శ. నిష్ఠైవాది. 'నెఱవు + అడి' అని శ ర.)

వేది నీ వీఁకలుకక్, నెఱవు గఁ కేపట్టిన నది, నెఱకునఁ బంచి దనిసట్లు చెఁగి దినిస్సి.విక్ర. ౭. ౨౧.

సీ. నెఱవాది నని వచ్చి నిదఁ గట్టు నిచ్చియు చెలి నీణ వాయింప నేర్చు. విప్ర.౪ ౧౧.

౨. జాణ, నేర్పరి.

క. ఈఱువది వాలుగు శిద్యలు, నఱువది వాలుగుది నఁబులంతన వారలే, నెఱవాదు లైనతమున, నెఱి నొగ్గొక వాఁటివికి నేర్చి రి లేశా. భాగ. ౧౦ పూ. ౧౪౧౦.

సీ. బాలుఁడ నే నిష్టబాలోచితక్రీడ లనుభవించెద మఱి యావనమున, నెఱవాది నై ధర్మ మొనరించి చేసెదఁ గాక యని పోవు... నృసిం. ౪. ౪౭.

క.ఎఱుఁగనివారిరెమ్ముదుగ బల్వితిముఱి మెఱ మెచ్చుమాట లాడఁగ నేలా,నెఱవాది వగుదు నీకా, గెఱఁగ వె మునిముచ్చుఁదనము లేమిటి కింకక్. భోజరా. ౪. ౩౧౪.

౩.వాచాలుఁడు, అధికముగా మాటలాడువాఁడు.

క. జాదరివి కుమాలివి నెఱ,వాదివి టక్కరివి గొలువవచ్చునఁటే దా,మోదర నిను మాకు ...ఉ. హరి. ౩. ౧౧౩.

౪. సమర్థుఁడు, శక్తిమంతుఁడు.

చ. మొకములఁ బట్టి కట్టుకల మీఁటి చనం జన నీక యేఁగి తెం,కిఁ జనఁ జేయ బోనుసటుఁ గిల్కొలుపం బయి వచ్చి నేనిఁ దప్పక దొరుచుదంగ నేర్చు ఘనబాహుబలంబును గల్గి మేఁటివేఁ,టకు నెఱవాదు లైనసుభటప్రకరంబులు ప్రాల నేఁగఁగక్. పి.శకుం. ౨.౩. బస. పు. ౫. ౧౪౭ పే.

చ. తొలితొలి దక్కినీరమణితో నెఱవాదివి

నెఱవాదితనము. వి. (నెఱవాది + తనము.) జాణతనము, నేర్పరితనము.

చ. అతిమతి లోకజాలము భయంబునఁ జెంద వారిం గుఱించి నిష్ఠురతప మాచరించెను వసుంధరఁ దుల్యుఁ డనంగ సన్మునీశ్వరుఁ డొకఁ డాతపంబు నెఱవాదితనంబునమానుపయంచు స్వర్గరమణుఁ డంపె నన్నా... చిత్ర భా. ౫. ౩౭.

ఉ. లేరె ధనుర్ధరుల్ పుడమి లెక్కకు మిక్కిలి యొండు రెండుగా వారె దరింతు రేటి నెఱవాదితనం బది రెండు నొండుగా, నారసి వేయు నేరవలదా మఱి నీవలె నెంత వింత ...మస్తభా. వేం. పంచ. ౩. ౧౯౩.

నెఱవిద్దె. వి. (నెఱ + విద్దె.) హస్తలాఘవము కల జాలవిద్య. (శ. ర, బ్రౌ.)

నెఱవు=నెరవు[1]. వి. (√ నెఱయు.) ౧. పూర్తి, నిండుతనము.

ద్వి... అది రుద్రుని తెలుంగునను, మెఱసెఁ బొమ్మను మాట మిక్కిలిగాఁగ, నెఱ వార నందఱ నిర్జించెఁ గాన. రం. రా. యు. ౪౦౯. పా. ౩౧ పం.

సీ. పుణ్యపంచక్రోశభూతీర్థమహిమంబు నెఱవుగా సర్వంబు నెఱిఁగనేని. కాశీ. ౭. ౧౧౦. ('నెరవు.' అప ముద్రి.)

౨. వ్యాపనము. (శ. ర.) ౩. మార్గము. (శ.ర.)

విశే. ౧. పూర్ణము, సమృద్ధము.

ద్వి. కలి కైనయాకుంభకర్ణునియందు, నెఱ వైన కడిమికి నిలువక కపులు. రం. రా. యు. ౪౦౭ పా. ౧ పం.

క. నెఱ వగుసంపద గలిగిన, నెఱి దానం బుడుపఁ గట్టనేరనిమనుజాం, డఱిముఱిఁ జేనికిఁ గట్టిన, నెఱబొమ్మరొ కాఁడె యెన్నివిధములఁ బూడగ్. విక్ర. ౨. ౧౪౯.

౨. వ్యాప్తము. (శ.ర.) ౩. వ్యాపకము. (శ.ర.) ౪. విశాలము.

క. ముఱిముఱిచీకటితో నం, దఱు రాజులు సమర ముడిగి తగ నెల్లిటికిం, గొఱ గలకల నగు నమువుఁడు, నెఱవగుగోవర్ధనాద్రి నేలకు నను చుక్. ఉ. హరి. ౪. ౨౭౨. (వీరేశ.పా.)

౫. అధికుఁడు, ఎక్కువవాఁడు.

ఆ. పుడమి తేనితోడఁ దొడర నీలావేమి, ఖరునికంటె నల్లగట్లుసూడు, కొడుకుకంటె గండ్రగొడ్డలితాలుపు, నేలవేల్పుకంటె నెఱవె చెపుమ. అచ్చ. రా. యు. ౩౩. (శ.ర.పా. 'నెఱయె.' ముద్రి.)

౬. యుక్తము, తగినది.

వ... అందు నందును వేఁటకు నెఱ వైనవాండ్ర నేర్పఱించి తెచ్చుటకు వనచరుల నీవు నీవని నియమించి ... మను చ. ౪. ౨౭. (శ. ర. పా.)

౭. చతురుఁడు, నిపుణుఁడు.

ద్వి. నెఱ వైనపెద్దలు నేరనియట్టి, కఱపులం గఱచె నీకతకారిబిడ్డ. అ. మ. క. ౧. ౩౪ పా. ౨౨ పం.

నెఱవేఱు. అ. క్రి. (నెఱవు + ఏఱు[1]. త. నిఱైవేఱు.) ౧. సిద్ధించు, ఈడేఱు.

గీ. దివ్యకోటీర మాహారతి ప్రశక్తి, యుద్ధసహాయతకు నాకిఁ డొసఁగె నీవ, రుండు మద్బంధువై రమారూఢి నిర్వహించె నెఱవేఱెఁ జెప్పెడి దేమి...రాఘవ. ౩. ౭౪. ('నెఱ వేరు'. అపముద్రి.)

సీ. ఈడుమీఱె ననంగ నీడేఱె ననఁగను వయసు వచ్చె ననుట వర్తిలు నందు, వంత్యంబు నెఱవేఱె ననుటయుఁ దోఁచును...ఆం.భా. ౩. ౯౪.

౨. ముగియు, పరిసమాప్తమగు.

(కృప.) దైవకృపవలన నేఁటితో చేతలఁచిన కార్యము నెఱవేఱెను.

నెఱవేఱుచు(ర్చు). స. క్రి. (√నెఱవేఱు) ౧. ఈడేర్చు, సిద్ధింపఁజేయు.

అ... ఆజవంజవముఖా,సక్తియుక్తి నోలిసాహసమున, నీమనోరథంబు నెఱవేర్తు నేనియు, నవుల నెట్లు నైతు రార్యజనులు. కృ.శత. ౩. ౪౩.

క.కృతయుగమున వేదవతీ,సతి యై తప మొంది త్రేత జనకజ యై తా, మతిఁ దలఁచినటుల పట్టిన, ప్రతినయు నెఱవేర్చెఁ దత్ప్రభావం బసదే. ఉ. రా. ౩. ౧౩౩.

౨. ముగియఁజేయు, పూర్తినొందించు.

చ. జనవున కాహితాగ్న్యుచితసత్క్రియల న్నెఱవేర్చి నన్నిటిన్. చం. రా. ౪.౫౫.

ఉ. ఆచెలి యిచ్చ మెచ్చి కొని యాతని ప్రో ల...వేచినయంత హోమవిధి విశ్రుతుఁడున్ నెఱవేర్చి యుండటన్. ఉ. రా. ౨.౧౨౪.

నెఱసరి. వి. (నెఱ+సరి. త. నిఱైసరి.)- ౧. శౌర్యమునను పూర్ణోపమాన మైనది-సింహము.

క. నెఱసరియు దానిపైఁ బడి, కఱవక లాఘవము లేమిఁ గాల్గిన్పుచు నవ్వేఱువం గదిసిన నతెఱఁగెఱిఁగి ఖరం బదరి తిరిగి యేఁగుచు నుండెన్. వేం. పంచ. ౪. ౫౬౦. (చి.ని. పా. 'నెఱిసరిగ' ముద్రి. పా.)

గీ. నెఱసరిని మించు మించుకే లాఱు పాదము, నెఱసరిని బెంపుఁ జంపుఁగా నెలఁతనడుము. ప్రబంధ. ౬౭౬.

ద్వి. నెఱసరి కరిఁ జూచి నిగిడి కోపించు, తెఱఁగునఁ గనలి గద్దియ డిగ్గ నుఱికి. ద్వి. పర ము. ౨. ౧౧౦. పా. ఆం. భా. ౩. ౫౭.

౨. నిండుసామ్యము, పూర్ణోపమానము.

గీ. సింహ పూర్ణోపమానముల్ నెలఁగునను నెఱ, సరి యనం జని పలు కాదె... ఆం. భా. ౩. ౫౭.

విణ. శౌర్యయుతము.

క. చతినుండి తొలఁగ నుఱికెను, నెఱసరిసింగంబుఁ బోలె నిబ్బరమునఁ గ్రోథతికిం దొలఁగక బకుని, యఱకటనుండి భుని మీఁది కబ్బలియుండఁగన్. పారి. పూ. ౬. ౧౦౫. (శ.ర.పా. 'నెఱసింగపుఁ గొదమఁ బోలె.' ముద్రి.)

నెఱసు. వి. అశ్వశిక్షా భేదము.

సీ. పరసంబు నొందించి పల్లంబు కల్పించి నిగుడంబు నమకొల్పి నెఱను నెఱపి. పి.శత. ౧. ౧౧౨.

నెఱా=నెఱ. విణ. (త. నిఱై.) నిండు,అధికము.

చ. కలనువనావనార్ధపరికల్పితమం దరులమ్ములం దువ, ర్తిలుచెలువల్ నెఱాపసరు జేరెను పై రుల మీఁటుకీనపం,క్తులమురుచాయలం దెలిసి త్రోలినఁ దక్కుణికాలికాలిచం,చులఁ గను చొప్పు దిక్కులకుచొక్కుపుపచ్చల పొమ్ములో యనన్. అచలా. ౨. ౧౮. ('నెరా.' అప ముద్రి.)

క. రతనాలదొంతి విం తగు, రతినాయకుదంతి కడునెఱాకుందనపుం, బ్రతిమే కద కాంతి బళీ, యతివల మేల్ బంతి యింతి యభివర్ణింపన్. ముకుంద. ౧. ౨౩౦.

ఉ. కొమ్ములు పీరణాలు జిగిఁ గుల్కెడుపాత్రల కృష్ణలీలలుం, గ్రమ్ముకడార్లు పీరుఁ దగు కాటమరాజుకథానులాపముల్, బమ్మినపుస్తకాలు ముఖపట్టిక కట్టురుమాలులు న్నెఱా,సొమ్ములు నాయముల్ తెలయుకుదులగొల్లలు వచ్చి రెంతయున్. హంస. ౨. ౫౬.

నెఱి. వి. (త. నెఱి.) ౧. అందము, ఒప్పిదము.

క. నెఱి గలుగు నాఁడునాఁటికి, గుఱి గడవఁగఁ బెరుఁగు జఘనకుచకచభరముల్. కు. సం. ౫. ౩.

౨. పాడి, ధర్మము.

క. ఈనెఱివప్పినమాటలు, నీనోటన్ వెడలఁ దగునె సండినసభలోన్. భార. ఉద్యో. ౨. ౧౫౯.

ఆ. నీవు ననకమున్న నెఱితోడ మనకార్యము నకుఁ దగినయత్నములు ఘటించియుండె నేని వాని నొం డేమిచేయం జేయఁగలదు తోడితె మ్మవార్యశౌర్య. భార. అర. ౭. ౪.

౩. సౌశీల్యము, సుస్వభావము.

క. ఎఱుఁగవె యజాతశత్రుని, నెఱియును ధర్మం బు సత్యనిష్ఠయు... భార. ఉద్యో. ౩. ౬౭౮.

గీ. ఇట్లు తమతమవర్తించు నెడలఁ జకలజనముల కు హృదయానురంజన మొనర్చి, తాల్మి పు యిలోట యడఁకువ తఱవు మెలపు, నెఱి తె ఱంగును బాటింప నేర్పు గలిగి. భార. విరా. ౨. ౩.

౪. క్రమము; ఉచితస్థితి.

క. మ మ్మెఱుఁగు దెదిరి నెఱుఁగుము, నెమ్మి యె ఱుఁగు దర్పిద్ధి నెఱి యెఱుఁగుము వాక్యమ్ము లపధతి నెఱుఁగుదు... భార. ఉద్యో. ౩. ౩౪.

చ. అని తనమాట కియ్యకొనునన్నరపల్కుల కిచ్చ మెచ్చి యజ్జనపతి భీమునిం గవలఁ జయ్యనఁ బిల్వఁగఁ బంచి యతెఱంగు నెఱి నెఱుంగఁ జెప్ప... భార. మహా. ౧. ౭.

క. అఱవఱ లైనరథంబులు, నెఱి దప్పఁగఁ బడి నయశ్వనికరంబులు... భార. భీష్మ. ౨. ౧౩౬.

క... నెఱి చెడి సుడిగాలి విసర నిలువక పెలు చన్. ఉ. హరి. ౨. ౨౪.

౫. సదాచారము.

క. నెఱి గలవిప్రుం డయినను, గుఱుకొని యజ్ఞో పవీతగురుతేజతఁ దా, నెఱిఁగి ధరియించు టుచితంబ, ఱెఱుఁగక ధరియించె నేని నిలఁ దగ వెంచున్. విజ్ఞా. ఆచా. ౩౦.

క. ఈనెఱిఁ గరిఁ గొని రాజ్యం, బైనను గ్రమ వృత్తి నన్యాయపు బహుపదముఁ, గానంబడ దయుక గల్గను... భార. అను. ౩. ౩౦౨.

౬. ఉత్సాహము, కుతూహలము.

క. అని పల్కునతనితాల్మికి, మనమున నెఱి యెఱిగి చాల మెచ్చెయును గలిఁ బోసిన వెనుక నస్తికడఁ జూచినగతి నను నతివ యాస చెడ్డది గాదే. సారంగ. ౨. ౧౨౨.

౭. స్థైర్యము, నిశ్చలత్వము.

క. ప్రాయపువాఁ డంట నవ్వుక, శ్రీయుక్తిఁ దలిర్చుబిత్తరి స్వనె ఇంటు యా, హా యాతని యాత యను మె, వారియా వలిశంబా నెఱి దొఱంగక యుండదా. ప్రభా. ౪. ౪౯.

౮. పరాక్రమము, పౌరుషము.

క. నెఱి నుఱుకు వైరివీరుల, నెఱుఁకులు దూఱఁగ నేయున్నపపుంగవుఁ, పుఱకోర్వక... భార. ఆది. ౪. ౨౦౨.

గీ. అంత శౌర్యాశ్రయుఁ డైన యుక్తిపేటి, వీను నాకావావస్పృహానీవృతధామ, కాంతిఁ జూచి పోయెద నని పెట్టె పిట్టెనాఁడ నెఱి నూఫు మనసు విక్రమమున. రాఘవ. ౨. ౯౪.

క... నెఱి దప్పక పోరి యామినీచరులకున్. భా. రా. యు. ౨౦౯౪.

౯. సాహసము, తెగువ.

గీ. ఇవ్విధంబునఁ దనపోక లెఱుఁగనీక, మగని జోకొట్టి నెఱి వచ్చి సానువెట్టి, వాసలోఁ గూడు జారుల... శుక. ౩. ౧౭౩.

ఆ. పాణినాథ విభుఁడు మాంధనాథ్యుఁడు, ని న్నునన్నుఁ గన్న నెఱి వధించు. సుమా. ౫౪.

౧౦. విధము, రీతి.

క. అకట భవచ్చిత్తము నిర్వికార మై భరితధృతివివేకవినయశాంతిక మగుచు వెలింగెడు దీనికిఁ గారణ మెయనిష్ఠ నెఱి యెట్టిదియో. భార. శాం. ౪. ౪౩౯.

క. ఏ నిచ్చట నిద్రితస్నై, యీ నెఱి నుండంగఁబురుషుఁ డెవ్వఁడో యుపగూహనుభవంబున విక్రృతంగా నొనరించె నది కలయె కాదో యెఱుఁగక. హరి. ఉ. ౭. ౯౦, ౬. ౫౧.

౧౧. (=నెరి.) వక్రత, వంకర.

గీ. ఇంతికచములు నెఱి గలయింద్ర శిలలు. చంద్రా. ౬. ౧౭౯.

క. నెఱి మిగులఁ గలిగి నలు పైతేఱ చై మదనప్రతాపదావాగ్ని శిఖల్, మెఱయునవధూమమనఁగాఁ,దెఱవకుఁ గచభరము వచ్చె దేవుని కరుణన్. కాశీ. ౧. ౫౩. ద్వి.హరిశ్చ.పూ. ౧౨౨౬ పం.

౧౨. (పక్షియీఁకలు మొ.వాని) చిక్కు, మెలి.

సీ. అలఁతిఁ జీరినయీఁకల నెఱిఁ దీర్చు జక్కవలు చెందొవల కేఁకట యొసర్చ. భార. ఉద్యో. ౨. ౧౧౨. (కరాళప్రతి. పా.)

ద్వి. నీలాలకంబుల నెఱులు దీర్చుచును ద్వి హరిశ్చ. పూ. ౧౦౫౪ పం.

౧౩. పక్షము, వైపు.

ఉ... నేను నా,నేనయు దాడిపెట్టెద శిఖ్యంఖలతం బ్రతిపక్షు వెంట మీ,రీ నెఱికిన్ సహాయపడు టొప్పినత మేదిఁ గడంగుఁ డుక్కునన్, హరి. ఉ. ౩. ౯౯.

క. తా నిది గెలిచితి ననియెడు,నేను గెలిచియుండ నీతఁ డిది యేఁటికి మీ, రే నెఱికి నిజము సెప్పుఁడా,హా నొకరును బలుక రైరి నమితానను లై. హరి. ఉ. ౩. ౨౩౬.

౧౪. రెక్క, పక్షము.

క. ఎఱకలు విచ్చుచుఁ దుండము,దెఱచుచు ప్రేఁ గడరి సాగసి త్రెళ్లి వివశుఁడై,యీఱిచిన నోడకు మని హరి,నెఱి చక్కఁగఁ దోఁచి యెత్తె నయ్యంగఁ గృపన్. భార. ఉద్యో. ౩. ౩౦౧.

గీ. ఖఅవటుంఘులు నిలిచి నగ్గి గదలఁ గఱికి నెఱి నెఱికోలెమ్ముకయును పిఱుఁగ,; విఱిచి వడిఁ గైతు నొక పెద్ద వేసడంబు. మను చ. ౪. ౫౯.

౧౫. నిగ్గు, కాంతి.

గీ. నిగ్గు చిరుగడ్డ కుటిలంబు నెఱి యనఁదగు. ఆం. భా. ౩. ౬౧.

౧౬. వస్త్రపుకుచ్చె, పింజె.

సీ...కచ్ఛభేదాభిధాన మెసంగుఁ గాసె కుచ్చెల కుచ్చె కచ్చె పింజె,నుంగు రిఁగు నెఱిక చింగు నెఱి యనంగ...ఆం. భా. ౨ ౧౫౩.

సీ. నెఱి వెట్టి కట్టినయందు చెంగావిస్సైఁ గాంచికాఘటికల్ కళవళింప. పాంచా. ౨. ౧౪.

సీ. మెఱుఁగుదట్టముఁ గొంతకుచ్చు వగా నెఱి వట్టి సుక్కటిలాఁగుస గాలి సోఁక విసరి. జై. భా. ౨. ౯౯.

౧౭. చిరుగడ్డ. ఆం. భా. ౩. ౬౧.

౧౮. వెండ్రుక, కేశము; మెలివెండ్రుకలు; అలకలు, ముంగురులు. (ఈయర్థమున తఱచుగా బహువచనమునందే ప్రయోగములు కన్పట్టుచున్నవి.)

సీ. వికటపాటలజటామకుటికాభారంబు కఱకైనజుంజురునెఱులు గాఁగ. హర. ౭.౪౧.

మ. చిగురుంజిమ్మనకోవిలో నొక తె రాజీవాసవంబుంచి పై, నిగిడింపన్ గమకింప నొక్కనవలా నెమ్మోము పేఁ ద్రిప్పినన్,జగజంపై నెఱి గుంపు గప్పుకొనియెన్...వసు. ౩. ౧౫౯.

సీ...వెండ్రుక నెఱి నెఱుక నాఁగఁ దనరుఁ గేశము...ఆం. భా. ౨. ౧౪౫.

సీ. నెఱులనున్ననికప్పు దుఱుఁగలిగొనఁ గొండి

పొదలు వొండ్రుకలు కొప్పునకు సొయిన. హరి. పూ. ౬. ౧౪౩.

సీ. నెఱివేణిఁ గూడనినెఱులు నెన్నుదుటిపైఁ గమ్మకస్తురితిలకమున నెఱయ. దశా. ౬. ౧౫.

౧౯. శక్తి, సామర్థ్యము.

సీ...నెఱి గల్గి పలుకక యుండఁగఁ దగుటయూహించుటుత్తమవిధంబు. భార. ఆశ్ర. ౧. ౪౩.

చ...వినవె నను నంగదు సర్వగర్వముల్, నెఱి నెడ నాల్గువారిధుల ని న్నటు ముంచినవాలి పుత్త్రుఁడన్. భా. రా. యు. ౫౦౪.

చ...ద్వారపాలురన్, నెఱి చెడ మట్టికొంచుఁ జొర... ప్రభా. ౧. ౭౧.

విశే. ౧. (=నెరి.) కుటిలము, వంకరయైనది.

చ. నెఱికురులున్ విలోలసితనేత్రయుగంబును నొప్ప... భార. ఆది. ౪. ౪౩.

మ. నెఱు లై యొప్పు నీలకేశములు సున్నిద్రాననాబ్జంబునే, డ్తెఱ నూత్నాంబుదతుల్యకాంతియును నై... హరి. పూ. ౫. ౧౧౯.

౨. చక్కనిది, సుందరము.

వ...నెఱితుఱుమునం జెంగలువలు తురిమె... నైష. ౬. ౪౪.

చ...భోజనందనయు...అక్వీరిం, దననెఱిగొప్పునం జెరివినన్...పారి. ౧. ౫౫.

౩. న్యాయ్యము, యుక్తము.

ద్వి. నీకు నిచ్చినయట్టినృగుఁడు దా నుండ, నీకు నాకును నేల నెఱి గానివాదు. రం. రా. ఉ. ౧౨౪ పొ. ౭ పం.

౪. శౌర్యముకలది.

క. ముక్కంటివరమునను మన, కెక్కుడు భయమావహింప హేతు వవధ్యం, డెక్కుడుఁడు పగతుఁడద్దెస, నెక్కొని సిద్ధింప వెట్టినెఱికర్జములన్. హరి. ఉ. ౨. ౧౭౧.

౫. వాఁడియైనది, తీక్ష్ణము.

చ...మొగంబున లేఁజెమ రంకురింప జం, కెన నెఱిచూపు చూచి పలికెం జలితాధరపల్లవాగ్రయై. పారి. ౧. ౧౨౪.

ద్వి. నెట్టన మొలనున్న నెఱికత్తిఁ దివిచి. ద్వి. హరిశ్చ. పూ. ౨౦౫౬ పం.

క్రి. విశే. ప్ర. ౧. పూర్ణముగా, నిండుగా.

క...గూఢమతి నుండుద మిం, దఱుముఁ బరోచనకృతకము, నెఱి నేర్పుమనంతకును వినీతాత్ముల మై. భార. ఆది. ౬. ౧౫౪.

క. కఱకంఠా క్షమియింపుము, నెఱినెవ్వరికెఱుఁగ గగున నీచరితంబుల్. భార. అర. ౧. ౩౨౪.

చ.. పురుషోత్తముఁ డింత యొప్పఁ బలుక్కనె మఱుమాట లాడ నయకోవిదుఁ డెవ్వఁడు ధీరుఁ డెవ్వఁ డిం, దనుపరి యెవ్వఁ డంచు నచలాకృతు లై నెఱి నూరకుండఁగన్. భార. ఉద్యో. ౩. ౨౭౫. అను. ౫. ౧౯.

౨. గట్టిగా, దృఢముగా.

వ...నెఱిఁ జఱచియు నేలపా లొనర్చియు... వీర. ౪. ౧౦౪.

౩. మిక్కిలి, అత్యంతము.

సీ...నెట్టన యెంతేని నెఱిఁ, గరంబు, చలివార కేడ్తెఱ...అత్యంతముగ సనుటు కాఖ్య లయ్యె ఆం. శే. ౫౪.

సీ. నెఱి జీవనము లేక నింగిపై భ్రమియించు మత్స్యంబు దనుమ చేమాటవాని. నరస. ౯. ౧౪౨. (ఇట 'ఎంతమాత్రము' అనిభావము.)

౪. చక్కఁగా, లెస్సగా.

ఉ...నీవు కంటికిన్, చెప్పయుంబోలె మాటయి నెఱిం జను లారసి యొజ్జవాడ్పునం, జెప్పుచు... భార. ఉద్యో. ౪. ౧౧౪.

క. అవయవము లెట్లు కూర్మము, నివిడించును లోని కడఁచు నెఱి నటుల భూ, తవితతి భూతాత్ముఁడును, బ్రవర్తననివర్తనముల పొల్చడఁ జేయున్. భార. శాం. ౫. ౧౩౨.

౫. నిజముగా, వాస్తవముగా.

సీ. నెఱిఁ గట్టి దని యింతి నీ నెమ్మనం బెన్ని భంగుల నరసినఁ బట్టుపడదు. భార. విరా. ౨. ౪౭.

నెఱీఁబడు. అ. క్రి. (నెఱిఁ + పడు.) ౧. యథాస్థితికి వచ్చు, కుదురుపడు.

చ. నెఱిఁబడి యాజి నీ పెనఁకలు నేరవు గూడి తగం జరింప నిం, దఱమన సాక్షి యై చనక తప్పదె గదా... భార. ఉద్యో. ౪. ౧౪౩.

క. వెలికితి నలఁగులు మేనులు, నెఱిఁబడ నెల్లెడలఁ గలయ నివిరితి హరులి, త్తఱి నీళులు ద్రావక తెప్పిలవు... భార. ద్రో. ౩. ౧౫౦.

౨. సిద్ధించు, నెఱవేఱు.

క. కానియటు లుండి నెఱిఁబడు, నైన తెఱఁగుఁ దోఁచి మాయ మగు నిబ్భంగిన్, మానసమున నుబ్బు వగయుఁ, దే నొప్పం బనులు బుధుఁడు డేలఁడు రెంటన్. భార. శాం. ౩. ౨౯.

నెఱి(రి)క. వి. (త. నెరి. క. నెఱి.) ౧. వస్త్రపు కుచ్చెల, పింజె.

సీ. బంగారుసరిగలపట్టంచువలిపంపునెఱిక మీఁగాళ్లపై నెఱసి యాడ. సురా. ౩౪.

తే. నెఱికఁగాఁ జుట్టి దండెముమీఁద వైచిన యంగదట్టము వైచినట్లు యుండె. కుచేల. ౫. ౩౭.

క. బురుసా కాసెరువారపు, నెరికలు కొనగోరఁ దీర్చి నీలాంబుదభా, సురచంచల యనఁ దన రుచుఁ, దెరలోనన్ నర్తవాదిదేవతలీలన్. ప్రబంధ. ౧౦౩. ఆం. భా. ౨. ౧౫౩.

౨. పైఁటపావడ; గాగరా, తాబందు.

సీ. అచ్చవెన్నెలచాయ నవఘళింపఁగఁ జాలు నిద్దంపువెలిపట్టునెఱిక గట్టి. హైమ. ౬. ౨౨.

సీ. నిండుచందురుకావినెఱికచే రంగారుకడఁక పన్నబంగారుకాసె యొసఁగ. వాల్మీ. ౩. ౧౩.

గీ. విలువ యిడరానిచెంగావిచెలువు నెఱిక, నాభి విభకఁబు పొన్నక్రొన్ననలు నెఁప. రా. వి. ౩. ౧౨౪.

౩. చల్లడము; స్త్రీలు తొడఁ గుఱుచ తొడలాగు.

చ. నెఱికొను గాలి కల్వ దొరఁగింపఁగ జేలపు టంతిలోఁ దాఁడల్, నెఱికను వాలెఁ గెంపు గమి నిద్దపు గ్రొమ్మెలనూలిడా ల్గనెన్. అచ్చ. భా. ౩. ౧౦.

శ్లో. యుతక మివాఽతరీయా మూర్వోః. సం. కిరా. ౭. ౧౪.

జ: నెఱికగట్టు, నెఱికపట్టు.

నెఱికగట్టు. స. క్రి. (నెఱిక + కట్టు.) ౧. కుచ్చెళ్లు పోసి కట్టు.

సీ. అంచవన్నియతోడ నంద మైనకుడుంగుని ద్దంపుఁబుట్టంబు నెఱికగట్టి. కాశీ. ౩. ౭౧౨.

సీ. గొనబుగా నెఱికగట్టినక్రొత్తచెంగావిచేలపయ్యెదకొంగు తూలి యాడ. రాజ. చ. ౨. ౧౫౯.

సీ. అభిషేకవిధియోగ్య మగుమడుఁగొల్లియ నిర్మలాభిలముగా నెఱికగట్టి. హర. ౪. ౭౯.

నెఱికపట్టు. అ. క్రి. (నెఱిక + పట్టు.) కుచ్చెళ్లు పోయు, కుచ్చెళ్లు పెట్టు.

సీ. నెఱికపట్టి పసిండినీటిప్రాఁతచెఱఁగువెలిపట్టు ఉపోఁ గట్టె కెలఁది యొత్తు. ఆము. ౬. ౧౨౯.

నెఱికొలుపు(ల్పు). స. క్రి. (నెఱి + కొలుపు.) చక్కఁగాఁ దాల్చు, ధరించు.

(దేవదేవి.) ఉ. ... విభూషణసముత్కరమున్ ధరియించి హారముల్, గొప్పచనుంగవందు నెఱికొల్పి తనర్చె విలాసవైఖరిన్. విప్ర. ౩. ౭౯.

నెఱిడె. వి. పశురోగవిశేషము.

క. నెఱిడెలు పుట్టినపసరము, నెఱి విఱిగియు

మోఁత యుడిగి...అరయఁగ లేకున్న యురము నడ్డము బెరుఁగన్. (చికి. ౮. ౩)

నెఱిపట్టు. వి. పట్టువస్త్రవిశేషము.

ద్వి. నెఱిపట్టు జిలిపట్టు నేత్రంబుపట్టు. బస. పు. ౩. ౫౬ పం.

నెఱియ (ఱె)=నెఱ్ఱె. వి. ౧. (భూమ్యాదుల బీఁటు, పగులు; వివరము. కన్నము.

క. మండెడుమార్తాండద్యుతి, నెండుచు నొండొండ నెఱియ లేర్పడఁగా భూమండలము పూర్వమున నవఖండము లయ్యెనన ననేకఖండము లయ్యెన్. ద్వా. ౯. ౯.

ద్వి. ధరఁ దాఁకి పడిన నెత్తుఁగ రాక ప్రాలు, నెఱియలపాలైనఁ బుగ్గహార నీకుఁ గర...రి నర్పింపఁగా నేఁగుదెంచి. బస. పు. ౪. ౯౦౨ పం. ('నెరియలు' అని ముద్రి.)

చ. సవిత్రుమయూఖముల్ నెఱెలసందులఁదూఱుట యొప్పె... చంద్ర. ౧. ౧౫౪.

౨. చీలిక, పాయ.

మ. స్వనిదానోగ్రనిదాఘవైఖరిని యూష్మన్మల్లికల్ కామినీకచదానీలకచాగ్రపంక్తి నెఱియల్ గాఁ బాపఁగా...ఆము. ౨. ౬౪.

జ : నెఱియలువాఱు, నెఱెవెట్టు.

నెఱియలు (ఱె)వాఱు అ. క్రి. (నెఱియలు + పాఱు.) బీఁటలువాఱు, పగులు.

వ...ఏఁదుపెను మండ్ల బండ్లఁ రిరాలు నెఱియలువాఱి ..మనుచ. ౪. ౬౦.

శా...మందరాద్రి నెఱెవాఱఁగ వీఁకమై నెత్తియ, య్యంభోజాతుఁడు పట్టి వైచె...పీర. ౩. ౨౦౬.

నెఱెవెట్టు. అ. క్రి. (నెఱె + పెట్టు.) తొలుచు, రంధ్రముచేయు.

సీ. సెలవుల వనదంశములు మూఁగి నెఱెవెట్టు ...మనుచ. ౨. ౪.

నెఱ్ఱె=నెఱియ. వి. వివరము, కన్నము.

వ...కిటిఘటా...చూచి కినిసి...నెఱ్ఱెలు ...పాఱుపాపు... కాశీ. ౪. ౧౬౨.

నెల[1]. వి. (త. నిలా.) ౧. చంద్రుఁడు.

క. నెల లెన్నియుఁ గడఁగ నన్నెలఁతకు జనియించె నెల పున్నమకన్, నెలకొని యుదయించె నెలమిఁ గొడుకు నెలకు వలమేచ్చాకరుఁడై. హరి. పూ. ౫. ౧౦౭.

సీ. వృష నెద్దుఁ గొని గాడ్పు వృషము బండఁగఁ జేసి యెలయించి నెలలోఁ యుక్తి నేయు. కు. సం. ౪. ౩౭౯.

క. నెల వొడిచెం జుక్కలు వలు, సలి వడిచెన్ ...రంగా. ౩. ౧౭౪. హర. ౨. ౧౬.

౨. వెన్నెల. (చూ. నెలత్రావుడు.)

౩. మాసము, చంద్రగతివలన నేర్పడుకాలమానము. (దీని బహువచనరూపము 'నెల్లు' అనికూడ కాన్పించుచున్నది.)

సీ. కంద్రి కథించి యొంకయు కల్కమై వీని నం కిట నెల సయించువాఁడ. భార. ఉద్యో. ౩. ౭౯౧.

క. నెలనెల తప్పనియుఁడఁగ, నెల భాస్కరుఁ జొచ్చు టెల్ల నియమముతోడన్, గలహంస పేఁడి వెన్నెల, సొలయక సాయంగకములు మూఁడు బకఁ జుమీ. నైష. ౨. ౩౩.

సీ. ఏఁటేఁట నొసరింపు మితరదేశవిహార మాఱు నెలలు రాజ్య మాఱునెలలు. విక్ర. ౪. ౪౬.

క. వెన్నెల్లలోన నాకుం జెన్నొంద నధీన గాఁగఁ జేయుఁడు... భా. రా. సుం. ౭౦౪.

చ. నడలు దడఁబడం దొణఁగె నాటికిఁ దొమ్మిది నెల్లు నిండఁగన్. యయా. ౫. ౩౭. ఆం. భా. ౩. ౫౫.

౪. పూర్ణిమ, పున్నమ.

సీ. నెలచందురునికాంతి నెమ్మోము వ్యాపించి యకలంకవిలసనం బలవరించి. షోడ. ౬. ౩౦.

౫. కర్పూరము. (సంస్కృతమున చంద్రవాచకశబ్దము లన్నిటికిని కర్పూరము అను నర్థము కలదు. చూ. నెలవత్తి.)

౬. స్త్రీశిరోభూషావిశేషము. (శ. ర.)

౭. ఋతుకాలము, గర్భధారణమునకు యోగ్యమగుకాలము.

చ... మగఁడు గర్హియు లేనివిధంబు చేసి తా, నెలఁ గలదైన నన్నుఁ గరుణింపఁడు భోగమువారిపొందునన్. శుక. ౨. ౧౧౨.

జ: నెలకట్టియ, నెలకూన, నెలచట్టు, నెలతాలుపు, నెలత్రావడము, నెలదారి, నెలదిండి, నెలపట్టి, నెలపాలు, నెలపురుడు, నెలపులుఁగు మొ.

నెల² = నెలవు. (క. నెలె. √నెలయు.) స్థానము, ఉనికిపట్టు.

క. అని పలుకుకలశభవముఖ, మునిజనముల ప్రశ్నవాక్యములు విని పురభి, త్తనయుఁడు తత్త్రివిధము నొక్క నెలం గుమిగూడి యునికిఁ గనఁజాలమికిన్. పాండు. ౧. ౧౫౩.

నెలఁత = నెలఁతుక. వి. ౧. స్త్రీ, ఆఁడుది.

క. ఈనెలఁతఁ గన్న మన్మథుఁడైనఁ జిగురుగొడుగుఁ బువ్వుటమ్ముఁ బొదులున్, లోనుగ నెజలు సేయం, దా నియమింపఁడె రహాజ్ఞాపము పేర్మిన్. భార. విరా. ౨. ౨౭.

ఉ... ఆరయఁ గశ్యపునాంద్రు దైత్యులన్. గన్న నెలంత వేలుపులఁ గన్న నెలంతయుఁ దత్పుత్రవ్రజంబున్న తెఱంగు వారలసహోదరతా త్రిజగం బెఱుంగదే. ఉ. రా. ౨. ౨౨౯.

ద్వి. నెలఁత నీ వెవ్వరు నీ వేల యింత, పలుఁగాద విశ్వానసములోన (?) నిలిచి. రం. రా. అర. ౧౭౭ పు. ౧౯ పం.

౨. ప్రియురాలు, భార్య.

గీ. పఁటిమిద్దెలవారికి మరుపసులకొ, నెలఁత వాసినవారికి నెదురు చెడియె. ఆము. ౪. ౧౨౩.

మ. శతపత్రేక్షణలు గారవింపఁగ నెలంతల్ నిండుకౌఁగిళ్ళ సంతసముగా నుండియు నప్పురూరవునిసౌందర్యంబు భావించుచు ...కవిరా. ౧. ౯౬.

జ: నెలఁతుక.

నెలఁతుక = నెలఁత. వి. (నెలఁత + ఉక-స్వార్థము.) ౧. స్త్రీ, ఆఁడుది.

సీ. గంధర్వ లేవురు గల రని చెప్ప నన్నెలఁతుకమాటలు నిక్కు లౌకొ (?). భార. విరా. ౨. ౨౯౫.

గీ. కన్నుఁగవ నశ్రుధారలు గ్రమ్మకొనఁగ, నన్నెలఁతుక దీనయై యడలుచున్న. ఉ. రా. ౬. ౨౯౩.

౨. ప్రియురాలు, భార్య.

క. ఈమాడ్కిఁ జూడ నను న, త్కామినిఁ గడుఁ దిరిగి తిరిగి కనుఁగొనెదు నీ, వేమి యిది నాకుఁ జెప్పుమా, నీమది యని యతని సతి నెలఁతుక పలికెన్. కళా. ౩. ౧౭౪.

నెలకట్టియ (ట్టె). వి. (నెల¹ + కట్టియ.) అర్ధచంద్రాకారముగ నున్న బాణము.

(యతుగాతుపదానవగణములు.) వ... బల్లెములు బల్లెముల తెఱంవ నమర్చియుఁ జెమర్చియు నెలకట్టియలు నెలకట్టియలపై నిలిపియుఁ దెలిపియు... నారాయణుం డాక్రో... ఉ. హరి. ౬. ౫౦.

నెలకట్టు. వి. ((క. నెలెగట్టు) నెల² + కట్టు.) శిలారత్నాదినిబద్ధభూమి, కుట్టిమము.

సీ. ...డాగులనునుఁగాంతి నయ్యెడ పద్మరాగంబుల నెలకట్టుకరణి నొప్పు. భార. విరా. ౪. ౨౬.

ద్వి. నెలకట్టు కట్టించి నిమిషమాత్రమున,వరర
త్నఖచితసువర్ణాలయంబు,విరచించి...బస.
పు. ౬. ౬౪౮ పం.

గీ. క్రేష్ఠు దాఁటెడుచూపులు క్రింద నింపఁ
గ్రమ్మి నీలాలనెలకట్టుకరణి మెఱయ. రాజ.
చ. ౩. ౧౪౧.

నెలకువ. వి. (త. నిలై. √నెలకొను) స్థానము,
ప్రదేశము.

క. వినను రావణుఁ డఁట రిపుఁ, డా నెలకువఁ
జొచ్చి పొదవితఁట పోరను నీ, చే నెత్తురు
గాకుండఁగ, వానిం జంపితఁట తగదె వర్ణన
సేయన్. నిర్వ. ౨. ౧౧.

నెలకూన. వి. (నెల[1] + కూన,) ౧. బాలచంద్రుఁడు.

సీ. చెలు వైనకళ లీనఁగలచిన్ని నెలకూన పృథు
లవజ్రపుసరిపేషు గాఁగ. మృ. వి. ౩. ౨౦.

గీ. ఏది మినుజాలు కనువాలు సిబ్బికేలు, నేది
తోల్చిర మెడచార యొకుకళోర, యేది
నెలకూన సామేన నిడినచాన, యితఁడు జేజే
లదొర యని యెటుల నందు. చెన్న. ౩. ౫౨.

౨- అర్ధచంద్రాకృతిగ నుండునది- నఖక్షతము,
నెలవంక.

సీ. నెలఁతగు త్తపుగుబ్బ నెత్తమ్మి మొగ్గల నెల
కూనసోఁకులు నిగుడకుండ. వసు. ౬. ౯౧.

గీ. తళుకు నెలకూన లునుపక తనివితీరఁ, గౌఁగి
లింపక...చంద్ర. ౫. ౭౫.

నెలకొను=నెలవుకొను, నెక్కొను. అ. క్రి. (త.
నెలెగూళ్. నెల[2] + కొను.) ౧. పాదుకొను,
కుదురుపడు.

క. కలగొన రాజసతామసము లయినభావములు
వికృతిఁ బొందింపఁగ మర్త్యుల కేకాంతిక
వృత్తిని, నెలకొనఁగా నెట్లు వచ్చు నిర్గలధి
షణా. భార. శాం. ౬. ౫౦౪.

ద్వి. నెలకొని యిటమీఁదనీవునీసుతుఁడు, నిల
యెల్లఁ గైకొని యిట్లు భోగింపుఁడు,...
పం. రా. అయో. ౧౨౩ పొ. ౨౪ పం.

క. నెలకొన్నభక్తి సద్గురు,కులమాడ్కిఁ గన్నమగు
నఘోరశివాచార్యుల దివ్యపాదపద్మంబుల
కు నమస్కృతి ఘటించి పూతాత్ముల మై.
వరాహ. ౧. ౧౯. విక్ర. ౫. ౧౭౨.

౨. నిలుచుండు; ఉండు.

గీ. నేయపున నిట్టు లద్దులు నేయపడ్చి, రామకృ
ష్ణుమ లోకటు శ్రీరామముఖ్యులోకటు నెల
కొని తమతమయురుబలంబు, నెలయ లంఘిం
చుచుండిరి వేశ్యామిణి. దశా. ౯. ౧౧.

సీ. వింగడాబ్బెట్టిముంగిట నెలకొన్నబృందా
వనికి ముగ్గు పెట్టుఁ దాన. ఆము. ౪. ౫౦.

క. ఫలములుగోరక కర్మం,బులు నడపుచు వాని వి
మలబోధాగ్నిహుతిం,బొలియించుచు నిర్ద్వం
ద్వత,నెలకొను నేకాంతిజనులు వినుఁ గంద్రు
హరి. భార. శాం. ౪. ౨౩౯. ఉ. రా.
౫. ౨౪౮.

౩. కలుగు, సంభవించు.

ఆ. తలఁపునకుఁ బ్రియంబు దనబుద్ధి నెలకొన,
నాక్షణంబ పంకజాక్షుపాలి, కరుగుదెంచి
వినయ మలరార నిట్లని, దివిజశిల్పి పలికెఁ
దివ్య మెసఁగ. హరి. ఉ. ౨. ౧౫౪.

క. చెలఁగరు కలఁగరు సాధులు, మిళితము లయి
పరులవలన మేలుం గీడున్, నెలకొనిన నైన
నాత్మను, నొలయవు సుఖదుఃఖచయము లను
గ్రము లగుచున్. భాగ. ౧౦. ౮౭౪. పాండు.
౨. ౩౪.

౩. కడఁగు, యత్నించు. (ఈ యర్థమున నిది కొ
న్నిపట్ల పాదపూరకముగా కానవచ్చుచున్నది.)

క. ఆరీతి మహోపాయము, నేరిచినన్ జారుఁ
గవయ నెలకొను మన స్వారార జగజంత

యని తెలవాఱుటఁ గని భామ కేళివసతికిఁ జనియెన్. హంస. ౩. ౨౮౩.

చ. నెలకొని కృష్ణరాయధరణీభుజుఁ డుత్కల భూమిపాలుతోఁ, గలన నెసెర్చి...పారి పీఠి. ౨.౨.

ద్వి. నెలకొని తొమ్మిదినిధులును ధనదు,నలకాపురై నందనవనములోపలికిఁ, గ్రమ్మఁ గొనిపోవ...రం. రా. ఉ. ౩౪ పా. ౧౩ పం.

నెలకొలుపు(ల్పు)=నెకొల్పు. నెలవుకొలుపు. స. క్రి. (√ నెలకొను.)

(పాదుకొల్పు, నిలుపు.)

వ...భావంబున భూతనాథు నెలకొలిపి యక్కుంభభవసంభవుండు...భార. సౌ. ౧. ౧౧౦.

(పెట్టు, ఉంచు.)

చ...చుక్కలదొర యెండవాడి విని గ్రక్కునఁ దాను గాంతి వీథులోఁ,బల నెలకొల్పె నాఁబలుకఁ బాఱె నిశాంతనిశాంతదీపికల్. పారి ౨.౧౬.

నెలగ. వి. ధనము.

క. కలిమికిని దగినకొలఁదిని,నెలగల వెలి విడువకున్న నిలు పెక్కుడి దొంగలయగ నిండినచెలువున, కలఁగించుఁ గ విడువకున్న నాఁ గనిభంగిన్. ద్వా. ౨. ౧౫౪.

నెలచట్టు. వి. (నెల¹ + చట్టు.) చంద్రకాంతమణి.

రగడ. నెలచట్టుగెంపయ్యె నీపాదములకక్కఁ. ఉ. రా. ౬. ౬౧.

సీ. చిలుకునీరు దొలంకఁ దెలివొందు నెలచట్టు పట్టెరంబులప్రోల జంతిసాఁగి. చంద్రి. ౪. ౯౯.

ద్వి. నెలచట్టుకోటల నిద్దంపుఁ జాబుల, నలరారు నగరంబునందుఁ జూపట్టు. ద్వి. పరమ. ౩. ౧౪౬ పా.

నెలతాలుపు(ల్పు). వి. (నెల¹ + తాలుపు.) చంద్రశేఖరుఁడు, శివుఁడు.

క. అయ్యానసద్యశుణావని, యయ్యానమంత్రిమణి నరసమాంబ వివాహం,బయ్యె నహార్యకుమారిని,నెయ్యంబునఁ బెండ్లి యైన నెలతాల్పు దయిన్. ఉ. రా. ౧. ౩౩.

సీ. నెలతాల్పు దేవర యలిగినఁ బని గాదు వెండిగుబ్బలి దేక యుండనింక. యయా. ౩. ౩౪, ౪. ౫౪.

నెలత్రావడము. వి. (నెల¹ + త్రావడము) చకోరపక్షి, వెన్నెలపులుఁగు.

సీ. తరుణి మాపులు నెలత్రావడంబులఁ బ్రోచు నివురుచాయల వెన్న నింతి మోవి. హం. స. ౪. ౪౩.

నెలదారి. వి. (నెల¹ + దారి.) చంద్రశేఖరుఁడు, ఈశ్వరుడు.

క. బంగారువిండె లివి యయ, పొంగుచు ముక్కంటివీటఁ బొలుచుచు రతనం,పుంగడవలు గడువేడ్క నొసంగిన నెలదారిచెంతఁ జక్కఁగ నిలుచున్. రామే. ౨. ౯౧.

సీ. అమరేంద్ర నీ వంప ననుకంప జనియింపఁ బొలదిండి నెలదారి పురముఁ జేరె. దశా. ౨. ౯౪. (ఇట శ్లేషవాచకము.)

నెలదిండి. వి. (నెల¹ + తిండి.) విధుంతుదుఁడు, రాహువు.

క. అగిసెవిరుల్ కరుకలిచే, నెయ్యందొడేటి చాల్పు లేఁగున్ దలఁచె,తొగరాచపసువులన్ వెస,నగుచు నెలదిండిపిండు దార్కొనుపగిదిన్. యయా. ౪. ౧౧.

గీ. తొలుత మ్రింగినకొఱనెల వెన్నెలపులందుఁ, గడఁగి వెదకించు నెలదిండి గాములనఁగఁ, గొమ్ముఁబందులు వెడలె ఘుర్ఘురము లడరఁ, బొదలలో నుండి...యయా. ౨. ౯.

నెలపట్టి. వి.(నెల¹+పట్టి.) సౌమ్యుఁడు,బుధుఁడు.

క. నెలపట్టి యిటుల నలరఁగ, నిలయై యొకనెలయు మరల నిలుఁ డై నెలయున్, మెలఁగుచుఁ గ్రమమునఁ దొమ్మిది, నెలలు సఁ బురూరవుఁ గనియె నది యంతన్. హ. రా. ౭. ౪౯౨.

ఇశ్లే: నెలచూలి మొ.

నెలపాలు=నెలవీసము. వి.(నెల¹+పాలు.) చంద్రకళ. (శ. ర.)

నెలపురుడు. వి. (√నెల¹.) మగశిశువు పుట్టినది మొద లొక నెలవఱకును స్త్రీశిశువు పుట్టినది మొదలు నలువదిదివసములవఱకును తల్లికి ఉండు జాతాశౌచము.

(వ్యవ.) ఆమె యింకను నెలపురిటిలోనే యున్నది.

నెలపులుఁగు(గ్గు) వి. (నెల¹+పులుఁగు.) చకోరపక్షి.

సీ. చనుజక్కవలకు మెప్పొన కిడ్డబిసఖండముల లీల హారముల్ మూర్ధ గులుకఁగఁ గనుఁదోయి నెలపుల్గుఁగవ కుంచుతళుకువెన్నెలవీఁకఁ గప్పురంపుఁదిలక మమర. చంద్రా. ౩. ౯౨.

నెలపొడుపు. వి. (నెల¹+పొడుపు.) చంద్రోదయము.

చ. లలితము లైనయాపరిఖలం దగుమేడల వారభామినుల్, నెలపొడుపు ల్గనుంగొనుచు నిల్చునొయారము చూచి...కవి. ౧. ౧౧.

నెలబాల. వి.(నెల¹+బాల.) ఋతుమతి.(చి.ని.)

నెలమసలు. అ. క్రి. (నెల¹+మసలు.) నెల దప్పు, గర్భోత్పత్తియగు; గర్భవతియగు.

క. హారివనమాలికయంశము, ధరణీపల నవతరింపఁ దలఁచిన దైయు,ప్పారి నొక్కవిప్రకాంతయు,దరముఁ బ్రవేశింప నతికిఁ దగ నెలమసలెన్. విప్ర. ౧. ౭౧.

క...ఛత్రప్రయాణ కాలంబున నీ,కుల కాంతాతిలకం బీ,యలికచ నెలమసలియుండు టది యెఱుఁగ వొకో. శుక. ౧. ౧౪౦.

నెలమేపరి. వి. (√నెల¹.) రాహువు, విధుంతుదుఁడు. (శ. ర.)

నెలమొలక(లు). వి. (నెల¹+మొలక.) బాలచంద్రుఁడు, నెలకూన.

సీ. తనతలనెలమొల్క తళతళ జిగి గుల్కవలయుముత్తెపుతురాయిగుత్తు గాఁగ. ఇందు. ౧. ౭.

నెలయల్లుఁడు. వి. (నెల¹+అల్లుఁడు.) మన్మథుఁడు.

గీ...నెలయల్లుఁడు వెడవిలుతుఁడు,నాఁగ మరునాఖ్య లగు...ఆం. భా. ౧. ౪౫.

నెలయు. అ. క్రి. (క. నెలసు.) ఉండు.

సీ. పరితాపవేదనాపరవశంబునఁ దూలి నెలవిన చిత్తంబు నెలవుకొనఁగ. కు. సం. ౫. ౨౩౪.

జః నెక్కొను, నెక్కొల్పు, నెక్కొలు, నెల², నెలకట్టు, నెలకువ, నెలకొను, నెలకొలుపు, నెలవరి, నెలవీడు, నెలవు, నెలవుకొను, నెలవుకొలుపు, నెలవుపడు, నెలవుపఱుచు, నెలవొందు.

నెలయూటి. వి. (నెల¹+ఊటి.) అడవిలో నుండెడిఒకజాతిఫలవృక్షము, ఒకజాతిఊటిచెట్టు.

సీ. నేరేడుపండులు నెలయూటిపండులుఁ గొంగమామిడిపండ్లు దొండపండ్లు. కాశీ. ౩. ౯౫.

నెలరేక. వి. (నెల¹+రేక.) చంద్రరేఖ.

సీ. నెలరేకనుదుటిపై నీలైనకమ్మకస్తూరిగీర్నామంబు సొరు మీఱ. ఇందు. ౧. ౨౦.

నెలఱాయి. వి. బొ. (నెల¹+ఱాయి.) చంద్రకాంతశిల, చలువఱాయి.

టం, జెలంగుచుండిరి రాజశేఖర యంత. అ. మ. క. ౧. ౪౯ పా. ౧౧ పం. శుక. ౧. ౧౬౭.

నెలవీడు. వి. (నెల² + వీడు.) ఉనికిపట్టగుపురము.

చ. తలఁపులతిట్టు భాసమానతానక మానలప్రట్టి నిల్లు గోత్రుల నెలవీడు వల్లాలకాటము ...కు. సం. ౫. ౫౯౪.

నెలపీసము = నెలపాలు. వి. (నెల¹ + పీసము.) చంద్రకళ. (శ. ర.)

నెలవు. వి. (√నెలయు. సం. నిలయః. ప్రా. నిలఓ. త. నిలై. క. నెలె. మ. నిలా.) ౧. ఉనికి, స్థితి.

క. కొలువున నెలవు వహించిన, నలువను సాష్టాంగ మెరఁగి...విక్ర. ౨. ౨౯.

సీ. అనువాసీయనహంకారగరిమను నివధాచలము మీఁది నెలవు సాక్షి. హర. ౪. ౨౨.

౨. వాసస్థానము, ఉనికిపట్టు.

గీ. చలువనెల వైనమత్యాలచవికలోన. హర. ౪. ౪౯.

క. ఎయ్యది కుల మెయ్యది నెల, వెయ్యది నీనామధేయ మిచ్చోటికి రా, నెయ్యది ప్రస్తుతమనినం, దొయ్యలి యాబ్రహ్మచారితో నిట్లనియెన్. వైజ. ౨. ౫౯.

౩. స్థానము, చోటు.

క. జీవుఁడు శుక్రచ్ఛాయా, భావితుఁడైనపుడు విష్ణు భావించుటకుం, దావేసరి యగుఁ బెద్దత, భావ మొసఁగు గుణము లేనిపండగు నెలవున్. భార. శాం. ౫. ౪౨౧.

క. ఎయ్యది నీ వుండెడు నెలవు ..విక్ర. ౨. ౨౪౪.

గీ. నాభికందంబు క్రిందటు నలిననంధి, కుండలీశక్తి దేవత యుండు నెలవు. కాశీ. ౨. ౨౨౫. ఆం. భా. ౨. ౧౩.

౪. భాగము, ప్రదేశము.

గీ. నేమి విఁకినకతన నన్నేల నెలవు, నేమికెం జర్యె నడియు తా నైమిశంబు. కాశీ. ౧. ౭౭.

౫ = నెళవు. పరిచయము, స్నేహము.

చ. నెలవున రాగసంపద వనీనను చాయపికాక వంబునన్, దెలిసి ఘనతురాక సుపనీకను హాళ్ళికఁ బాన మూర్చి...పంచ్రి. ౪. ౮౨.

౬. పట్టు, ఊఁత.

ఆ. నీకుఁ జూడ ముష్టి నెలవు సాక్ష్యంబు, గాఢత యును బాణ తియఁ దొడఁజీ, యట్లొ యొండు భంగి యై తోఁచె నో బాకు, నన్న రూపు సెప్పవన్న పార్థ. భార. ద్రో. ౩. ౧౯౯.

శ్లో. కచ్చిద్రాఁడీపజః ప్రాణస్తథైవ భరతర్షభ, ముష్టిశ్చ తే యథాపూర్వం భుజయోశ్చ బలం తవ, న వా కచ్చిదయం కాలః...సం. భార. ద్రో. ౧౦౩. ౪.

౭. నెలవు, వ్యాపనము.

సీ. అవని యెల్లను దాన యైనది యనఁ దనపేడ నొప్పారెడు నెలవు కలిగి. గీ. తనయనొక్క మహావటుతరువుఁ గాంచి. హరి. ఉ. ౧. ౩౩.

విశ. (త. నిలవు.) ౧. నలువు, సుందరము.

గీ. ఫాలమునఁ గుంతలంబు లేర్పఱచినపుడు, నెలవుగాఁ దోఁచె గిరికన్యనెమ్మొగంబు. హర. ౪. ౯౨.

౨. పరిచితము, అలవాటైనది.

చ. నెల వగువాయువేగి బలు నేర్పరి గద్దరి యుక్కుగుండు ... తుపాకి సాఁగఁ జే, ర్లలరెడి సారమేయముల నత్తటిఁ దెచ్చిరి కొంత అుదతికిన్. ఇందు. ౨. ౫౯.

నెలవేదు = స్థానభ్రష్టమగు.

మ. కలగుండై నెలవేది యట్లు వరటాకారండ వాదిద్విజా, వళిఘోషించుటకన్న మున్న... వసు. ౨. ౧౪౨. కవిక. ౬. ౪.

నెలవుకొను. అ. క్రి. (√నెలవు.) ౧. పాదుకొను, స్థిరపడు.

క. ...నళినియందు... అక్కురంగలోచనచూపు నెలవుకొనిరి... శైవ. ౫. ౧౮౩.

సీ. పరితాపఖేదనాపరవశంబునఁ దూలి నెలసిన చిత్తంబు నెలవుకొనఁగ. కు. సం. ౫. ౬౩౪.

౨. వర్తిల్లు, ఉండు.

గీ. బంధులకు నెల్లఁ గన్నులపండు వగుచు, నీవుఁ దమ్ములు సుఖవృత్తి నెలవుకొనుఁడు. భార. శల్య. ౨. ౧౨౮.

౩. కలుగు, జనించు.

సీ. దైవయోగంబునఁ దగినయుద్యోగంబు నీమానసంబున నెలవుకొనియె. భార. సౌ. ౧. ౬౦.

సీ. అనిన నాయింతి నాయందు నిగ్గిరియందు నీకుఁ బ్రియం బెల నెలవుకొనదు. మార్క. ౪. ౨౪౪.

గీ. నిర్భరక్రాంతి నడకల నెలవుకొనియె, నక్కురంగేక్షణకుఁ జీరచిక్కుటయును. వేం. పంచ. ౫. ౬.

౪. వ్యాపించు, ప్రసరించు.

గీ. జననమరణాదు లైనసంసారదురితములకు నగపడకుండంగఁ దొలఁగు తెరువు, కనువెలుంగు నీ కిచ్చితి ననిన లేచి, నిలిచి సంతోష మెద నిండ నెలవుకొనఁగ. భార. విరా. ౧. ౨౩.

నెలవుకొలుపు(ల్పు)=నెకొల్పు, నెలకొల్పు. స. క్రి. (√నెలవుకొను.) ౧. పాదుకొలుపు, నిలుపు.

క. సేవున నివ్వాక్యంబులు, భావంబున నెలవుకొలిపి పరమసమాధి, శ్రీ వాటింపుము ... భార. అశ్వ. ౨. ౨౧౯.

క. కావున భూమియుఁ గనకము, గోవును దానార్హవస్తుకోటికి నెల్లం, ధీవినుతా యెక్కుడగుట, నీవిమలోదాత్తబుద్ధి నెలవుకొలుపుమీ. భార. అను. ౩. ౧౧౧.

౨. ఉంచు.

సీ. చరణపీఠంబుల గరుడాంకమణిఖండతులసీదళంబులు నెలవుకొలిపి. శైవ. ౯. ౧౧౨.

౩. అమర్చు.

సీ. మెఱుఁగులఁ గ్రిక్కనుకొను నెఱుఁ గేతకీదళములతో వేణి నెలవుకొలుప. కు. సం. ౩. ౨౬౯.

నెలవుపడు. అ. క్రి. (నెలవు+పడు.) నెలకొను, నిలుచు. (చూ. నెలవుపఱుచు).

నెలవుపఱుచు. స. క్రి. (√నెలవు.) నెలకొల్పు, నిల్పు.

సీ. భానుతనూభవప్రముఖుల నెల్లను నిజనిజపదముల నెలవుపఱిచి. చం. రా. ౭. ౧౬౮.

నెలవెలుఁగు. వి. (నెల[1]+వెలుఁగు.) చంద్రకాంతి, వెన్నెల.

క. నెలఁతుకకన్నులనంగాఁ, బొలుపగు నెలవెలుఁగుమేపుఁబులుఁగులు దమిచేఁ, గొలఁది యెఱుంగక తిని వెన్నెలఁ గ్రక్కెడు ననఁగ నెసఁగు నెలకొనునగవుల్. యయా. ౪. ౩౫.

(నెలవెలుఁగుమేపుఁబులుఁగు=చకోరము.)

నెలవొందు. అ. క్రి. (నెలవు+ఒందు.) నెలకొను, వ్యాపించు.

సీ. లేనవ్వువెన్నెలల్ నెఱవొందెఁ దెఱఁగంటి చెలిగంటిగమి మోవితలిరులందు. సమీర. ౧. ౬౮.

నెలి(ల్లి). వి. అగ్నిమంథము, ఒకవిధమైనకూరాకుచెట్టు.

చ. గురుగొఱబొద్ది చెంచలియు గుచ్చలి చిత్తిరిగిర్సె తుమ్మి దుసరి బలుగూటిబొద్ది నెలి చల్లిడి పల్లెరు... హంస. ౪. ౧౩౨.

వ... నెల్లికొయ్యలు దెచ్చి... మను చ. ౪. ౬౦.

సీ. శారుప మురపొన్న వారిజమును బొన్న నె
ల్లి మాలుగ బిల్లు నెమిలియడుగు. హంస. ౪. ౧౧.

నెళనెళ=నెళినెళి. వి. విఱుగుట మున్నగువాని యొండలిధ్వని కనుకరణము.

సీ. నెళనెళధ్వనులతో ఫెళఫెళ మనుగర్జితములు కర్ణక్షోభిధాటి మొఱయ. హంస. ౪. ౨౨౧.

నెళవరి. విణ. (నెళవు+అరి౩.) ౧. పరిచితుఁడు.

క. అళుకఁచు మూర్ఛిలి తెలుసుక, కళకళపడి లేచి మనసు గాసిల్లంగా, భళిరా యని వెలువడి తన, నెళవరులను చూచికొనుచు నిలుచున్నంతట. హంస. ౧. ౨౩౧.

౨. మర్మజ్ఞుఁడు, గుట్టు తెలిసినవాఁడు. (శ. ర.)

నెళవు. వి. రహస్యము, గుట్టు.

చ...ఆమదవతీమణి గర్భభరంబుఁ దాల్చె ని, న్నెళవు గృహాంబులోపలను నిక్కము గా వివరింపఁగాఁ దగన్. అని. ౩. ౧౦౫.

ఆ. నీవు గలుగుచోటు నెళవు దెలియువాఁడు, వసుధయందుఁ ద్రోవ వదలఁ డెందు. వేమ. ౩. ౭౭. వేం. పంచ. ౧. ౨౪౭.

౨. మర్మస్థానము, ఆయువుపట్టు.

సీ. మఱపించి యొల్లనిమర్మంబు లంటుచోఁ బుణికిళ్ల నెళవులు పుణికి వైచి. కవిక. ౩. ౨౨౨.

౩. అభ్యాసము, అలవాటు.

సీ. కాలములం దప్పక త్రిసంధ్యలందు సుమాధీశుఁ బూజించునట్టి నెళవు. చెన్న. పీఠి. ౯౭.

౪. (=నెలవు.) పరిచయము. (చూ. నెళవరి.) విణ. యుక్తము, సమంజసము.

సీ. నెళవుగ మాటాడ నేర్చునో నేరదో పురుషుల పను లౌను పొలఁతిచేత. వేం. మా ౫. ౪.

జః నెళవరి.

నెళినెళి=నెళనెళ.

క. ఇట్టిమెడఁ బుండ్రసంచయము, దట్టించి సుమాద్యహాంబు దళముష్టిహతిన్, బిట్టదువ సయిదు మష్టుల, నెట్టు వొడిచె నతఁడు నొదలు నెళినెళి యనఁగన్. ఉ. హరి. ౩. ౪౨.

నెవగు=నెగడు. అ. క్రి. వెలయు, ప్రసిద్ధికెక్కు.

గీ. కువలయక్షితికాముఁడై నెవగురాజు, గాఢరూఢప్రసన్నతఁ గాంచి తిరుగ, సాధుబుద్ధి గా వైతికొంబరారి. వేం. పంచ. ౪. ౧౫౦.

నెవము=నెపము. వి. (సం. నిభః. త. నివం.) ౧. మిష, వ్యాజము.

క...ఆతఁడును దత్సేవనతాత్పర్యంబు తగ నెవం బిడి యేప్రొద్దును పెదమను గనుమని తో, నను వర్తింపంగఁ గించిదవకాశము గాన్. హరి. పూ. ౧. ౭౩.

గీ. చివురుఁగెమ్మోవి-చిలుగాటునెవము గాఁగ, తామరసనేత్ర కోపింపఁ దగదు సుమ్ము. నైష. ౭. ౪౪. అచ్చ. రా. బాల. ౧౧౦.

౨. తప్పు, నేరము.

ఉ...మహీ,నల్లథ తత్కాథయు నెవంబున సర్వము లెల్ల నగ్నిలోఁ, దెళ్లఁగ ... భార. ఆది. ౧. ౧౨౫.

నెవయఁబడు. అ. క్రి. (నెవయన్+పడు - స్వార్థమున.) ఎగయు, ఎగురు.

క. దివిజులు తొలుదాఁకునఁ దప్పెవిచిన దనుజులను మనసుటేశ్వరశరముల్, పావయుని మంటలు మింటికి, నెవయుంబడి కెడప వెంవని నిలిచిరి వారున్. కవు. ౫. ౩౪.

నెవయు=నెగయు. అ. క్రి.

(ఎగయు, ఎగురు.)

క. పవనసఖుఁ డుగ్రకణములు, నెవయఁగఁ దన

పాడవ్వనూ పెనిన ధునిమ్రోలన్. భార. సభా. ౧. ౨౧౪.

జః నెవయంబడు.

**నెవులు**=అ. క్రి. బాధనొందు. ~~(బాధనొందు.)~~

సీ. క్రొవ్విరు లెసఁగి పూగొలలమై పోపక నవ కంపు లేఁదీఁగె నెవులునట్లు ము. సం. ర శ.

వి.-నెగులు. (నొగులు, బాధ.)

క. కనుఁగొని కృష్ణుఁడు బలదేవుని కిట్లను హయములకు నెవులు గదు నెవమ్మెఁ, జననిచ్చుటగాదున నీ, వనఘా కొనిరమ్ము రథము నల్లన వెనుకన్. హరి. పూ. ౩. ౨౨౦. (చి. ని. పా. 'తెవులు' ముద్రి. పా.)

**నెవ్వ.** వి. ౧. అభావము, లేమి; దారిద్ర్యము.

శా...వర్షంపునెవ్వన్ రుజన్, హోవళ్లం దిగుసన్య భూప్రజల రా జాయె యిజాత్యాచితిన్, భ్రోశంగాఁ దగు... ఆము. ౪. ౨౪౫.

గీ. నెవ్వ యొద్దడి లేమి నా నివ్వటిల్లు, రిక్తతకు నామధేయముల్... ఆం. భా. ౨. ౨౧౦.

ఉ. చేరి యొకండు నెవ్వఁబడి చిక్కుచుఁ జేరెఁడఁ శాలిధాన్యమే, కోరు నతండు పిమ్మట న కుంఠధనోన్నతుఁడై వసుంధరం, బూరికి సాటి గాఁ దలఁచు... ధర్మ. ౧. ౩౭.

గీ. చుట్టువాలును నెవ్వ పోఁగొట్టునాలు, బిట్టు గ్రాలుపసిండిక్రొంబట్టునేలు, మెట్టు జాలునెంగిలిపస మెట్టుఁజాలు, నట్టిడాలును గలజగజెట్టిఁ దలఁతు. అచ్చ. రా. బాల. ౩.

౨. శ్రమ, ఆయాసము.

గీ. తెల్లవారినఁగుండఁగెకోళ్లలీల, నీళ్లమునుఁగుచు నౌడ లెల్లఁ దెల్లఁబాఱీ, నిట్టుపాసంబులను గూడి నెవ్వఁదొడరు, వెడఁగుబాఁపనతగులనఁ బడితి వేల. వాల్మీ. ౨. ౧౩౦.

గీ. నెవ్వఁ దెరువరి చల్లని నీడమ్రాఁకు, రోగి కాజ్ఞ

నుబోలు మరుద్గణంబు, కోరి తాపత్రయాబ్ధి దూరకారి శౌరి, నాద్య భవరోగ వైద్యుఁ డాయంగఁ జనిరి. రామా. ౩. ౩౧.

౩. దుఃఖము, వ్యథ.

గీ. నీమనంబునఁ దగిలిననెవ్వ యెల్లఁ, బలుకు నాతోడ నాతోడు పద్మనేత్ర, దాఁచ నేఁటికి... చిత్ర. భా. ౫. ౧౨౧.

శా. అన్నా శల్యలు దంష్ట్రలన్ భగినులన్ స్నాల్లుండు మద్భ్రాతలన్, నిన్నుం బొమ్మను వేళ నేమనిరి మా నెవ్వ ల్విచారింతురే. భాగ. ౧౦పూ. ౧౫౧౧. (అపవ. అని శ. ర.)

క. ఇవ్విధమున దివిజాధిపుఁ, డవ్వేలఁదుకఁబొందఁగాన కాఁతటుపడఁగా, నెవ్వలు దొలంగిపోయిన, యవ్విడువున నినుఁడు పశ్చిమాంబుధిఁ గ్రుంకెన్. పద్మ. ౩. ౨౨. (చి. ని. పా.)

**నెవ్వగ.** వి. (నెఱ+వగ.) ౧. అధికదుఃఖము, మిక్కిలిచింత.

ఉ. నెవ్వగ యింత యేల విను నీ కెదు రెవ్వరు నీదుతమ్ములం, దెవ్వరు నూచినన్ జగము లిన్నియు గెల్వఁగలారు... భార. భీష్మ. ౨. ౧౧.

ఉ...ఇపు డెవ్వరు నెవ్వగఁ దీర్చువారలు... నీలా. ౨. ౪౨.

౨. సాంతఃచారణ, పూర్వాలోచన.

క. ఇవ్వైవ్వహాయసులత్వ్యం, బివ్విలు పూపెట్టి నట్టునేసినవీరుం, డిక్ష్వాకుకులవరుఁ డగు నని, నెవ్వగమీరాజు మలంకనియమము సేసెన్. భార. ఆది. ౪. ౨౩౦.

సీ. అతివిచారణసంజ్ఞయులరు నెవ్వగ యన... ఆం. భా. ౧. ౧౦౩.

సాభివ హేవత్సె యనుచు నార్తి. హరి. పూ.
౫. ౧౫౪.

**నేఁడు.** వి. దే. ౧. ఈదినము, జరగుచున్నదినము.
క. నేఁ డీబ్రాహ్మణుచేతం, బోఁడిమి చెడి యీ
ను జిక్కిపోవకయుండ౯, వేఁడిమి మెఱయు
శరంబుల, వాఁడిమి సొం పెల్లఁ జూపవల
యుం జుమ్మీ. భార. ద్రో. ౧. ౨౩౭.
క. అచ్చట నంతర్హితుఁ డై, యిచ్చఁ జనియెఁ
దోఁచు నేఁట యెల్లిటిలోన౯. భార. విరా.
౫. ౩౦౧.
౨. ఇప్పుడు, వర్తమానకాలము.
క. నేఁ డింక నెఱిఁగి యొరు వుల, వాఁడెఁ గదా
యనుచు నేను వారిఁ దొఱఁగినం, బోఁడిమి
చెడదే... భార. ఉద్యో. ౪. ౩౫.
సీ. చక్రవర్తిమహాప్రశస్తి నాఁడును నేఁడుఁ
జెలఁగి ధర్మక్రమస్థితి ఘటించె. పారి. పీఠి.
౧౭.

**నేఁత.** వి. (√ నేయు.) ౧. బట్టలునేయుట.
సీ. సరి లేని మంచిగుజ్జరి నేఁత పట్టుయుఁ బఱ
పైనరాయంచ గఱులపఱుపు. ఉ. రా. ౬.
౧౬౦.
చ. పగడపుఁగోళ్లు కుందనపుఁబట్టెలు కళ్కుల
నేఁతపట్టె యం,చగఱులపాన్పు ముత్తెపు
జాలి... కడు సొంపు వహింపఁగ నింపు పెంపు
సం, పఁగివిరితావిదోమతెర మంచముపై హరి
నిండు వేడుక౯. ల. వి. ౫. ౧౦౭. ('నేతిపెట్టె'
అపముద్రి.)
౨. ఇండ్లు నేయుట.
సీ. కఱవు గేస్తులయిండ్ల కప్పు నేఁతలయంద ను
డివడి కలఁగుటల్ మడుఁగులంద. అచ్చ.
రా. బాల. ౫౯.
బ. సన్నబారచాఁపులు. కవిక. ౩౮. (శ.ర.)

**నేఁతకాఁడు.** వి. (నేఁత + కాఁడు.) తంతువా
యుఁడు, బట్టలు నేయువాఁడు.
సీ. తంతువాయాభిధఁ దనరు మగ్గరి యన నేఁత
కాఁ డనఁగను నేఁతరి యనఁ, దోఁచుఁ దద్భే
దములె... ఆం. భా. ౨. ౨౭౩.
ఉ... తొల్లి చేఁ, సేఁతఁ బరిగ్రహించి యతిశిష్య
నిచే నొక నేఁతకానిచేఁ, దూతిక నొచ్చె నా
త్మకృశదోషమునం గద... వేఁ. పంచ. ౧.
౨౧౪.

**నేఁతపలక.** వి. (√ నేఁత.) నేఁతకాఁడు నేయు
నపుడు పడగు పేకలను ఉగ్గించునట్టిపలక, వాయ
దండము.
సీ... వాయదండము నేఁతపల కనఁ దగు. ఆం.
భా. ౨. ౨౯౬.

**నేఁతపురు(గు)వు.** వి. (√ నేఁత.) శ్రీ, సాలెపు
రుఁగు.
క. సేని మఱి తాన క్రమ్మఱ, గ్రాసము గొను
నేఁతపురువుగతి నీకలుగం, జేసిన యీవిశ్వ
మును రమాసఖ మ్రింగుదువు నీవ మరల౯
లీల౯. కవిక. ౬. ౧౭౨.

**నేఁతపూఁబోఁడి.** వి. (√ నేఁత.) సాలెపడుచు.
ఉ. ఆడుబుడక్కవానికి రయంబున భిక్ష యొ
సంగ నేఁతపూఁ, బోఁడి ప్రకోష్ఠకస్థలికిఁ
బోయి... హంస. ౨. ౨౭.

**నేఁతయంత్రము.** మి. వి. మగ్గము.
సీ... నేఁతయంత్రము మగ్గ మనఁగను దనరు
చుండు. ఆం. భా. ౧. ౨౭౬.

**నేఁతరి.** వి. (నేఁత + అరి³.) నేఁతకాఁడు.
సీ. తంతువాయాభిధఁ దనరు మగ్గరి యన నేఁత
కాఁ డనఁగను నేఁతరి యనఁ, దోఁచుఁ దద్భే
దములె... ఆం. భా. ౨. ౨౭౩.

**నేక్త** సం. విణ. (పు. స్త్రీ. న.) = నేజకుఁడు.
**నేక్తవ్యము.** సం= నేజనీయము.
**నేజి(ము)** = నేజా. వి. చిల్లకోల, తోమరము.

ఉ. ఆజవరాలిఁ జూచి యసురాళి సురాళి విరాళి గొన్నచో...కల్వపూ,నేజను వైచె నద్దనుజనేతలచిత్తము లుచ్చి పోఁగ౯. దశా. ౨. ౩౦౦.

సీ...నేజ బరిచి యీఁటె యనంగఁ బరఁగుఁ గుంత,ము...ఆం. భా. ౨. ౨౧౪.

మ...అకంతుండు కేలుదోయిఁ గొని నేర్పు ల్మీఱఁ బూమొగ్గనే,జను దద్వక్షము గుప్పునం బొడిచె నోజ౯ జైత్రుఁ డౌనా నన౯. చంద్రి. ౨. ౪౩.

క. నేజముఁ గొని యిప్పోటున,నే జమునిం జేర్తు ననుచు నిశిచరవీరుల్,జేజే లిడ సాహసమున,జేజేలగజంబుకుంభసీమం గ్రుమ్మె౯.శశాం. ౫. ౨౫.

చ. నిగనిగ మించుచెంగలువనేజముతో వడిఁ జిల్కతేజిపై, మగఁటిమి నెక్కి శూరుఁ డయి మారుఁడు...నరస. ౩. ౩౩.

నేజకుఁడు. సం. విణ. (అ. జిశా. అ.) ౧. శుద్ధిచేయువాఁడు. ౨. బట్టలు ఉదుకువాఁడు. వి. అ. పుం. రజకుఁడు, చాకలి.

నేజనము. సం. వి. అ. న. ౧. శుద్ధిచేయుట. ౨. చాకిపని, బట్టలు ఉదుకుట. ౩. నేజనస్థానము, చాకిరేవు. ౪. బట్టలు ఉదుకుపలక.

నేజనీయము. సం. విణ. (అ. ఆ. అ.) శుద్ధి చేయఁదగినది,ఉదుకఁదగినది.

నేజా=నేజ.

ఉ...కల్వమొగ్గనే, జా నటు చిమ్మి...మానినిఁ జీరిచీరి...భాను. ౩. ౨౩.

సీ. కడవన్నె జిగిపట్టునడికట్టుపడుదలఁ బట్టెంబు నేజాయు బాగుమీఱ. దశా. ౧౦.౧౧౨. నరస. ౫. ౪౦.

తమ్మినేజావజీరుదురముఁ=మదనకదనమా, సురతము.

గీ...పొదలోని కరిగి యమ్మించుఁబోఁడి, జారుతోఁ గూడి తమ్మి నేజాఁజీరు, దురమునను దస్త్రయాకస్తతో రమించె. శుక. ౨.౫౭౪.

నేజి. సం. విణ. (న్. నీ. న్.) ౧. శుద్ధిచేయువాఁడు. ౨. ఉదుకువాఁడు.

నేజ్యము. సం=నేజనీయము.

నేటించు. స. క్రి. (√నేటు.) సత్యముచెప్పు.

క. కూటము లెఱుఁగవు మాతో, సాటికిఁ బద్యములు చెప్పి చదివెద విడి బల్,నేటు సుమీ యని పెద్దలు, నేటించినఁ గుకవి కదుఁ గినిసి జగడించు౯. అప్ప. ౨. ౩౫౧.

అ. క్రి. చాఁగిలఁబడు.

అ. నిన్ను సన్నుతించి నేటించి మ్రొక్కెదు,హరి మురారి శౌరి యవధరింపు. భద్రరాజపుత్రచరిత్రము. ౩.ఆ.(శ.ర.దృఢపడు అని శ.ర.)

నేటు. వి. (క. నేటు.) ౧. సత్యము, నిజము.

గీ. నిజ మనఁగ నిక్కమం బన నిక్క మనఁగ, నేటు నాఁగను సత్యంబు నెగడుచుండు. ఆం. భా. ౧. ౧౧౪.

౨. నిశ్చయము, నిర్ధారణము.

ద్వి. నేటు గా నీకల్లనిజములు రెండుఁ,దేటగా నిప్పుడు తెలుపకయున్న. ద్వి. సారంగ. ౨. భా. (శ. ర.)

దండకము...నీబూటకం బెవ్వరు న్నేటు గా నారయ న్లేరుగా...నీలా. ౨. ౪౧.

౩. లెక్క,గణన.

ఉ. ఆటలఁ బాటల౯ మరఁగి యమ్మునివానులఁ గూడి యుండుటల్,నేటుకు వచ్చునే సభల ...శుక చ. ౨. ౧౪౩.

విణ. ౧. దృఢము, గట్టిది.

ఆ. కలఁగి తేటవోదు గడి దప్పనెఱచును,నీటి కుప్పనీరు నేటుమః సు.అచ్చ. భా. ౪. ౨౧.

గీ... మహోదరుతోడ నేటుగ సుషేణుఁ, డును
విరూపాక్షుతోడ రాముని యనుంగు, తోడఁ
బుట్టువు నేడెఱఁ దొడర మఱియు. అచ్చ.
రా. యు. ౧౨౯.

౨. తిన్ననిది, ఋజువైనది.

సీ. నీటిపై నుఱుకుచు నేటుగా నీఁదుచుఁ
గ్రమ్మఱ నడవక దొమ్మిఁ జనుచు. అచ్చ. రా.
యు. ౭౦.

క... తెలివి నొగి నన్నింటను, బాటిలి తొలినుడి
మిగులుచు, నేటుగువాదువులకు నెల్ల నిక్క
మిది యనక. అచ్చ. భా. ౪. ౧౩.

౩. నర్మగర్భము, మేలముతోఁ గూడినది.

చ... వాలుఁ జూపులను, గిలకిలనవ్వులు న్నిగుల
నేటుగుగాటపునూటిమాటలను, గలిగివిటా
వళిం దిరముగా వలపింతురు వేశ్య లత్తఱిన్.
రాజ. వి. ౧. ౧౩౫.

జః నేటించు, నేటుకొను, నేటుచేయు.

నేటుకొను. అ. క్రి. (√ నేటు.) అతిశయించు,
విజృంభించు.

క. నేటుకొని పండ్లు గొఱుకుచుఁ, జీటికిమాటి
కిని గసరు చిలుకం జిలుకా, బోటుల నల
యించెదు నీ, గోటాపన యెన్నఁ డింక గూఁ
టం బడునో. నీలా. ౩. ౨౬.

నేటుచే(సే)యు. (√ నేటు.) స. క్రి. ౧. నిశ్చ
యించు, దృఢపఱచు; (నిజరూపమున) నిర్ణ
యించు.

ఆ. పొన్నపువ్వుదీటు పోల్చలోకులమాట, నే
టుచేసి వేఁపబోఁటినాభి, విస్తరిల్లె నవుకు
వెడఁదబావి నిబోల్చ, నేర్పకాండ్రమాట
నేటుచేసి. రసిక. ౬. ౧౦౦.

ద్వి. పాటి దప్పితివయ్య పాపపుణ్యములు, నేటు
సేయఁగ లేక నిష్కారణముగ. ద్వి. శ.
పా. ౩. ౧౦౦ పా. ౧౬ పం.

౨. పాటిచేయు, గణించు.

ఆ. ముసలివారిమాట ముద్దుమాటయు, నేటు
చేసి/ యేలు నేల వదలి కటకటా కడింది కార్త
కంబులు గల్పవెలము సొరఁగఁ దగునె
పొలఁతిఁ గూడి. అచ్చ. రా. అరణ్య. ౧౦౯.

నేత. సం. విశే. (బు. త్రి. బు.) ౧. ప్రాపకుఁ
డు, పొందించువాఁడు. ౨. తీసికొనిపోవువాఁడు.
౩. ప్రవర్తకుఁడు, జరపువాఁడు. ౪. నాయ
కుఁడు, నడపువాఁడు. ౫. నిర్వాహకుఁడు, నెఱ
వేర్చువాఁడు. ౬. ఒడయఁడు, అధిపతి. ౭.
కథానాయకుఁడు. ౮. (దండనాయులను) విధిం
చువాఁడు. వి. బు. పుం. ౧. రాజు. ౨. విష్ణు
వు. ౩. నింబము, వేముచెట్టు.

నేతవ్యము. సం. విశే. (అ. ఆ. అ.) ౧. పొం
దింపఁదగినది. ౨. కొనిపోవఁదగినది. ౩. నడపఁ
దగినది. ౪. నెఱవేర్పఁదగినది. ౫. జరపఁదగినది.

నేతిబీఱ. వి. (√ నేయి.) ౧. ఘృతకోశాతకి.

ఆ... గుమ్మడి, కాయ నేతిబీఱ కాయ పుచ్చ, కాయ
నక్కదోసకాయ వట్రువసొఱ, కాయ గాదు
శ్రాద్ధకర్మములకు. వి. పు. ౪. ౨౭౪.

సీ. బీకర బీఱ నా వెలయుఁ గోశాతకి నేతి
బీఱ యనంగ నెగడుచుండుఁ, దద్భేదనా
మంబు... ఆం. భా. ౨. ౬౦.

నేతిబీఱకాయ=అన్వర్థము కానిది. (సార్థక నామ
ము కానిదాని కుదాహరణముగా దీనిని
వాడుదురు.)

గీ. నిగమశర్మాభిధానంబు నేతిబీఱ, కాయయును
బోలె నయథార్థగాథఁ దాల్చి, వైదికాచార
దూరప్రవర్తనముల, వీటు విహరించుచుండు
నవ్విటప్రోగు. పాండు. ౩. ౧౩.

నేతిబీఱపస=నేతిబీఱకాయయొక్క పసవంటిపస
గలది.

శా... తోడంబుట్టువునింటిపైఁ జెగవో నిల్

దోషాకరుం డంట కీ,జాడల్ సాక్షులు నేతిబీఱపస వో చంద్రాదిసామార్గముల్.కవిరా. ౩. ౧౩౧.

**నేతివసంతము.** వి. (√ నేయి.) నేతితో ఆకువసంతము.

క. ఓతల్లి మాకుఁ గృష్ణుఁడు,చేతోవిభుఁ డైనవాఁడు చెలువల మెల్లన్, నేతివసంతము లాడుచు,జాతర నేసెనము భక్తిచాతురితో డన్. భాగ. ౧౦ పూ. ౪౦౯.

**నేత్రచ్ఛదము.** సం. వి. అ. పుం. కను రెప్ప.

**నేత్రజలము.** సం. వి. అ.న.బాష్పము, కన్నీరు.

**నేత్ర(ము)పట్టు.** వి. పట్టువస్త్రభేదము.

వ...ఉదయరాగపట్టులును నేత్రపట్టులును వజ్రపట్టులును నను పేళ్లుగలపుట్టంబులు...ద్వా. ౩. ౧౪౪.

ద్వి. నెఱిపట్టు వెలిపట్టు నేత్రంబుపట్టు. బస. పు. ౩. ౫౬ ఠాపం.

**నేత్రపర్యంతము.** సం. విణ. (అ. ఆ. అ) కంటికడను ఉండునది, నేత్రావధికము. వి.అ.పుం. అపాంగము, కడకన్ను.

**నేత్రపర్వము.** సం. వి. న్. న. కనుపండువు; కనుపండువుచేయువస్తువు.

ఆ...సిరి వరింప నభినవోజ్జ్వ, లత్వ మొంది దివిజులకు నేత్రపర్వ మై, పొలిచి యింద్రుఁడాత్మపురికి నరిగె. భార. శాం. ౫. ౧౫.

**నేత్రపాకము.** సం. వి. అ. పుం. నేత్రరోగవిశేషము.

**నేత్రపిండము.** సం. వి. అ. పుం. ౧. నేత్రగోళకము, కనుగ్రుడ్డు. ౨. పిల్లి,బిడాలము. (వాచ.)

**నేత్రపుష్కర.** సం. వి. ఆ. స్త్రీ. -కంటినుండి దుష్టజలమును స్రవింపఁజేయునది - రుద్రజటి.

**నేత్రబంధము.** సం. వి. అ. పుం. బాలక్రీడావిశేషము, దాఁగిలిమూఁతలు. (వాచ.)

**నేత్రమలము.** సం. వి. అ. న. దూషిక, కంటిపుసి.

**నేత్రము.** సం. వి. అ. న. ౧. నయనము, కన్ను. ౨. తరిత్రాడు, కవ్వపుత్రాడు. ౩. వస్త్రము; వలిపము, వస్త్రవిశేషము.

గీ. గరుడపచ్చలు నేత్రముల్ తురఁగవళ్ళు, హంసవళ్లును పద్మాలు హరిణవళ్లు, మొదలుగా వల్వలు ధరించి ముదిత లపుడు. ప్రబంధ. ౨౭౨.

౪. వృక్షమూలము, వేరు. ౫. వస్తిశలాక, వస్తి చేయుటకుసాధన మగుకడ్డీ. ౬. రథము, తేరు. ౭. ఏఱు,నది. ౮. జట, జడ. ౯. నాడి. ౧౦. (గణిత.) రెండు అనుసంఖ్య.

**నేత్రముషము.** సం. విణ. ౧. చూపు నాకర్షించునది. ౨. నేత్రములు మిఱుమిట్లు గొనఁజేయునది, దృష్టి చెదరఁగొట్టునది.

**నేత్రయోని.** సం. వి. ఇ. పుం. ౧. -యోనుల వంటికన్నులు కలవాఁడు- ఇంద్రుఁడు, వేగన్నుల వేలుపు. ౨. -అత్రినేత్రము జన్మస్థానముగా కలవాఁడు- చంద్రుఁడు.

**నేత్రరంజనము.** సం.వి.అ. న-కన్నులను రంజిల్లఁజేయునది-కాటుక.

**నేత్రరోగహాము.** సం. విణ. (న్.) నేత్రరోగములను పోఁగొట్టునది. వి. న్. పుం. వృశ్చికాళి, తేలుకొండి.

**నేత్రరోమము.** సం. వి. న్. న. పక్ష్మము, కను రెప్పవెండ్రుక.

**నేత్రవస్త్రము.** సం. వి. అ. న. నేత్రచ్ఛదము, కను రెప్ప.

**నేత్రవిట్టు.** సం. వి. ష్. స్త్రీ. నేత్రమలము, కంటిపుసి.

నేత్రాంతము. సం. వి. అ. పుం. అపాంగము, కడకన్ను,

నేత్రాంబువు. సం. వి. ఉ. న. బాష్పము, కన్నీరు.

నేత్రాభిష్యందము. సం. వి. అ. పుం. కంటనీరు కాఱుట, నేత్రరోగభేదము.

నేత్రారి. సం. వి. ఇ. పుం. -కంటికి శత్రువు- సింహుండము, జెముడు†.

నేత్రి. సం. వి. ఈ. స్త్రీ. ౧. నాయకురాలు. ౨. నది. ౩. లక్ష్మి. ౪. నాడి.

నేత్రోత్సవము. సం. వి. అ. పుం, కన్నులపండువు; కన్నులకు పండువుచేయుపదార్థము.

నేత్రోపమఫలము. సం. వి. అ. పుం- కన్నులవలె నుండుఫలము కలది- బాదము†. (వాచ.)

నేత్రౌషధము. సం. వి. అ. న. ౧. పుష్పకాశీసము, అన్నభేది. ౨. కంటిమందు.

నేత్రౌషధి. సం. వి. ఈ. స్త్రీ. అజశృంగి, జుట్టుప్రు†.

నేదిష్ఠము. సం. విశే. (అ. ఆ. అ.) అంతికతమము, మిక్కిలిసమీపమందున్నది. ౨. నిపుణము, నేర్పుకలది. వి. అ. పుం. అంకోలము, ఊడుగు†.

నేదీయము. సం. విశే. (స్. యసీ. స్.) అంతికతరము, ఎక్కువసమీపమందున్నది.

నేని= ఏని.

(అప్యర్థకము.)

మ. త్తకోకిల...మదీయభాషిత మెన్నఁడు, న్నేని మోఘము కాదు దిగ్ధరణీరవీందు లెఱుంగఁగాక. భార. ఆది. ౪. ౧౪౧.

ఉ. నీవును జూచి తట్టిసభ నేని వినంబడ దేయు గంబులక. భార. సభా. ౨. ౯౫.

చ. సలలితసాంద్రకుంకుమము చన్నులపై మెయిఁ బ్రీతి నీవునా, కలఁదినచందనంబు తడియారదు నేఁయు సంగజన్న నీ, విలసితచారురూపతనువిభ్రమసంపద లీక్షణంబులోఁ, బొలుపఱఁ గాలియా నె...కు. సం. ౫. ౫౫౧.

సీ. అరిగశ్ఛశ్వరి వఁటిఁగఁ గందెదు నెలకన్నె ఱంగవు నేని... కు. సం. ౨. ౨౪౦.

క. మెట్టఁడు నారకమార్గం, బెట్టిమహాక్రూరకర్తుఁడేనియుఁ దుద న్విట్టట్టునక నెమ్మనంబున, నెట్టన హరితలఁపు గలిగెనేని మహాత్మా. అప్ప. ౩. ౨౧౪. (ఈపద్యమును అప్పకవి ఉభయవళులలోనినిత్యయతికి ఉదాహరణముగా నిచ్చినాఁడు. కాని పైప్రయోగములఁ బట్టి చూడఁగా దాని కాధారము చింత్యము.)

నేనిజత్. సం. శత్రు. ౧. శుద్ధిచేయుచున్న, ఉదుకుచున్న. ౨. మిక్కిలి శుద్ధిచేయుచున్న.

నేనిజమానము. సం. విశే. (అ. ఆ. అ.)=నేనిజత్.

నేను= ఏను. (స. క. నాను. త. నాన్.) నాశబ్దప్రథమైకవచనము. (దీనిబహువచనరూపము నేము. చూ. నా.)

జః నేఁ జెల్ల.

నేపథ్యము. సం. వి. అ. న. ౧. భూషణము, అలంకారము. ౨. వేషము; నాటకపాత్రముల వేషము. ౩. (నాటక.) వేషస్థానము, తెరకు లోపలిభాగము.

నేపము. సం. వి. అ. న. జలము. (వాచ.)

నేపాలమూలకము. సం. వి. అ. న. హస్తికందమువంటిమూలభేదము, ఒకదినుసుముల్లంగిదుంప.

నేపాళకము. సం. వి. అ. న. తామ్రము, రాగి.

నేపాళజ. సం. వి. ఆ. స్త్రీ. మనశ్శిల, మణిశిల.

ఇట్లే: నేపాళజాత.

నేపాళము. సం. వి. అ. పుం. ౧. ఒకదేశము. ౨. ఒకదినుసుచెఱకు. ౩. ఒకజాతివెుక్క, వృక్షభేదము. న. తామ్రము, రాగి.

నేపాళి. సం. వి. ఈ. స్త్రీ. మనశ్శిల, మణిసిల.

నేపాళిక. సం.వి.ఆ. స్త్రీ. ౧. నేపాళవుచెట్టు. ౨. మనశ్శిల, మణిసిల.

నేపుఁడు. సం. వి. అ. పుం. పురోహితుఁడు. (వాచ.)

నేబీఱ=నేతిబీఱ. వి. (√నే.) ఘృతకోశాతకీ.

ఆ. ఉల్లి తెలికపిండి ముల్లంగి నేబీఱ, పుచ్చ దొండకాయ పుట్టకొక్కు, లూఁచిండి మునఁగ మారేడుగాయ లట్లనుభవించువారి నవఁగి పెనఁగు. పద్మ. ౬. ౧౧౭.

నేబు. వి. పండ్రెండుకానులనాణెము.

చ. పలువలు చెంతఁ జేరి యొకపాతిక నేబులు చేతి కిచ్చినన్. చంద్ర. వి. ౨. ౩౮.

నేమకము. వి. నేమము, నియమము. (శ. ర.)

నేమగాఁడు. విణ. (నేమము+కాఁడు.) నియమవంతుఁడు.

(వేంకటేశ్వరవర్ణనము.) సీ. తల నిల్లు గట్టు వ్రతంబులరాయని తోమనిపళ్ళాలనేమగాని. ఘటికా. ౨.౧౩౬. (తోమనిపళ్యాలనేమగాని=స్వల్పకర్మలతోహోమములు చేయునియమవంతుని)

నేమము. వి. (సం. నియమః. క. నేమవు.) వ్రతము, విధిగాఁ జేయవలసినపని; నియమము, కట్టుపాటు.

ఉ...గట్టిగ నిశ్చయించె స్వామిమల జట్టియిచ్చి తనపట్టినయట్టి కడింది నేమముం,దామదిఁ గొన్ని నాళ్లు విహితంబుగ నిల్పికొనన్ మనంబులోన్. కళా. ౬. ౯౬.

శా. ఏమీ కొంకక పెట్టు జంగములకున్ హేరాళమృష్టాన్నముల్, నేమం బొప్పఁగ రేలునుం బగలును న్విశ్వాసపూర్వంబుగన్. హర. ౨. ౨౭.

ఉ. నేమ మెలర్పఁగా గొడుగునీడ వహించు వసుంధరాస్థలీ,క్షేమని యెక్కి యాడెను విచిత్రగతిం మదగోత్తమంబు స్వామి విభుండు...సైన. ౧. ౪౭. ౮౦. భా. ౨. ౧౩౮.

జః నేమగాఁడు, నేమించు.

నేమము. సం. విణ. (అ.ఇ.ఆ.) ౧. తుల్యము, సదృశము. ౨. సమీపము,నికటము. వి.అ.పుం. ౧. ఖండము, భాగము. ౨. కాలము. ౩. మేర. ౪. ప్రాకారము; కంచె. ౫. వ్యాజము, మిష. ౬. అర్ధము, సగము. ౭. సాయంకాలము. ౭. మూలము, వేరు. ౯. ఊర్ధ్వభాగము, మీఁది భాగము. ౧౦. అన్నము. ౧౧. గర్తము,గోయి. ౧౨. వజ్రము. ౧౩. పురోహితుఁడు. (వాచ. శే. ని.)

నేమి. సం. వి. ఇ, న్. పుం. నెమ్మి, తినాసముక్కి. ఇ. పుం. ౧. వజ్రాయుధము. ౨. గాడిద.పుం. స్త్రీ. ౧. ఘటీయంత్రము, నూతిగిరక. ఇ.ఈ. స్త్రీ. బండిచక్రము చుట్టుకమ్మి, ప్రధి.

నేమించు. స. క్రి. (√నేమము.) నియమించు.

గీ. మత్రియుఁ గమఁ బేరు గలిగినమలల నరసి, యున్న తావులఁ గదిలింప కునిచి రండు, మీర లంచును బిలిచి నేమించి పనుప. యయా. ౩. ౩౮.

మ...చుట్టును ధానుష్కులు కుంతధారు లగు బంటుల్ నిల్వ నేమించి శంఖనినాదంబులు దుందుభిధ్వనులు ఢక్కానాదముల్ మింట చెలఁగన్. ఉ. రా. ౭. ౪౦౭.

నేము. స. క్రి. (ధాన్యము మొ.) చేటలో పోసి యిటునటు త్రిప్పు. (శ.ర.)

నేముఁడు. సం=నేపుఁడు. (వై. ని.)

నేయము=నెయ్యము. వి. (సం. స్నేహః.) ౧. స్నేహము, మైత్రి.

ఉ. నేయము లజ్జయుఁ గరుణ నెమ్మి కోపభయైకలేశ మే, నేయెడఁ జూచిన న్నదికి నించుక యించక...రస. ౩. (శ. ర.)

ద్వి. నేయుంబు తోడ నాన్నపుఁ దప్పు దతని, చేయూఁదికొని వార్ధిఁ జేరంగ వచ్చి. రం. రా. యు. ౩౦ ౨ పా. ౨౦ పం. (చి.ని.పా.)

నేయము. సం. =నేతవ్యము.

నేయార్థము. సం. విణ. (అ. ఆ. అ.) పొందింపఁదగినఅర్థము కలది. వి. అ. స. (కావ్యదోషములలో నొకటి, స్వసంకేతిత మగుఅర్థము గల పదము.

క. ఇలఁ దనసంకేతంబున, నిలిపినపద మెంచి చూడ నేయార్థం బాబలు తేనెదిండిగ మిసగు, వలసాగర కర్ణయానయలక లవంగజా. సరస. ౪. ౫. (సాగరకర్ణ= సాగర మనుపదము చెవులయందుకలది, ఏనుఁగు.) ౨. న్యాయము. (శ. ర.)

శ్లో. విహాయ చ గృహాంస్తాన్స్ త్యక్త్వా స్తనవప్తృతయః, కదా భవిష్యతే వాసః కటుకేషు మహీభృతాం." ప్రతాపరుద్రీయము. దోషప్రకరణము. (ఇట త్యక్త్వా స్తనవప్తృతులు= తనవృత్తులు అని యర్థము.)

నేయి=నెయి, నెయ్యి, నే. (సం. స్నేహః. క. త. నెయ్.) వి. ఔ, అనా. ౧. ఘృతము, ఆజ్యము.

క. కామములు భోగములఁ దెగు, నే మెఁతుక నేఁత నాలు నే చిచ్చు... భాగ. అను. ౫. ౨౩౩.

సీ. కమ్మఁగాఁ గాఁచినకతియాల నేతితోఁ గమనీయపంచభక్ష్యములతోడ. భీమ. ౧. ౬౦.

క. ఈయర్థము నిశ్చయముగఁ, జేయక వే ఱొక్కమతము నేయుట యొల్లక, వే రేల బూని వేల్చిన, నేయినిఁ బోలియును మీఁద నిష్ఫల మందురా. వా. రా. ౪. ౬౩.

ద్వి. ధరణిఁ బంతియ సముద్రంబుల నేతి, నరుణు దీపముఁ జేసి...నీరజాక్షున కిచ్చె నీరాజనంబు. ద్వి. పరమ. ౧. ౪౫ పా.

సా:– రొట్టె నేతిలో పడినట్లు (కార్యము సఫలమైన దని భావము.)

౨. తైలము, చమురు.

క. నేయి పొలుపఱిన దీపియ, మాయుకరణిఁ గ్రస్సిద్ధి మలిగిన హీన, త్వాయత్తం బై తోనును, మాయును దైవానుకూల్యమహిమ మహీశా. భార. అను. ౧. ౧౩౭.

శ్లో. యథా తైలక్షయాద్దీపః ప్రమ్లాని ముపగచ్ఛతి, తథా కర్మక్షయాద్దైవం ప్రమ్లాని ముపగచ్ఛతి. సం. భార. అను. ౯. ౪౬.

౩. క్రొవ్వు, మజ్జ.

గీ...కేరజములు, గువ్వలును మొదలుగ లెక్క కొలఁది మీఱఁ, గలవు పులుఁగులు నేతులు గ్రక్కు క్రొవ్వి. చిత్రభా. ౩. ౧౨౨.

నేయిపూసినకత్తి=పయికి అనుకూలముగా నుండి ద్రోహము చేయునది. (ఇది తేనెపూసినకత్తి వంటిది.)

వ...కొండొకకాలంబు నమ్మఁ దిరిగిన నాళ్ళు పెట్టంగ నేయిపూసినకత్తి యగుట దెలియక గోముఖవ్యాఘ్రం బగుట వివరింప నేరక యత్తులువం బరిగ్రహించి... వేం. పంచ. ౧. ౨౨౫.

జ: నేతిబీఱ, నేతిచసంతము.

నేయు. స. క్రి. (క. నేయ్.) నేఁతచేయు, వయనము చేయు.

చ...తద్భటకోటి చాతురీతురి...యశోం, బరములు నేయుచుండు బహుభంగులఁ బున్నమనాఁటినిండుచం, దురునను సోగవెన్నెల

లతోఁ దులఁదూఁగెడుతద్గుణంబులన్. నైష. ౧. ౪౫.

జః నేఁత, నేఁతకాఁడు, నేఁతపలక, నేఁతపురువు, నేఁతపూఁబోఁడి, నేఁతరి.

నేరఁబోతు. విణ. (నేరమి + పోతు.) తెలియని వాఁడు, అనభిజ్ఞుఁడు. (చి. ని. శ. ర.)

నేరపెట్టు. స. క్రి. (నేరము + పెట్టు.) నెపపెట్టు, దోషియని చెప్పు.

క. కలితనమునఁ జని యలనా, పులుకుంబంతంబుఁ జెల్లుబడి గా రెడ్డిన్, గలసి యొకముడుపు గైకొని, పిలిచిన నీ కిత్తు నేరపెట్టుదు మగనిన్. వేం. పంచ. ౪. ౪౫౪.

నేరమి. వి. (నేరుచు.) ౧. తెలియమి, అజ్ఞానము.

క. ఏ వెఱఁగమి నిట్లడిగితి, నా నేరమి సైఁప వలయు... భార. అర. ౫. ౩౧౧.

ద్వి. ఘోరప్రతిజ్ఞఁ గైకొని వేల నైతి, నేరమిఁ జెడిపోయె నేఁడు నాతపము. ద్వి. హరిశ్చ. పూ. ౨౧౭౦ పం.

క. ధనరాజ్యరమామదమునఁ, గనుఁ గానని నిన్ను శిష్యుఁ గాఁ గైకొనుకం, బెను నేరమి కలదే ...మనుచ. ౫. ౧౧.

౨. దోషము, తప్పు.

సీ. తగిలి సుహృద్ద్యూతధర్మయుద్ధములకుఁ బరులచేఁ బిలువంగఁబడి విభుఁడు, గడఁగక విముఖుండు గాఁ జన దని శుభశాస్త్రధర్మంబు లోకంబులందు, నిలిపెఁ దా నిది పతి నేరమియే దైవవైపరీత్యం బైన వనరఁ దగునె. భార. సభా. ౨. ౨౨౪.

సీ. నేరమి లేకయు నెప మిడి యర్థంబు గొను రాజుఁ బ్రజలచే విని కలిగి. గీ. యాచరింప నివిభుఁడును...అధోగతి కరుగువారు. భార. అను. ౨. [illegible]

ఉ. నావుడు దానవేశ్వరుఁడు నవ్వుచు నూర్వశితోడ నిట్లనున్, నీ విటు దూఱ నేర్తు సని నేరమి పెట్టితి గాక... ఉ. హరి. ౧. ౬౭. ఆం. భా. ౨. ౧౯౧.

నేరము. వి. (త. నేరం.) తప్పు, అపరాధము.

క. రేయును బగలును విడువఁక, నీ యొద్దన యుండికిఁ జేసి నేరము పలుకన్, మా యిష్టం బెఱిఁగింపఁగ, ధీయుత యొక గంటి మిన్ని దివసంబులకున్. భార. ఆది. ౭. ౧౮.

గీ. అరి నార్జింప వర్జింప నలవి గాని, ధర్మము నధర్మమునుఁ జెప్పఁదగిలి మనువు, నేరములు వెట్టి దండువు నిశ్చయించి, ధరణిఁ గలవోట నర్థ మొత్తంగఁ దలఁచి. నైష. ౬. ౬౮.

ఉ. ...తోఁటకాళిదాసాదిమహాకవీశ్వరుల కైన నేరము లేక యందునే. వి. పు. ౧. ౧౪. ఆం. భా. ౨. ౧౯౧.

జః నేరపెట్టు, నేరముకొను.

నేరముకొను. అ. క్రి. (నేరము + కొను.) తప్పుపట్టు.

క. ఓరి దురాత్మక విని పల్కు, మా తిటు రావలదు హెచ్చి మతి వచ్చితివా, నేరముకొందు గ్రహించుక, యూరక యాపని ఘటింపు మెప్పుడు మాకున్. బిల్హ. ౩. ౧౫౮.

నేరాజే. విణ. సరిగతో నేసినది, జరతారా. (వస్త్రము. మొ. శ. ర.)

నేరిమి (ర్మి.) వి. (నేరుచు + ఇమి.) సామర్థ్యము, శక్తి; ప్రావీణ్యము, చతురత.

ఉ. ...అంబకజాలవీచికా, స్ఫారము నైనభీష్ముఁడను సాగరముం గడవంగ నీఁదఁగా, నేరిమి యెట్లొకో కలుగ నేర్చు శిఖండికి నేమి సేయుదున్. భార. భీష్మ. ౧. ౫౪.

క. ఈటేవికి నీ నేర్మికి, మేటితనంబునకుఁ జాల మెచ్చితిఁ గొనుమం చే, కాఁటుకొనియున్న నీతఁడు

నే పెన్నఁడు లేనిసిరులఁ జెన్నారుఁగదా. అచ్చ. రా. సుం. ౧౩.

ఉ. నిక్కమపోలె నప్పు డొకనేరిమిమై నసుఁ ద్రోచిపుచ్చఁగా, నక్కమలాక్షి పొందుఁ దగ నాడి ... ఇక్కడు రాక తక్కినన్. భార. విరా. ౨. ౪౯౬.

క. వీరు దమపాలు వడయక, నేరిమి మాటలన తేఱ నేర్తురె చెప్రుమా. భార. ఉద్యో. ౧. ౩౪౦. (నేరిమిమాటలన=చతురవచనముల చేత నే.)

క. సారెయుఁ బలకయుఁ గైకొని, నేరిమిమై నాడి ధనము నేరయఁగఁ గొని దు,ర్వారుం డగు నాజూదరి...దశకు. ౫. ౬౯.

నేరుచు(ర్చు) స. క్రి. (దీనికి 'నేచును, నేరుచును, నేర్చఁడు, నేరువఁడు, నేతుక్, నేరక్' ఇ. రూపము లగును. త. నేర్.) ౧. అభ్యసించు,కఱచు.

క. అఱువదినాలుగువిద్యలు, నఱువదినాలుగు దినంబు లంతనవారల్, నెఱవాదులైనకతము న,నాటి నొక్కొక నాఁటివిసికి నేర్చి,రిలేశా. భాగ. ౧౦ పూ. ౧౪౧౦.

సీ. పద్యంబు గీతికార్భటి నొగిఁ జదువంగ నెల్ల విద్యలసంచు లెఱుఁగ నేర్తు. విక్ర. ౧. ౨౦, ౧. ౪౯.

౨. తెలియు, ఎఱుఁగు.

మ...సాధుల్ నేరమూ ర్చనయఁ బేర్లులంక౦ జెం డినయట్టికాంత లుచితవ్యాపారము ల్నేర్తురే. పారి. ౧. ౧౨౧.

వ...ఇంక నైన నుపేక్షింపక యీదుష్టద్యూతంబు వారింపు మనిన పుత్త్రస్నేహంబున నెద్దియుఁ జేయునది నేరక ధృతరాష్ట్రుండు మిన్నకుండె. భార. సభా. ౨. ౧౭౪.

ఉ. నేరక చేర నొక్కవిన నీఱుఁగ జేయుఁ గృశానుఁడు...భార. శాం. ౧. ౯౩.

ఉ... పరమార్థము మంత్రవిభేదమైనఁ గా,ర్యములు నిర్వహింపఁగ బృహస్పతి కైనను నేరఁ బోలునే. భార. ఆది. ౬. ౧౧౦.

ఉ ... వంకమాట లే, నేరఁ గురుప్రవీరసభ నిశ్చయ మిట్టిది కాఁగఁ జెప్పుమీ. భార. ఉద్యో. ౩. ౯౬.

క. నీచేఁ దా రాద్యంతము, నేచుకొనం గలరు వరుస నిఖిలపురాణ,ప్రాచుర్యకరణలీలా,వాచాలుఁడు వ్యాసుఁ డెఱుఁగు వారల లవనన్. వరాహ. ౧౨. ౩౪.

క...నా, నేచినగతి నచట నచట నిలిపితి... భార. శా. ౧. ౩౧౫.

ఉ. నేచియు నేరకుండియును ... దశకు. ౩.౧౪౦.

క. ద్యూతక్రీడకుఁ గొఁడొక, నేతుం...భార. విరా. ౧. ౧౪౬.

క. నేతును మంత్రము లందఱ, నేతును దద్రిపులప్రేవు లీరణమునకున్. ప్రబంధ. ౪౪౮.

అ. క్రి. ౧. సమర్థమగు, శక్తమగు.

ఆ. నీవు నీసుతుండు నేర్తురు గా కొరు, లేమి సేయ నేర్తు రిందుకులుఁడ. భార. సభా. ౨. ౩౧౨.

క. కీచకుఁడు ప్రేటుపడి తన, నీచపుదెస యొరులెఱుంగ నేరకయుండన్, లేచి...భార. విరా. ౨. ౧౩౦.

సీ. అతఁడు పాణిగ్రహణార్థుండు విను నీవు నతనిఁ గూర్పఁగ నేర్తు నతివ యేను. శైవ. ౨. ౬౫.

౨. ఇష్టపడు, సమ్మతించు.

క. తిరిగినపందల నేటికిఁ,బురికొల్పఁగ నున్న వారు వోదురు గా కేఁ,గురుపతిజయుంబు గొని యుద్ధర యేలం జూడ నేర్చెదనె విను నన్నున్. భార. భీష్మ. ౨. ౧౫౨.

చ...వల్లభలు ప్రాణవిభుం బెడవాయ నేర్తురే. పారి. ౪. ౫౪.

౩. సంభవించు.

ఉ...భీష్ముఁ డనుసాగరముం గడవంగ నీఁదఁగా, నేరమి యెట్లొకో కలుగ నేర్చె శిఖండికి నేమి సేయుదున్. భార. భీష్మ. ౧. ౫౪.

వ...యుష్మత్సంఘటితంబు లైనసంబంధములకు వికారం బెన్నండును బుట్ట నేరదు...పార. ౬. ౪౯. మనుచ. ౧. ౭౨.

జః నేరమి, నేరిమి, నేరుపరి, నేరుపు, నేరుపులాఁడు, నేర్పుకాఁడు.

నేరుప(ర్ప)రి. (నేరుపు + అరి[3].) నేర్పు కల వాఁడు, చతురుఁడు.

క. నేరుపరి పోషాళించిన,హారము వల యొక్కలీల...ప్రబోధ. ౧. ౨౭.

క. అరిదివిలుకానియుజ్జ్వల,శర మెక్కని నొంచుఁ దప్పి చనినం జను నేర్పరియైనవానినీతి, స్ఫురణము పగరాజు నతిసభూమిం జెఱుచున్. భార. ఉద్యో. ౨. ౩౬.

నేరుపు(ర్పు) స. క్రి. (√నేరుచు.) అభ్యసింపఁ జేయు.

మ. మురిపం బొప్పఁగ మందమందగమనంబుల్ నేర్పుదు నేదినీ,శ్వరశుద్ధాంతనితంబినీజనులకున్ సంపూర్ణచంద్రాననా. నైష. ౨. ౫౬.

చ. పలుకులు నేర్పువేళఁ గలభాషిణి నీ విటులుండ...మనుచ. ౩. ౫౯.

వి. ౧. (క. త. నేర్పు.) ప్రావీణ్యము, చతురత; సామర్థ్యము, శక్తి.

ఉ. ఇంచినభక్తి నొక్కతరళేక్షణ నైషధభూమిభర్త మన్నించు వరూధినీపతికి నేరుపు మీఱఁగ బట్టిపెట్టఁ గాఁ,బంచినతాళవృంతముల వీచుచు నుండె...నైష. ౬. ౧౧౭, ౧. ౭౪.

క. చిత్తం బూరక కలఁచెదు,వత్తము నాతోడ నాడ నేరుపు గలదే. ఉ. హరి. ౩.౧౧౬.

మ. విని సంశప్తకు లేము దక్కనొరు లావివ్వచ్చు భంగించి శౌ,క్తునిక్ం జాపి యలంప నేర్పు గలరే...భార. ద్రో. ౧. ౩౯౩.

౨. రీతి, విధము.

చ. ఘనుఁ డతఁ డేఁగుదెంచి పరిగద్దియ నుండ నగారిశైలఖం,డనకథ చారణాళి వొగడన్ నిజసన్నుతి కోసరించునేర్పునఁ దల వంచి పీఠతటరూఢమణిన్ బొటవ్రేలమీఁటున, య్యనఘుఁడు కొండ మీఁటినమహాద్భుతకృత్యము దెల్పుకైవడిన్. వసు. ౧.౧౨౨.

గీ...నీయిష్ట మీడేరు నేర్పు,తెలియఁ జెప్పెద వినుమని తెఱవ కపురు. హంస. ౫. ౩౦౪.

నేరుపులాఁడు. విణ. (నేరుపులు + వాఁడు.) నేరుపు కాఁడు.

సీ. వెనుబొజ్జ నిడ్డెనల్ నినుచు నేరుపులాఁడు ...గీ...సౌరు, నెరపు నెఱవేల్పు నామది నిలుచుఁ గాక. అచ్చ. రా. బాల. ౯.

(శ.ర.పా. 'తి నెకు నేరుపువాఁడు' ముద్రి.)

నేరెడల్లులు. వి. బ. (√నేరేడు.) అల్లొనేరేళ్లు, నమస్కారములు.

సీ...టెంకిణాలు నేర్పడల్లుల్ సలా మన నమరు దండము పెళ్లు...సాం. ని. మాన. ౨౫.

నేరె(రే)డు. వి. దే. జంబూవృక్షము.

ఉ... అ,న్నేరెడుమ్రానిమూలమున నెక్కొని యుండు జగత్ప్రశస్తమై. మార్క. ౪. ౧౪౪.

క. విను మేకాదశశతయోజనదీర్ఘము లేతదీయశైలాగ్రములం, దవదుచుఁ బడగల క్రియఁ గడ్సపనగము నేరేడు రావి వటమును నెలయున్. మార్క. ౪. ౧౪౩.

సీ. పేశ దనంగను నేరెడనంగను జంబూనమా

ఖ్యలై చనును...ఆం. భా. ౨. ౪౬.

నేరేటేఱు=జంబూనది.

గీ. నేరెటేటియిసుకల్ దెచ్చి నీరజాక్షు, సానఁ బట్టినరాపాడి చల్లి మెఱిఁగిపదను సుధ నిడ చేసెనో ప్రద్యుమ్నుఁడు, వీనిఁ గాకున్నఁ గలదె యీమేనికాంతి. మనుచ. ౨. ౩౬.

నేరెటిదీవి=జంబూద్వీపము.

ఉ. నేరెటిదీవి యేలుధరణీవరముఖ్యులు వీరె కంటె...నైష. ౫. ౪౬.

గీ. దీవులం దెల్ల నేరెడుదీవి లెస్స. హర. ౨. ౩.

నేర్పు(రుపు)కాఁడు. విశ. (√నేర్పు.) నేర్పరి, నేర్పుకలవాఁడు.

క. నీవ కడు నేర్పుకాఁడవు, గా వలవదు వీనిఁ గొన్ని గఱచితి మేముజ. భార. ఆది. ౬. ౩౨.

గీ. పూని యాప్రోలిమేలికడానికోట, వానియు నగడ్తపొందును వలనుమీఱఁ, జూడఁ జెప్పఁ గా నరిది యోఁ జూము వేయు, కన్నులును నోళ్లుఁ గలనేర్పుకాండ్రకైన. అచ్చ. రా. బాల. ౩౬.

నేఱా=నెఱా.

మ. రవిఁ దీవ్రద్యుతి యంద్రు పావకుని నేఱా మంటమా రంద్రు వారివిషంబుల్ పెనుపం జుక్రిందిదివియల్ రేరాజ ని న్నన్నచో. చంద్రా. ౫. ౭౩. (శ. ర. పా. 'ఔరా' ముద్రి. పా.)

నేల. వి. ౧. భూమి.

సీ. నేలయు నింగియుఁ దాళముల్ గాఁ జేసి మేపువ రేఁగి వాయించి యాడ. భార. విరా. ౨. ౧౩౪.

క. చుఱుకు గలయొక్కకోలను, గుఱిగాఁ దిగ ప్రోల్లు నేలఁ గూలిచి కడిమిజ, మెఱయు చు జేజేగములకుఁ, దఱుఁగని మే లిడినగిబ్బ త త్తడికొరసజ. నీలా. ౧. ౧౯. భార. విరా. ౨. ౧౩౪.

౨. భూలోకము.

శా. పాతాళంబును నేలయుం ద్రిదివముంబా లించుసిద్ధుండవో, నాతండ్రి ధ నను నేల వచ్చినజగన్నాథుండవో చెప్పవే. ఉ.హరి. ౨. ౧౩౩.

౩. ప్రదేశము, తావు.

వ...ధర్మనందనుపిఱుఁద నొక్కింత నేల యరిగి ...భార. ఆది. ౬. ౧౪౩.

వ...పటికంపురాచట్టునేలల నెట్టుకొని...మనుచ. ౩. ౨౧.

సీ...ఈప్రోకి నాయడ నేల నల్ల, యమునానదీ గహ్వరమున బకుం డను రక్కసుం డుండు ...భార. ఆది. ౬. ౨౬౪.

౪. దేశము.

ఆ. నేల ప్రాప్తమెంగి చాలుమానిని రణోద్య మ మొనర్చి కాక...భార. విరా. ౪. ౨౨౧.

శ్లో. దేశకాలౌ తు సంప్రేక్ష్య యోద్ధవ్య మితి మే మతిః. సం. భార. విరా. ౫౧. ౩.

౫. మన్ను. (చూ. నేలఁగలయు.)

నేలకుఁదెచ్చు=చంపు, పడఁగొట్టు.

మ...అవ్వీరు న్నవ్వ రాకో నేలకుఁదెచ్చి తా క్కరునిచే వాఁ డేల చిక్కుజ...భార. ద్రో. ౨. ౨౩౬.

నేలపాలుగఁజేయు=నశింపఁజేయు.

సీ. పాడి దొరంగి యప్పాపకర్ముఁడు పైచేఁ గాక చక్కటి త్రోడికయ్యమైన, లీల విమ్మం దఱ నేలపాలుగఁ జేయనే...భార. శల్య. ౨. ౩౨౫.

నేలలో వేదలు=ఇల్లువిడిచి బయటకు వెళ్లు.

చ. పదఁ బడఁ బాఱుచుజ వడఁకు బట్టినతల్లిని దండ్రి నేలలో, వెడలనితమ్ములఁగుఱ్ఱల నవీ

నకులాంగన నోరు తెఱచియు, తొడుకుల బం
టుఁ బైద విడఁ ద్రోవక ప్రోఁగ నెందు నీక
ప్పాల్పడినది కర్ణునాదలనె భారతసంహిత
నిల్చిచాడ్పునన్. పాండు. ౩. ౩౮.

నేలవాఱు=ప్రదేశమునుండి తొలఁగఁ జేయు, దూరముచేయు.

చ. నరవర మున్న చెప్పితి రణంబున నర్జునుఁ
డొద్ద నున్న నెవ్వరికిని ధర్మసూనుఁ బొదు
వంగ నశక్య మొకండు పార్థుఁ డుద్ధురుఁడయి
నేలవాపి కొని ద్రోర్బల మొప్పగఁ బోవఁ జా
లిననె, పెరవునఁ బట్టెదన్ బరులు వేవురు
మార్కొనినం గలంచెదన్. భార. ద్రో. ౧. ౨౧౩.

జ: నేలఁగలయు, నేలఁగలుపు, నేలఁబెట్టు, నేలకడిమి, నేలకన్నము, నేలకలిగొట్టు, నేలకాన్పు, నేలగాపరి, నేలగుమ్మడి, నేలగుమ్ముడు మొ.

నేలఁగలయు. అ. క్రి. (నేలన్ + కలయు.) -మంటిపాలగు- నశించు.

(చంద్రోపాలంభము.) సీ. మానక గుప్పించుమ
దనకోదండంబు నిష్ఠురతను దన్ను నేలఁ
గలయ. వరాహ. ౪. ౨౧.

ఆ. ఘోరశిలలవృష్టి గురియించె నొడలు వీఁగించి
యతఁడు వికటగిరులు గాఁడ, గురుతరద్రు
మముల గుదిగ్రుచ్చినట్లుగ, నిఖిలజంతుతతు
లు నేలఁగలయ. కళా. ౬. ౯౪.

నేలఁగల(లు)పు. స. క్రి. (√నేలఁగలయు.) నేలపాలుచేయు, ధ్వంసముచేయు.

సీ. అయ్యస్త్రమాశక్తి నద్భుతంబుగ నేలఁగ
లపి యుధిష్ఠిరువలను నిగుడ. భార. ద్రో.
౩. ౨౪౩.

సీ. బలసమేధితపలాశులఁ గాని పెఱపలాశులఁ
గొమ్ముచే నేలఁగలపఁ బోవు. గీ... వసునా
వరాహమూర్తి. దశా. ౩. ౭౦౫. ౮౦. శే. ౫౮.

గీ. నిద్రవోయెడుసుఖ మెల్ల నేలఁగలిపి, ప్రతి
దినంబును దాఁ జేయురత్నపూజ, శివుని పై
నుండకుండినఁ జింత నొంది, రాత్రి శివ
రాత్రిగా జాగరమ్ముఁ జేసె. కాశీ. ౩. ౧౧౫.
('పోఁగొట్టుకొను' అని భావము.)

నేలఁబెట్టు. స. క్రి. (నేలన్ + పెట్టు.) ౧. నేలపైనుంచు. ౨. నశింపఁజేయు.

సీ. చెలికటి సైకతములు పెన్కఁ బడ నొత్తె
నెత్తమ్మి నడుగులు నేలఁబెట్టె. బిల్హ. ౨.
౧౨౦. (రెండర్థములకు నిదియే ఉదాహరణము.)

నేలఁబెట్టి కాలరాచు=మిక్కిలిపీడించు.

గీ. కెఱయు సారసములు దమ్ము నేలఁబెట్టి కాల
రాచుచు నున్నాఁడు కలువలచెలి, కేతలఁ
బడఁజాల మిది రాహువేణి యనుచు, నతివ
పదములఁ బడె నన నడుగు లమరు. బిల్హ. ౨.
౧౧౪.

నేలకడప=నేలకడిమి.

ఆ. ఉప్పు చింతపండు నొప్పుమీఱిన నేల, కడప
వేళ్ళ నూరి యుడుకఁబెట్టి, చమర...తలపుం
డ్లు, మానిపోవు...(చికి. చి. ని.)

గీ. నేలకడపయుఁ బెన్నేరు నిలను జెలువు, వె
లయుపల్లెరువేళ్ళను వేఱు వేఱు, మేక
పాలును గొన ... స్త్రీపురుషరోహములు
దీఱు సిద్ధముగను. (చికి. చి. ని.)

నేలకడిమి. వి. (√నేల.) భూకదంబము. (శ.ర.)

నేలకలిగొట్టు. వి. (√నేల.) భూపాటలి. (శ.ర.)

నేలకాన్పు. వి. (నేల + కాన్పు.) భూపుత్రి, సీతాదేవి.

సీ. ప్రాగదపూరితము నలపురకర్పూరపుదిమ్మ, కాన
వేలమ రయా నేలకాన్పుఁగొమ్మ. అచ్చ. రా.
అరణ్య. ౯౨.

ఇళ్లే: నేలచూలి.

ఆ. నేల యేలుకొనెడు జోలి య దేటికి, నేల చూలిమీఁద నేల యాస. అచ్చ. రా. యు. ౩౯౪.

ఆ. నేలచూలి వెదక గాలిబిడ్డఁడు లోను, గాను గలిగినట్టికడిఁదికొమ్మ, మెకపుగములననుప... యయా. ౩. ౨౨.

నేలగాపరి. వి. (నేల + కాపరి.) రాజు.

సీ. అలగాపరి పూఁపు లచ్చటఁ దిగఁద్రోచి నేలగాపరులఁ దా నేలఁ గల్గె. అచ్చ. భా. ౧. ౫.

నేలగుమ్మడి. వి. (√ నేల.) భూమికర్కారువు॥.

సీ. నెగడు విదార్యాఖ్య నేలగుమ్మడి యన... ఆం. భా. ౨. ౭౪.

నేలగుమ్ముడు. వి. (√ నేల.) విదారి॥. (ఇది నల్ల నేలగుమ్ముడు, తెల్లనేలగుమ్ముడు అని ద్వివిధము. శ. ర.)

నేలగొలిమిడి. వి. (√ నేల.) గోలోమి॥. (శ. ర.)

నేలజమ్మి. వి. (√ నేల.) పిన్నజమ్మి, శమీరము॥. (చి. ని, శ. ర.)

నేలజేజే. వి. (√ నేల.) భూదేవుఁడు, బ్రాహ్మణుఁడు.

సీ. ఇటు నేలజేజేల కెలు కైనచెంగావినుద సంజఁ దగుకొండఁ జూచినాఁడ. నరస. ౫. ౨౨.

సీ. నీటూర నెదిరిన నేలజేజేదంటతే జెల్ల నడఁ చినగిట్టలెంక. అచ్చ. రా. అయో. ౯౩.

నేలతంగేడు. వి. (నేల.) చిన్నతంగేడు, అకు ల్యము॥.

సీ. ములువెంపలి ములుస్తె గలేజేరు గుంటగజ్జె రుసు దంతిబందారు నేల, తంగేడు...హంస. ౪. ౧౦.

నేలతాడి. వి. (√ నేల.) తాళమూలిక, ముసలి॥. (సానుస్వారమని చి. ని.)

సీ...బీఱ వెంగలింగకోఁదాడు నీఁదాడు ఖర్జూర మీఁత నేల, తాడి...హంస. ౪. ౧౧.

సీ...నేలతాడి యనంగ నెసఁగు ముసలి. ఆం. భా. ౨. ౫౧.

నేలతామర. వి. (√ నేల.) మెట్టతామర, స్థలపద్మి॥.

సీ. స్థలపద్మ మగు మెట్టతామర యన...నేల తామర యన...ఆం. భా. ౨. ౫౯.

సీ. దధియము క్రముగ నేలతామరఁ గొన...(చికి. చి. ని.)

నేలతాలుపు. వి. (√ నేల.) ౧. పర్వతము, భూధరము.

సీ. నేలతాలుపు రాచచూలిగాదిలికందు దొసఁగుచీకటిచాల్పుతోఁగల విందు. అచ్చ. రా. పీఠి. ౪.

౨. రాజు, భూధరుఁడు.

క. కలికపుమానిసి యని నీ, తలఁపున నిపు డల్లనేలతాలుపుమిన్నం, జులుకఁగఁ జూచెద వత నిశా, గెలువఁగ నీవంటివారికిం దర మగునే. అచ్చ. రా. యు. ౨౧.

నేలతీఁటకసింద. వి. (√ నేల.) కసిందలో నొకభేదము, వృక్షవిశేషము.

గీ. నేలతీఁటకసిందయుఁ గోల జెముడు, బొంతజెము డుల్లియును సదాముస్తె నెందలు, గాఁగలుగునట్టి చిఱుచెట్లఁ గాంచి యంత. హంస. ౪. ౧౦.

నేలతొళసి. వి. (√ నేల.) భూతులసి॥. (శ. ర.)

నేలన(స)మ(మి)లి. వి. (√ నేల.) పక్షివిశేషము.

సీ. కొక్కెరల్ కక్కెరల్ గువ్వలు వెలినెలనేలనెమళ్లును బోలుగలును. రసిక. ౧. ౫౪ ౧. ౧౧౫.

వ... మఱియుఁ గైదు కక్కెర కారుకోడి లావు క వెలిచ నేలనమలి డాబ గొంగడిగాఁడు మొదలగుపక్షులు పొదలుకొని యుండు పిట్టపట్లును... చంద్రా. ౨. ౭౪.

అ. పికిలి నేల నెమిలి పెనుగువ్వ బకదారి, పావు రాయి... ఆది యైనపక్షు లతఁడు దీర్చె. హంస. ౩. ౧౩.

నేలనేరేడు. వి. (√ నేల.) కాకినేరేడు, భూమి జంబుకి.

సీ... నేలనేరే డనఁగ... భూజంబునామంబు పొల్చు... ఆం. భా. ౨. ౪౭.

నేలపట్టి. వి. (నేల + పట్టి.) ౧. అంగారకుఁడు, భౌముఁడు. (శ. ర.) ౨. నరకాసురుఁడు. ౩. భూపుత్రి, సీత. (శ. ర.)

నేలపల్లటి(టీ). వి. (√ నేల.) పారావతవిశేషము.

సీ. పారావతం బగుఁ బావురాయి యనంగ... తద్భేదములుగాను దనరుచుండ ను నేలపల్లటి... అనంగ... ఆం. భా. ౨. ౭౫.

సీ. పావురములు నేలపల్లటీల్ కూకీలు... సుఁగటీ లనంగఁ బొల్చును గలరవములు... సాం. ని. తిర్య. ౪౭.

నేలపొన్న. వి. (√ నేల.) కోలపొన్న, అంఘ్రి పర్ణిక.

సీ. క్రోష్టుపుచ్ఛికయా నేలపొన్న, నా... ఆం. భా. ౨. ౫౫.

నేలమట్టము. విణ. (√ నేల.) నేలతో సమాన మైనది; నాశితము.

మ. దినసాథుం డుదయాద్రి శృంగమున కేతే నెల్లి... కూల్తు లంకాపురీ, ఘనసాలాదుల నేల మట్టము గ నాకఁపింప నక్తంచరుల్. భా. రా. యు. ౩౧౫.

సీ. ఊర్ధ్వాండకర్పరం బొరయు వింధ్యాద్రికూటంబులు నేలమట్టంబు సేసె. కాశీ. ౧. ౧౨౪.

గీ. దేవ యొకవానరుఁడు లీలావనంబు, నేలమట్టంబు చేసి యాఖిలవాల, మూఁచి యాడెడు తనుఁ జూచి కోఁచవాలు, రక్కసుల నొక్కి తోరణం బెక్కి నగుచు. రామా. ౬. ౨౦౩.

నేలమామెన. వి. (√ నేల.) వృక్షవిశేషము.

సీ. మామెనయును నేలమామెన యటికమామిడి దూలగోవెల మేఁకమేయు. గీ. నాకు నల్లేరు... హంస. ౪. ౧౦.

నేలమాలె. వి. (√ నేల.) భూగృహము, భూమిలోపలియిల్లు.

గీ. పాయముసఁ బెద్దవాఁ డొకబ్రాహ్మణుండు, లక్షణజ్ఞుండు సంగతలక్షణాంగి, నొక్క కన్నియఁ బెండ్లి యై యొరులగోష్ఠి, మరగ కుండంగ నఖి నేలమాలెఁ బెట్టి. కేయూర. ౩. ౨౧౩.

గీ. నేలమాలె నా భూమ్యంతరాలయమ్ము... ఆం. భా. ౨. ౧౭.

నేలమాలెలద్రవ్య=లోలోపల కట్టలపస్నా.

క. వెనిమిటియు నత్త వదినెలు, కనుఁగలిగి మెలఁగ వెడలఁగా నెడ లేమిం, దినదినమాఁ దత్తలోదరి, మనమున నే యిట్టి నేలమాలెలు ద్రవ్యా. శుక. ౨. ౫౦౭.

నేలములక. వి. (√ నేల.) వాఁకుడు, వార్తాకి.

సీ... నేలములక యనఁగ. గీ... సర్పాక్షి ప్ర బలు. ఆం. భా. ౨. ౫౭.

నేలమొలత్రాఁడు. వి. (నేల + మొలత్రాఁడు.) సముద్రము.

గీ. వచ్చె యవ్వేఁడివేలుపువంగడంపు, నేల మొలత్రాటినిండుకుందేటితాల్పు, మ్రోల విల్చె కరంబు ప్రేముడి దలిర్ప, వెరవుతోఁ బల్కెఁ గేలుఁదామరలు మొగిచి. అచ్చ. రా. యు. ౧౫౫.

నేలయడుగు. వి. (√నేల.) పాతాళము.

సీ. పాతాళ నామంబు... నేలయడు గనంగ వెగడుచుండు. ఆం. భా. ౧. ౧౪౫.

నేలయుసిరిక. వి. (√నేల.) భూధాత్రీ.

గీ... నేలయుసిరిక యన,నలరు భూధాత్రి... ఆం. భా. ౨. ౪౯.

నేలయెకిమీఁడు. వి. (నేల+ఎకిమీఁడు.) భూపతి,రాజు.

గీ ... ఓ నేఁ యెకిమిలకొలమసామి, చేతగు తుక కలపెద్ద చెంచువాని,యింటిచెంచెత చెలి మించుగుంటికెలని, పాలములోఁగలఁ జెలఁగు చెంచులము పేము. ఉ. రా. ౭. ౩౯౮.

నేలయేలుదంటు. వి. (√నేల.) క్షత్రియుఁడు, రాజు.

సీ... నేలయేలుదంటులు... గీ... రెండవ వంగడంపుఁ, బలువు లన క్షత్రియాఖ్య లౌ ... సాం. ని. మాన. ౨.

నేలరేగు. వి. (√నేల.) భూబదరీ. (శ. ర.)

నేలఱేఁడు. వి. (నేల+ఱేఁడు.) రాజు.

గీ. అట్టిప్రోలికి నేలిక యగుచు నెల్ల, నేల ఱేఁడులు దను మేలు మే లటంచుఁ, బొగడ మగఁడనికలుముల వెగడి పజలఁ, దద్దయును సాఁకుకొనుచుండు దశరథుండు. అచ్చ. రా. బాల. ౪౪.

చ. కనుఁగొని నేలఱేఁడు మతికాంచనభూష ణభూషితుఁ డ్మృగా,జినయుతు... చెన్న. ౫. ౩౦౪.

నేలవెలఁగ. వి. (√నేల.) భూవెలఁగ.

సీ... నేలవెలఁగాకు నొనరంగఁ గలుకఁగాఁజేసి పోసినమాను...(చికి. చి. ని.)

నేలవేము. వి. (√నేల.) భూనింబము.

సీ. శ్రీ తులసియు సంబరేను నేలుసిరికీశ్వరి నేలవే మూటి చల్లగడ్డ. హంస. ౪. ౧౦.

సీ... నేలవే మనంగ భూనింబ మొప్పు. ఆం. భా. ౨. ౫౦.

నేలవేలుపు(ల్పు) వి. (నేల+వేలుపు.) భూదేవుఁడు, బ్రాహ్మణుఁడు.

గీ.అప్పు డెకిమీఁడు తతిచెయ్వు లమరఁ దీర్చి, పేదలకు నేలవేలుపుఁ బెద్దలకును, బొసఁగ రొక్కంబుఁ దొడవులుఁ బుట్టములును, దొడుకులు నొసంగి కుదిరెలు గడపి యంత. అచ్చ. రా. బాల. ౭౪.

గీ. నేలవేలుపు మొదలిటి నేమములకు, నెలవు చెలువపుగమి కాఁడు పిలుకుమారి, రక్కసు లచేతఁ బోయినయక్కచునకు, వగవ కట్టోరు మె యెల్ల నొగుఁ దండ్రి. యయా. ౩. ౧౩౧.

ఆ. పుడమి తోనితోడఁ బోడర నీలా వేమి, ఖరునికంటె నల్లగట్టుఁడు, కొడుకుకంటె గండ్ర గొడ్డలితాలుపు,నేలవేల్పుకంటె నెఱ యె చెపుమ. అచ్చ. రా. యు. ౩౩.

నేలసంపెఁగ. వి. (√నేల.) భూమిచంపకము. (శ. ర.)

నేలాఁపు. వి. (నేల+ఆఁపు.) శ్యేనవిశేషము, ఒకవిధమగుడేగ.

సీ. నేలనెమళ్లు నేలాఁపుడేగల విడిచి యేపు నఁ బీఁచ మడపఁజేసి. రసిక. ౧. ౧౧౫.

నేలుసిరిక. వి. (నేల+ఉసిరిక.) భూమ్యామలకి.

సీ. శ్రీతులసియు సంబరేను నేలుసిరికీశ్వరి నేలవే మూటి చల్లగడ్డ. హంస. ౪. ౧౦.

నేలొద్ది. వి. (√నేల.) వృక్షవిశేషము.

సీ. కలజువ్వి వావిలి గండువావిలి యేఱుమద్ది మద్దియును నేలొద్ది యొద్ది. హంస. ౪. ౧౧.

నేవడము = నేవళము. (శ. ర.)

నేవము = నెవము. (శ. ర.)

నేవళము = నేవడము, నేసారము. వి. లలంతికా విశేషము, మణులుగ్రుచ్చినహారము.

క. తనయయంత నేవళం బొకఁడనుకూలతఁ గేలఁ బుచ్చి యాసతియుఱకక్, వనరుహాలోచనుఁ డిడె లోఁచనపారణ సేసెఁ దత్ప్రసాదనదృష్టిక్. హరి. ఉ. ౪. ౧౭౦.

గీ. పసుపునుమంజాయ మైకాంతిఁ బసలుసేయ, నేవళంబులు చనుదోయినిగ్గుఁ జెనక, ద్రవిడబాలవిలాసినీతతులు మెఱయ, సిరికిఁ బట్టైనకాంచికాపురమునందు. విక్ర. ౩. ౧౧౬.

సీ. పదకము తాళి నేవళము...అన లలంతి, కావిశేషం బగు...ఆం. భా. ౨. ౧౪౯.

నేష్ట. సం. వి. ఋ. పుం. సోమయాగమందలి ఋత్విజులలో నొకఁడు.

నేష్టువు. సం. వి. ఉ. పుం. లోష్టము, మట్టిపెల్ల. (వాచ.)

నేస్తకత్తె. విణ. (నేస్తము + కత్తె.) స్నేహితురాలు. (శ. ర.)

నేస్తకాఁడు. విణ. (నేస్తము + కాఁడు.) మిత్త్రుఁడు.

సీ...నేస్తకాఁడు సంగడికాఁడు నాఁగను మిత్త్రునినామము లగు. ఆం. భా. ౨. ౧౭౬.

గీ. కటికిచీకటినెఱి నేస్తకాఁడు దాను, ధృతియొసంగఁగ దానిమందిరముఁ జేర. శుక. ౨. ౧౭౯.

వ...జంటనేస్తకాండ్ర చేతితిపిరికిన్నెరలబంగు టింగురులును... ప్రబంధ. ౩౭.

నేస్తము. వి. చెలిమి, మైత్రి.

చ. నిలకడ సున్న వావి నహి నేస్తము సాస్తి ...కాంత లదాంత లింతయుఁ. శశాం. ౪. ౧౩.

శా. ఆనీలాలక బాణకన్యక కు బాహ్యప్రాణమో నాఁగ నెం, తే నేస్తం బొనరించి యున్న దగుటం దీనాననాంభోజ యై, గ్లాని బొందుచునున్నయారమణి యాకారంబు వీక్షించి ...అని. ౨. ౭౩.

సీ. నెయ్యము నేస్తము ... గీ...అనఁ బరఁగుచుండును మిత్త్రభావంబు...ఆం. భా. ౨. ౧౭౬.

విణ. మిత్త్రుఁడు.

ఉ. ...వ యెఱింగి యుండుదువు నేనును జంద్రుఁడు నేస్త మాటయుక్. శశాం. ౪. ౪౧.

జః నేస్తకత్తె, నేస్తకాఁడు, నేస్తి, నేస్తుఁడు.

నేస్తి. విణ. నేస్తురాలు. (√ నేస్తము.) నేస్తకాఁడు.

సీ. నేస్తి గాదిలి చెలి నేస్తకాఁడు సఖుఁడు, సంగాతి చెలికాఁడు సంగడీఁడు, నాఁగఁ బేరులు మిత్రున కగు...వేంక. మాన. ౨౬.

సీ. సురఁటివీచులఁబుట్టుదొర మెప్పు రానేస్తి జంగిలియొఱకు మాసంగడీఁడు. ప్రబంధ. ౧౭౦. సాం. ని. మాని. ౫.

నేస్తుఁడు. విణ. (√ నేస్తము.) మిత్త్రుఁడు, స్నేహితుఁడు.

శా. ఈలా గూరక నన్ను నొత్తెను నతం డేలాగు నేస్తుం డగుక్. అచ్చ. భా. ౪. ౭౧.

నేస్తురాలు. వి. (√ నేస్తము.) స్నేహితురాలు. (శ. ర.)

నేహారము = నేవళము. వి. మణులు గ్రుచ్చినహారము.

ద్వి. లోహాచితంబులై లోలత మించు, నేహారంబులు గొన్ని పీలాల నమర, గుత్తంబుగా రాత్రిఁ గొనిపోయి దీప్తదీప్తిఁ గ్రమ్మెఱుఁగుల శిఖరపఁ బట్టి. ద్వి. హరిశ్చ. ఉ. ౧౬౩౭ ఖం.

## నై

నైకచరము. సం. విణ. (అ. ఆ. అ.) ఒంటిగా సంచరింపనిది, గుంపుగూడి తిరుగునది. (మేఁక, పంది మొ.)

నైకటికుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) సమీపమున నున్నవాఁడు. వి. అ. పుం. -భిక్షాదులకై గ్రామాదులదాపున వసించువాఁడు- భిక్షువు, యతి.

నైకట్యము. సం. వి. అ. న. సామీప్యము, దాపు.

నైకభేదము. సం. విణ. (అ. ఆ. అ.) అనేకభేదములు కలది. (చిత్తరువు మొ.)

నైకమాయుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) అనేకమాయలు కలవాఁడు. వి. అ. పుం. పరమేశ్వరుఁడు.

నైకము. సం. విణ. (అ. ఆ. అ.)- ఏకము కానిది- అనేకము, పెక్కు.

నైకరూపుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) నానారూపములు కలవాఁడు. వి. అ. పుం. పరమేశ్వరుఁడు.

నైకాత్మ(ము.) సం. విణ. (న్). ౧. అనేకస్వరూపములు కలది. ౨. పెక్కులాత్మలు కలది. వి. న్. పుం. పరమాత్ముఁడు. (రూ. నైకాత్ముఁడు.)

నైకృతికుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) శాఠ్యముతో జీవించువాఁడు, వంచకుఁడు.

నైగనిగ్యము. సం. వి. అ. న. నిగనిగలాడుట.

నైగమము. సం. విణ. (అ. ఈ. అ.) ౧. వేదసంబంధమైనది. ౨. పట్టణసంబంధమైనది. 3. వణిక్సంబంధమైనది. వి. అ. న. ౧. ఉపనిషద్రూపమగు వేదభాగము, వేదాంతము. ౨. నయము, నీతి.

నైగమికము. సం. విణ. (అ. ఈ. అ.) ౧. నిగమమున ఉన్నది. ౨. నిగమమువలన కలిగినది. 3. నిగమమునకు వ్యాఖ్యానమైనది.

నైగముఁడు. సం. వి. అ. పుం. ౧. నిగమవిదుఁడు, వేదార్థము తెలిసినవాఁడు. ౨. నాగరుఁడు, పౌరుఁడు. 3. వణిజుఁడు, వర్తకుఁడు.

నైఘంటుకము. సం. విణ. (అ. ఈ. అ.) నిఘంటువును గుఱించి రచింపఁబడినది. (గ్రంథము.) వి. అ. న. వేదనిఘంటుగ్రంథ ప్రథమకాండము.

నైచికము. సం. వి. అ. న. గోశిరః ప్రదేశము, ఆవుతలభాగము.

నైచికి. సం. వి. ఈ. స్త్రీ. ఉత్తమమైనయావు.

నైచ్యము. సం. వి. అ. న. ౧. నీచత్వము. ౨. (భక్త్యాదులచే కలుగు) నమ్రత్వము.

నైజము. సం. విణ. (అ. ఈ. అ.) ౧. స్వకీయము, తనది. ౨. స్వాభావికము, సహజము.

నైతలము. సం. వి. అ. న. నరకము.

నైతలసద్ముఁడు. సం. వి. న్. పుం. యముఁడు.

నైత్యకము. సం. విణ. (అ. ఈ. అ.)=నైత్యికము.

నైత్యము. సం. విణ. (అ. ఈ. అ.) నిత్యము చేయఁదగినది. (దానకర్మాది.) వి. అ. న. నిత్యత్వము, శాశ్వతత్వము.

నైత్యశబ్దికుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) శబ్దము నిత్యమని వాదించువాఁడు. (పూర్వమీమాంసకుఁడు.)

నైత్యికము. సం. విణ. (అ. ఈ. అ.) ౧. నిత్యమును కలుగునది, ఎప్పుడును సంభవించుచుండునది. ౨. నిత్యమును చేయవలసినది. (కర్మము.)

నైదాఘము. సం. విణ. (అ. ఈ. అ.) నిదాఘసంబంధమైనది, గ్రీష్మసంబంధమైనది. వి. అ. పుం. నిదాఘము, వేసఁగి.

నైదానికుఁడు. సం.విణ.(అ.ఈ.అ.) ౧. (రో॰గ) నిదానము నెఱిఁగినవాఁడు. ౨. (రో॰గ) నిదాన ప్రతిపాదక మగు గ్రంథమును చదువువాఁడు.

నైదానుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) రో॰గ మూలకారణము నెఱిఁగినవాఁడు.

నైదేశికుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) -నిదేశమును చేయువాఁడు-కింకరుఁడు, సేవకుఁడు.

నైధనము.సం. విణ. (అ.ఈ. అ.) మరణసంబంధమైనది. వి. అ. న. ౧. నిధనము, మరణము. ౨. (జ్యోతి.) లగ్నమునకు అష్టమస్థానము. ౩. జన్మనక్షత్రమునకు ఏడవదియు, పదునాఱవదియు, ఇరువది యైదవదియు నగు నక్షత్రము.

నైధానము. సం. విణ. (అ. ఈ. అ.) ౧. నిధానసంబంధమైనది, నిధిసంబంధమైనది. ౨. నిధాన సాధ్యమైనది. (వాచ.)

నైపథ్యము సం= నేపథ్యము.

నైపము. సం. విణ. (అ. ఈ. అ.) ౧. నీపసంబంధమైనది. ౨. నీపవికారమైనది.

నైపాతికము సం. విణ. (అ. ఈ. అ.) ప్రస్తావవశమున చెప్పఁబడినది. (అ. ని.)

నైపాళము. సం. విణ. (అ. ఈ. అ) ౧. నేపాళదేశసంబంధమైనది. ౨. నేపాళదేశమునఁ బుట్టినది. వి. అ. పుం. నేపాళనింబము, నేపాళపువేము?.

నైపాళి. సం. వి. ఈ. స్త్రీ. ౧. నవమల్లిక, విరజాజి? ౨. మనశ్శిల, మణిసిల. ౩. శేఫాలిక, నల్లవావిలి?. ౪. నీలి?.

నైపాళికము. సం. విణ. (అ. ఈ. అ.) నేపాళదేశమునఁ బుట్టినది. వి. అ. న. రాగి.

నైపుణము. సం. వి. అ.న. నిపుణత్వము, కౌశలము.

నైపుణి. సం. వి. ఈ. స్త్రీ. నిపుణత్వము,కౌశలము.

నైపుణ్యము. సం= నైపుణము.

నైబిడ్యము. సం. వి. అ. న. నిబిడత్వము, దట్టముగానుండుట. ౨. (సం॰గీ.) సంకాశప్రాత్కార గుణభేదము, నిబిడముగా ఎడతెగనిధ్వనివచ్చునట్లు పిల్లనగ్రోవి మొదలగునవి ఊదుట.

శ్లో. నైబిడ్యం ప్రౌఢతా చాపి సుస్వరత్వంచ తీక్ష్ణతా,మాధుర్య మితిషం చామీప్రాత్కారేషు గుణాః స్మృతాః॥

నైభృత్యము. సం. వి. అ. న. -నిభృతభావము- ౧. అచాంచల్యము, నిశ్చలముగానుండుట. ౨. అడఁకువ, వినయము ౩. రహస్యము.

నైమంత్రణకము. సం. వి. అ. న. ఆతిథ్యము, అతిథిసత్కారము.

నైమయుఁడు సం. వి. అ. పుం. -నిమయము- (సరకుల వినిమయము) వలన జీవించువాఁడు- వర్తకుఁడు, బేహారి.

నైమిత్తము. సం. విణ. (అ. ఈ. అ.) ౧. నిమిత్తసంబంధమైనది. ౨. నిమిత్తమువలనఁగలిగినది. వి. అ. న. శకునగ్రంథముయొక్క వ్యాఖ్యానము.

నైమిత్తికము. సం. విణ. (అ. ఈ. అ.) ౧. నిమిత్తమువలనఁగలుగునది. ౨. నిమిత్తమునాశ్రయించి చేయఁదగినది, నిమిత్తమునుబట్టి చేయఁబడినది. (అద్రికాది.) వి. అ. న. -నిమిత్తమును (కారణమును) అనుసరించి వచ్చినది- కార్యము, ఫలము.

శ్లో. ఉదేతి పూర్వం కుసుమం తతఃఫలం, ఘనోదయః ప్రాక్తదనంతరం పయః, నిమిత్తనైమిత్తికయో రయంక్రమః, తవప్రసాదస్య పురస్తుసంపదః. శాకుం. ౭. ౩౦.

౨. ఒకానొకనిమిత్తమును బట్టి ఆయాకాలమునఁ జేయఁబడు కర్మము. (కర్మము- నిత్యము, నైమిత్తికము, కామ్యము అని మూఁడువిధములు.)

నైమిత్తికుఁడు. సం. వి. అ. పుం. నిమిత్తములను చక్కఁగాఁ దెలిసినవాఁడు; శకునశాస్త్రము తెలిసినవాఁడు (జోస్యుఁడు, సెం.)

నైమిశము. సం. వి. అ. న (బ్రహ్మ సృజించి విడిచినమనోమయచక్రముయొక్క నేమి ఏస్థలమున ఊడిపడిపోయినదో అట్టిపుణ్యారణ్యము నైమిశము.)

సూతుఁడు శౌనకాదిమహర్షులకు పురాణాదులు వినిపించినపుణ్యారణ్యము.

శ్లో. ఏతన్మనోమయం చక్రం మయా సృష్టం విసృజ్యతే, యత్రాస్య శీర్యతే నేమి స్స దేశ స్తపస శ్శుభః ... ప్రయయు స్తస్య చక్రస్య యత్ర నేమి ర్వ్యశీర్యత, తద్వనం తేన విఖ్యాతం నైమిశం మునిపూజితం. (వాయుపు. వాచ.)

నైమిషము. సం. విశే. (అ.ఈ.అ.) ౧. నిమిష సంబధమైనది. ౨. నిమిషమాత్ర ముండునది. వి. అ. న.- సూతుఁడు శౌనకాదిమహర్షులకు పురాణాదులు వినిపించిన పుణ్యారణ్యము (ఇందు నిమిషమాత్రముచే దానవబలము హతమైనది.)

శ్లో. ఏవం కృత్వా తతో దేవో మునిం గౌరముఖం తదా, ఉవాచ నిమిషే ణేదం నిహతం దానవం బలమ్, అరణ్యే౽స్మిం స్తత స్త్వేత న్నైమిషారణ్యసంజ్ఞితం, భవిష్యతి యథార్థం వై బ్రాహ్మణానాం విశేషకం. (వరా. వాచ.)

నైమేయము. సం. వి. అ. పుం. వినిమయము సరకులమాఱుపు.

నైయంకవము. సం. విశే. (అ.ఈ.అ.) న్యంకు సంబంధమైనది, ఇఱ్ఱికి సంబంధించినది. (చర్మాది.)

నైయగ్రోధము. సం. విశే. (అ.ఈ.అ.) న్యగ్రోధ వృక్షసంబంధమైనది. (దండాది.) వి. అ. న. న్యగ్రోధఫలము, మఱ్ఱిపండు.

నైయత్యము. సం. వి. అ. న. ౧. నియతముగా నుండుట, ౨. ఆత్మనిగ్రహము.

నైయమికము సం. విశే. (అ. ఈ. అ.) నియమప్రాప్తము, నియమముచే సంభవించునది. (ఋతుకాలమున భార్యను గలియుట సెం.)

నైయాయము. సం. విశే. (అ.ఈ.అ) ౧. న్యాయ సంబంధమైనది. ౨. న్యాయశాస్త్రమునకు వ్యాఖ్యానమైనది.

నైయాయికుఁడు. సం. విశే. (అ.ఈ.అ.) న్యాయశాస్త్రము నెఱిఁగినవాఁడు, న్యాయశాస్త్రమును జదివినవాఁడు, తార్కికుఁడు.

నైయాసికుఁడు సం. విశే. (అ. ఈ. అ) అంగన్యాసకరన్యాసమాతృకాన్యాసాదులు తెలిసిన వాఁడు.

నైరంతర్యము సం. వి. అ. న. -నిరంతరత్వము- ౧. ఎడతెగకుండుట, విచ్ఛేదములేమి. ౨. ఎడము లేకుండుట, మిక్కిలి క్రిక్కిఱిసి యుండుట.

నైరపేక్ష్యము. సం.వి.అ.న. -నిరపేక్షత్వము- అపేక్ష లేకుండుట, కోరిక లేకుండుట.

నైరర్థ్యము సం. వి. అ. న. -నిరర్థకత్వము- ౧. ప్రయోజనము లేకుండుట. ౨. అర్థము లేకుండుట.

నైరాశ్యము. సం. వి. అ. న. -నిరాశత్వము- ౧. ఆశలేనితనము. ౨. ఆశ లుడుగుట, ఆశ వదలుకొనుట.

నైరుక్తికుఁడు. సం. వి. అ. పుం. నిరుక్తమును -వేదాంగభేదమును- దెలిసినవాఁడు.

నైరుక్తుఁడు. సం. = నైరుక్తికుఁడు.

నైరుజ్యము. సం. విణ. (అ. ఈ. అ.) రోగములులేకుండుట, ఆరోగ్యము.

నైరూహికము. సం. విణ. (అ. ఈ. అ.) ఊహము లేక చేయఁబడినది, విమర్శము (తత్త్వనిర్ణయము) చేయకయే ఆచరింపఁబడినది. వి.అ. పుం. వస్తికర్మభేదము.

నైరృతము. సం. విణ. (అ. ఈ. అ.) ౧. నిర్ఋతికి సంబంధించినది. ౨. నిర్ఋతిదేవతాకము. (పశువు మొ.) వి. అ. న. మూలనక్షత్రము.

నైరృతి. సం. వి. ఈ. స్త్రీ. దక్షిణపశ్చిమముల నడిమిదిక్కు.

నైరృతుఁడు. సం. వి. అ. పుం. ౧. -అధర్ముని భార్య యగునిర్ఋతియొక్క సంతతివాఁడు -రాక్షసుఁడు. ౨. నిర్ఋతి, దక్షిణపశ్చిమ దిక్పాలకుఁడు.

నైర్గుణ్యము. సం. వి. అ. న- నిర్గుణభావము- ౧. గుణములులేమి. ౨. సద్గుణములు లేకుండుట. ౩. సత్త్వాదిగుణములు లేమి.

నైర్ఘృణ్యము. సం. వి. అ. న- నిర్ఘృణత్వము- ఘృణలేమి, కనికరములేకుండుట.

నైర్దేశికుఁడు. సం. వి. అ. పుం. -నిర్దేశమును (ఆజ్ఞను) చేయువాఁడు- భృత్యుఁడు, సేవకుఁడు.

నైర్మల్యము. సం. వి. అ. న. ౧. నిర్మలత్వము, పరిశుద్ధత. ౨. భోగ్యవస్తువులందలివైరాగ్యము.

నైర్వాహికుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) ౧. నిర్వాహకుఁడు, నిర్వహించువాఁడు. ౨. (జలాదులను) వెలిచికొని పోవువాఁడు.

నైల్యము. సం. వి. అ. న. నీలత్వము,నల్లఁదనము.

నైవాసికము. సం. విణ. (అ. ఈ. అ.) నివాసమునకుఁ దగినది. (ఇల్లు మొ.).

నైవేద్యము. సం. వి. అ. న. నివేద్యము, దేవతలకు నివేదింపఁదగిన వస్తువు.

నైవేశము. సం. విణ. (అ. ఈ. అ.) ౧. వివాహమువూలమున లబ్ధమైనది. ౨. వివాహసంబంధమైనది. ౩. గృహసంబంధమైనది.

నైవేశికము. సం. విణ. (అ. ఈ. అ.) ౧. వివాహార్థ మియ్యఁబడునది (నగలు మొ.) ౨. గృహోపకరణము.

నైశము. సం. విణ. (అ. ఈ. అ.) ౧. నిశాసంబంధమైనది, రాత్రిది. ౨. రాత్రియందు పుట్టినది. ౩. రాత్రియం దుండునది.

నైశికము. సం=నైశము.

నైశ్చల్యము. సం.వి.అ. న. నిశ్చలత్వము, చలింపమి.

నైశ్చిత్యము. సం. వి. అ. న. నిశ్చితత్వము, నిశ్చయము.

నైశ్శ్రేయసము. ~~నిశ్శ్రేయసము~~ సం. విణ. (అ.ఈ.అ.)-నిశ్శ్రేయసమునకు (ముక్తికి) హితము- ౧. ముక్తి గలిగించునది. ౨. ముక్తిసంబంధమైనది. ౩. శుభము కలిగించునది, శుభమునకు సాధన మగునది. ౪. శుభసంబంధమైనది.

నైశ్శ్రేయసికము. సం=నైశ్శ్రేయసము.

నైషధీయము. సం. విణ. (అ. ఈ. అ.) నైషధునకు (నలునకు) సంబంధించినది.

నైషధుఁడు. సం. వి. అ. పుం. ౧. నిషధదేశపు రాజు. ౨. నలుఁడు. ౩. నిషధదేశపువాఁడు.

నైషాదకము. సం. విణ. (అ. దకా. అ.) నిషాదుఁడు సిద్ధము చేసినది. (ధాన్యము మొ.)

నైషాదము. సం. విణ. (అ. ఈ. అ.) ౧. నిషాదసంబంధమైనది. ౨. నిషాదునిసంతతి.

నైషాదికుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) నిషా

దుసిసంతతివాఁడు.

నైష్కర్మ్యము. సం. వి. అ. న. ౧. శాస్త్రప్రకారము విహితకర్మములను విడుచుట, కర్మత్యాగము; కర్మఫలత్యాగము. ౨. పని చేయకుండుట, నిర్వ్యాపారత్వము, సోమరితనము.

నైష్కశతికము సం. విణ. (అ. ఈ. అ.) నూఱు నిష్కములపరిమాణము కలది. ౨. నూఱు నిష్కములకు కొనఁబడినది.

నైష్కించన్యము. సం. వి. అ. న. -నిష్కించనత్వము- కొంచెమైనను లేమి, మిక్కిలి పేదఱికము.

నైష్కికము. సం. విణ. (అ. ఈ. అ.) ౧. నిష్కమునకు కొనఁబడినది. ౨. నిష్కవికారమైనది, నిష్కముతో చేయఁబడినది.

నైష్కికుఁడు. సం. వి. అ. పుం. కోశాధ్యక్షుఁడు, టంకసాలయధికారి.

నైష్క్రమణము. సం. విణ. (అ. ఈ. అ.) ౧. నిష్క్రమణమున - శిశువును గృహము నుండి తొలుసారి బయటికి తీసికొనివెళ్లునపుడు- ఈయఁబడునది. ౨. నిష్క్రమణకాలమున చేయఁదగినది. (సంస్కారము, పదార్థము మొ.)

నైష్ఠికము. సం. విణ. (అ. ఈ. అ) ౧. నిష్ఠకలది, ఆసక్తము. ౨. నిశ్చితము, నిష్కృష్టము. ౩. అంత్యకాలమున చేయఁదగినది, మరణకాలమున చేయవలసినది. (కర్మము మొ.)

శ్లో. శ్రుతదేహవిసర్జనః పితుః చిరమశ్రూణి విముచ్య రాఘవః, విదధే విధిమస్య నైష్ఠికం, యతిభిస్సార్ధమనగ్నిమగ్నిచిత్. సం. రఘు. ౮. ౨౫.

౪. స్థిరమైనది, నిలుకడ గలది.

నైష్ఠికుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) ఆసక్తుఁడు, నిష్ఠ కలవాఁడు. వి. మరణపర్యంతము బ్రహ్మచర్యమును పూని గురుకులమున వసించు బ్రహ్మచారి. (స్మృతి. ఉపకుర్వాణుఁడు.)

నైష్ఠుర్యము. సం. వి. అ. న. -నిష్ఠురత్వము- ౧. కాఠిన్యము ౨. పారుష్యము, పరుసఁదనము.

నైసర్గికము సం. విణ. (అ. ఈ. అ.)-నిసర్గాగతము- స్వభావమువలన వచ్చినది, స్వాభావికము.

నైస్త్రింశికుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) నిస్త్రింశము (కత్తి) ఆయుధముగాఁగలవాఁడు, కత్తిని చేఁబూని పోరువాఁడు.

నైస్పృహ్యము. సం. వి. అ. న. నిస్పృహత్వము, ఇచ్ఛలేమి.

నైస్స్వము. సం. విణ. (అ. ఈ. అ.) నిస్స్వుని సంబంధమైనది. వి. అ. న. నిస్స్వత్వము, దారిద్ర్యము.

నైస్స్వ్యము. సం. వి. అ. న. నిస్స్వత్వము, దారిద్ర్యము.

## నొ

నొంచు. స. క్రి. (√నొచ్చు.) ౧. (శరీరమును గాని, మనస్సును గాని) నొచ్చునట్లు చేయు, నొప్పించు, బాధించు.

ఉ. నొంచినఁ గెంపుసొంపునఁ గనుంగవ యొప్పఁగ నూతుఁ ద్రుంచి విల్, ద్రుంచి తురంగ గక్త్రములఁ దూపులు నించి యలంచి మేను నొప్పించిన... భార. ద్రో. ౨. ౩౪.

గీ. చంపె నత్తెఱఁగుల్లంబు నొంపకున్న. భార. స్త్రీ. ౧. ౧౫౪.

చ. కరితురగాదిఘట్టనయు గాలియు నొంపదె యొంటి యున్నయత్తఱవును... భార. ఉద్యో. ౨. ౨౨. (ఇట పడఁ జేయు అని భావము.)

నొగ. వి. (క. నొగ. త. నుగమ్.) యుగంధరము, బండికాఁడి కట్టుకఱ్ఱ. (కొన్నిబండ్లకు చట్రము ప్రక్కపట్టెల క్రిందనుండి పొడువైన రెండు వెదురుబొంగులు కట్టి, వానిని మోకులతో దగ్గఱగా లాగి గట్టిగాబిగింతురు. ఆబొంగులచివర కాఁడి కట్టుదురు. అవి రెండగుటచే నొగలు అనియు వాడుక.)

చ. వగపును గోపముం గదుర వైరిబలంబు ద
లంకఁ జేరుపై, నొగ నొగ దాఁకఁగాఁ
బఱపి నుగ్గుగఁ గౌరవనాథు సేన...భార. భీష్మ. ౨. ౩౩౧.

క. గగనమున కెగసి యరదము, నొగ తెగి పడ
వ్రేసి ఖడ్గమాతనగతు లొప్పఁగఁ దిరిగి తుర
గములఁ దన,మగతన మమరంగ యదుకుమా
రుఁడు వ్రేసెన్. ఉ. హరి. ౫. ౨౫౪.

క. ఒగి విల్లు నూతుతలయుం, దెగి పడ నొక
టొకటు హయలు ద్రెళ్ల నిరుగడన్, మొగి రెం
ట మూఁట నిరుకులం, నొగలు విఱుగ నొక
టు వాని నో నేయుటయున్. భా.రా.అర. ౧. ౨౩౫.

సీ. నొగలపై నున్నకృష్ణుని మేనినునుఁజాయ
హరినీలకాంతివిస్ఫురణ గాఁగ. గీ...విజయ
రోహణాద్రి వెడలి వెలిఁగె. భార. భీష్మ. ౧. ౧౦౬. పారి. ౨. ౭౧.

సీ. నొగ యనఁగా నెంచఁ దగు యుగంధర
సంజ్ఞ...ఆం.భా. ౨. ౨౦౩.

నొగిలించు=నొగుల్చు స. క్రి. (√నొగులు)
(బాధించు, నొగులఁజేయు.)

క. శేరాజుకాఁతిఁ గ్రోలుచ,శోరికలన్ మేఘ
పటలి కుతిలపఱచిన, ట్లా రాజుఁ జూడఁగా
మము, నైరావతి వచ్చి కటకటా నొగిలిం
చెన్. శరాహ. ౪. ౧౩.

సీ. చిగురుఁ గెరడు మోవి నొలిగించి పలుగం
పు లలరఁజేయుచుఁ డేన లానియాని. ఉ. రా. ౪. ౨౧౪.

(పగులుచు, ముక్కలుచేయు)

వ...శిరంబులు నొగిలించియు...ఉ. హరి. ౧. ౧౪౭.

నొగులు అ. క్రి. (త. నో.) ౧. నొచ్చు, నొప్పిచెందు, బాధనొందు.

ఆ. ఇన్నిసంకటముల నిబ్బంగి సొంతయు,
నొగులుచిత్తవృత్తినొవ్వ దీర్చ, పెజ్జ వీవ
కావె వే యేల యొఁతి, నడపఁ దలఁచి తది
య నాకుఁ బ్రియము. భార. ఉద్యో. ౩. ౨౬.

గీ...నాంథోగృహిణి రామిఁ బడుక మరుఁడు,
వెడవెడ నా యార్చ నొగిలి రజ్జడిని గృ
హులు. ఆము. ౪. ౧౨౪.

సీ. శ్యామంబు బలసినఁ గడచనునన్నంబు భుజి
యింప దొరకమిఁ బ్రజలు నొగిలి,యడ
వులఁ బడి యాకు నలము మెక్కుచు...
దశ. ౧౦. ౯౮.

౨. వాడు; నలఁగు.

సీ. పగలింటికి బెండ నొగిలినకుముదిని సిశిరో
చిఁ గని వికసిల్లునట్లు. కు. సం. ౭. ౯౪.

చ. శివుదృఢముష్టిచే నొగిలి శ్రీహరితోపగసా
ధిమగ్నతం, జివికివప్రాఁశవి ల్లొకటి సద్దము
నం ది డుకొన్నమావిదే, హవిభుఁడు... దం.
రా. ౩. ౧౪౬.

వ...కుండలికూర్మవిభులశిరంబులు వీఁపును నొ
గుల దిగులు పుట్టి నిఖిలభువనవాసులు భువ
నంబులకు భద్రంబు గాపుత మని...హరి.
ఉ. ౨. ౬౧.

ద్వి.నొగిలె నెమ్ములు చాల నొచ్చె మస్తకము.
ద్వి. హరిశ్చ. పూ. ౧౩౧౯ పం.

౩. వికలమగు.

క. భువి పగిలెన్ రవి నొగిలెన్, దివి పిగిలెన్

దిగ్గజములధృతిసన్నగిలెఁజ...భూరిభేరీభాంకారమునన్. గా. వి. ౨. ౪౨.

గీ. ఘనజరాభూతహుంకృతి నెనయ డగ్గు, నొఱల సద్వృత్తి కర్ణవిస్ఫురణ నొగుల. దశా. ౨. ౧౩౮.

వి. ౧. వికలమగుట. (శ. ర.) ౨. నొప్పి. బాధ, వ్యథ.

క. తనువు నొగిలించుకంటెను, మనము నొగుల్చుటయె హింస మదిఁ బరికింపన్, దనువునొగులవుడ తీఱును, మనమునొగులు మనినదనుక మానదు సుమ్మీ. (శ. ర.)

సీ. బారి నొగులు నొప్పి బాధ సెకలు నొవ్వి వందుర దురపిల్లు కొందలంబు, సలుపు నోవి యనంగఁ జను వ్యథ... ఆం. భా. ౧. ౧౫౦

జః నొగిలించు, నొగుల్చు.

నొగుల్చు(లుచు)=నొగిలించు, స. క్రి. (√నొగులు)

(ముక్కలుచేయు, పాడిచేయు.)

గీ... తదారవంబున నతఁడు మూర్ఛఁ దెలిసి యొకకోలఁ దెగనిండఁ దిగిచి యేసె, వాని వక్షంబు నగుల జీవంబు లేదు, కల దనఁగఁ దేరు పదిబాణముల నొగిల్చె. ఉ. హరి. ౩. ౫౩.

చ... అంకిలిగొన కెమ్ము లమ్ములఁ బగిల్చి నొగిల్చి తరేతరుల్ తలల్, నలియఁగ మొత్తి... భాగ. ౧౦. ఉ. ౭౪౯.

నొచ్చిలు. అ. క్రి. (√నొచ్చు) రాలు, పడు.

మ. కలికీ యత్తిలు నీవు పోవు టెఱుఁగుం గాఁ బోలు నిప్పాటి నిక్కలరంభాతరువుల్ నుడింబడి వడం గంపించె జ్యోతిస్నిలతల్, తలవాంచెన్ సతి చూతజాతములు చింతం బల్లవశ్రేణి నొచ్చిలు నీహారము పేర నశ్రువులు రాల్చెం గంటివే కోమలీ. కృ. శతం. ౩. ౧౭౩.

నొచ్చిళ్లు. వి. బ. లాల, చొంగ. (శ. ర, చి. ని, బ్రౌ.)

నొచ్చు. (దీనికి తుమున్నాద్యర్థకరూపములు నొవ్వన్, నోవన్, నోన్, ము. వ్యతిరేకార్థమున-నొవ్వక, నోవక, నోక, నొవ్వకుము, నోవకుము, నోకుము, మొదలగు రూపములును అగును.) అ. క్రి. (క. నోచ్చు.)

౧. (మనస్సునఁగాని శరీరమునఁగాని) బాధపడు.

గీ. నొవ్వ బలుకుదు సభలోనఁ జివ్వ కొల్ల, కేను గురుపతిఁ జూచి సహించి పోదు. భార. ఉద్యో. ౪. ౨౩౭.

క. సేవకుల కైనవానికి, నోవకుఁడీ మీరు లఘుమనోవృత్తుల రై. భార. ఉద్యో. ౧. ౨౦౭

ఉ... సత్పురుషచిత్తము నొచ్చిన రిత్తవోవునే. ప్రభా. ౧. ౬౫.

౨. శ్రమపడు, కష్టపొందు.

క. నొచ్చినవారికి నాపద, వచ్చిన నది పరిహరించువాని ప్రభుత్వం, బె చ్చౌను... దశా. ౨. ౨౧౩.

క. ఓరిమురాంతక కామా, రారాములతోడ నీవఱచుపల్లఱపుల్, సైరించితి మిఁక నూరక, నో రత్తిలి వేని మిగుల నొత్తుదుసుమ్మీ. వరాహ. ౧౧. ౯౧.

ఉ. ఉన్నటు లుండఁగా నె విరు లూరక చావక నోవ కల్చునే. ఆము. ౩. ౫౩.

౩. మృతినొందు; నశించు.

ఉ. ఈనలినాక్షి యెవ్వతె మహేశ్వర వారిద వాహ కెఱుఁగరే, దానవసార్వభౌమువనితామణి యాతని సంగరంబులో, నాని జయించితే నతఁడు నాతఁడు ఘోరతపంబుచేత నష్టానివె నొత్తురే తపము సల్పిన వార లెఱుంగ కేమియున్. దశా. ౪. ౫౩.

సీ. ఉపవాసములచేత నుడివోనికలుషముల్
పరిహితంబులఁ బోని పాతకములు, వ్రతము
లచేత నొవ్వనిదుష్కృత్యంబులు క్రతువుల,
బొలియనికల్మషములు. వి. పు. ౩. ౧౩౫.

నోఁగొను=నోఁనాటు.

గీ. బాణహతి నించుకయు డిల్లపాటు గలిగి,
తోన తిర మైనధైర్యంబుతోడఁ బొలిచి,
తొరఁగునెత్తుట నొడలెల్లఁ దోఁగ నట్లు
నెఱిను నోఁగొన్నయక్కోలఁ బెఱికి వైచి,
భా. రా. యు. ౧౦౪౭.

నోఁబడు=బాధను అనుభవించు.

ఉ. ఆయుబలాలలామ భవనాస్యము వేడుక
తోడఁ జూచి పుష్పాయుధుచేత నోఁబడి
రొ నంతయు రాజున కేన చెప్పి నిక్కరోయఁ
గ వత్తు...దశకు. ౧౦. ౪౨.

నోఁబలుకు=నొవ్వఁబలుకు.

ఉ. ఈరస మెత్తి నోఁబలికి తేనియుఁ జెప్పుదు
సూతనందనా. భార. కర్ణ. ౨. ౫౨.

ఉ. గంధగజాసురారిఁ బురకాయజకాలబల
ప్రహారి...దక్షాంధవిదారి నోఁబలుక బ్రా
హ్మణ నీ వధికారివే మహిన్. కు. సం. ౪.
౭౫౯.

నోఁనాడు= ౧. నోఁనాఁటు, నొవ్వనాఁటు.

క. తోడన హాయసూతుల నోఁనాడఁగ నేయు
టయు నతఁడు నలిగి కడఁక విల్, గ్రీడయు
పోలెం గొని మెయి, నాడఁగ నిగిడించెఁ
ద్రిదశనారాచంబుల్. భార. కర్ణ. ౨. ౨౪౫.
(శ. ర. కరాల ప్రతి. పా.)

గీ. హరుల నొప్పించి సూతు నోఁనాడ నేసి,
యంగముల బాణములు నించి యతనిఁ బఱి
పె. భార. విరా. ౫. ౨౭౨.

౨. నొవ్వఁబలుకు.

ఉ. వేడుక నీకకాని మతి జేటొకయింతికి నైన
శేడత్రో, పాడెద కేల మచ్చుక మొక్కప్ప
డు మానకపోయి తీవు పెం, బ్రోడవు గాన
సిన్ను కనుఁబో యతఁ డెవ్వరిఁ జూడఁ
డంచునో, నాఁడె సపత్ని నొక్కతె మురారి
కనుంగొనువేళ నీసునన్. పారి. ౩. ౧౫.

నోఁచేయు=నొవ్వచేయు.

సీ. అర్జునుపైఁ గ్రూరి నతని నోఁచేయఁడు...
భార. ఉద్యో. ౪. ౨౨౯.

క. మొగి రెంట మూఁట నిరుసులు,నొగలు
విఱుగ నొత్తట వాని నోఁచేయుటయున్.
భా. రా. అర. ౧. ౨౩౭.

జః నోంచు, నోంచువాఁడు, నొచ్చులు, నొచ్చు
కొను, నొచ్చుకోలు, నొప్పి, నొప్పించు, నొప్పి
గుంటు, నొప్పివడు, నొవ్వి, నొవ్వు, నోవరి,
నోవి, నోవిక, నోవు.

నొచ్చుకొను. అ. క్రి. (నొచ్చు+కొను. స్వార్థము) పశ్చాత్తాపపడు.
(వ్యవ) వాఁడు తొందరపడి అన్నగారిని తిట్టెను
కాని తరువాత చాల నొచ్చుకొన్నాఁడు.

స. క్రి. నిందించు.

క. విపరీతకాల మింతే,యిపు డెవ్వరి నొచ్చుకొ
నఁగ నేఁటికి నీచే,నపవాద మగుట నిజమని,
తపియించి సుమిత్రిపట్టి తరలఁగ నంతన్.
చం. రా. ౫. ౭౭.

నొచ్చుకోలు. వి. (నొచ్చుకొను.) పశ్చాత్తాప
పడుట. (చి. ని. శ. ర.)

నొడలదొంతి. వి. సంశయము. ప్రా. చిది. (అ.
ప్ర. అని శ. ర.)

నొడి=నుడి, నొడువు. వి. (దే. నొడి.) మాట,
పలుకు, పదము.

సీ. నుడుగు నుడువు నుడి నుడికారము నొడువు
నొడి నొడికారము నొడుగు నాఁగఁ బద
మొప్పు...ఆం. భా. ౧. ౧౧౧.

జ. నొడికాఁడు,నొడికారము,నొడికాడి.

నొడికాఁడు. విణ. (నొడి + కాఁడు.) మాటకారి.

ఉ. నందనుచావు నిక్క మయినం జను టుప్పడ కల్గు దేవకీ, నందన యెల్లభంగి నరనందను పాలికి నాజి కేచి పో్వం దనతోడి తెంపు నకు వారక యిచ్చినబాసతప్పె నిం,కం దనుఁ గన్న దెప్పనొడికాఁ డని కొంకవఁ గాని యచ్యుతా. భార. అశ్వ. ౩. ౧౭౧.

నొడికారము=నుడికారము. వి. (నొడి + కారము[1]. స్వార్థమున.) పలుకు, మాట; మాటల యందలి చమత్కారము, సరసత.

సీ...నొడి నొడికారము నుడుగు నాఁగఁ బద మొప్పు...ఆం. భా. ౧. ౧౧౧.

వ...కళావతీ నీవు నొడికారపుమాట లాడుం బ్రోడ వని విందుము...వైజ. ౭. ౫౫.

నొడికారి. విణ. (నొడికారము + ఇ[3].) మాటచమత్కారము కలవాఁడు.

ఉ. అప్పన మెంత గావలె నహంకరణంబుఁ దొఱంగి యిచ్చినం, గప్పము పేర నేఁడు నొడికారితనంబున మోసపుచ్చఁగా, నుప్పులు దత్తురే సమరయోగ్యతలంబున వైరికోటి తో,నుప్పనఁబట్టె లాడునెడ నుప్పులు దెత్తురుగాక యాదవుల్. ఉ. హరి. ౪. ౧౫౫.

ఉ. కాఁగిటి కాన చేసి నొడికారితనంబున నిన్నుఁ దేల్చి రా, రాఁ గొఱగానివాఁడ నయి రామలలోనగుఁబాటు దేను నీ,కేఁ గలుగంగ సంపదల కేల విచారము పద్మగంధి నీ,లోఁగి టఁ జేర్చనే యుభయలోకసుఖంబులునన్నుఁ బొందినన్. ఉ. హరి. ౧. ౯౪.

నొడుగు=నొడువు.

(నొడి, మాట.)

సీ. నుడుగు నుడువు నుడి నుడికారము నొడువు నొడి నొడికారము నొడుగు నాఁగఁ, బద మొప్పు...ఆం. భా. ౧. ౧౧౧.

నొడుచు. స. క్రి. తప్పిఁబట్టు. (శ. ర, చి. ని.) జః నొడుపు.

నొడుపు. వి. (√నొడుచు.) తప్పఁబట్టుట. (శ. ర, చి. ని.)

నొడువరి. విణ. (నొడువు + అరి[3].) వాచాలుఁడు.

ద్వి. కడు యంత్రతంత్రముల్ నొడువరితనము, లు...పండితా. పురా. ౧౧౭ పొ. బస. పు. ౧౯ పొ. ౪౫౫. పం.

నొడువు=నొడుగు, నుడువు, నుడుగు. స. క్రి. ౧. వచించు, చెప్పు.

క...ఎగ్గుల్, నొడివెడువివేకశూన్యుల,కడ నుండెడునంతకంటెఁ గష్టము గలదే. భార. ఆది. ౨. ౧౪౯.

సీ. కూఁతు లిద్దఱు నీకుఁ గొడుకు లిద్దఱు నీకు నని మోము చూచి సత్యంబు నొడువు. కాశీ. ౬. ౬౦.

౨. (గ్రంథము, కవిత్వము.) రచించు, చెప్పు.

చ. నూనూఁగుమీసాలనూత్నయౌవనమున శాలివాహనసప్తశతి నొడివితి. కాశీ. ౧. ౭.

౩. పఠించు, ఉచ్చరించు.

గీ. కుతిక మోయఁగ నెత్తురుల్ గ్రోలి కడుపు, నిమిరికొంచు నగస్త్యమంత్రములు నొడివి. దశా. ౨. ౪౩౫.

క...నే,నొడివిననొడువులు నొడువఁడు, దుష్కరిఁ జదివింప మాకు దుర్లభ మధిపా. భాగ. ౭. ౨౫౩.

సీ. పద్మాసనస్థులై ప్రణవంబు నొడువుచు ముక్కుఁ బట్టఁగఁ జూచె మునివరులకు. ఉ. రా. ౧. ౩౧౧.

౪. స్తుతించు, కొనియాడు.

సీ. నలినసంతతి చెంత నాగంబు స్తుతిచేయ నురగవల్లభుపొంత గరుడు నొడువు. కళా. ౧. ౨౫.

గీ. వెత్తిమాడ్కి నీలలతో విశ్వమయుని, నొడువుచును లోకబాహ్యత నొందవలయు. భాగ. ౧౧. ౪౪.

వి. పలుకు, మాట.

చ. పడఁతుక దేహవల్లికయుఁ బ్రాయపుసంపద కా
పురవచ్చినక్, నొడువుల రాజకీరములనున్న
నిపల్కులఁ జూలఁ దోలె ..విక్ర. ౬.౪౫.
భాగ. ౭. ౨౫౩. ఆం. భా. ౧. ౧౧౧.

జః నొడువరి, నొడువుజవ్వని.

నొడువుజవ్వని. వి. (√నొడువు.) సరస్వతి.

సీ. నొడువుజవ్వనిపోఁకముడి కాసపడుపెద్దసరి
గద్దె నుండుపెద్దతిక మెల్ల. చం.రా. ౨.౩౦.

నొప్పి. వి. (√నొచ్చు.) ౧. బాధ.

సీ. రాహుదంష్ట్రాంకురక్రకచఘాతంబుల నొ
క్కొక్కపరి నొప్పి నొందకున్న. నైష.
౩. ౧౯౨.

ఉ. కంటకముల్ పదాగ్రములఁ గాఁడఁగ దూ
సిన నొప్పిఁ గూయిడక్. ఆము. ౩. ౩౩.

క. అప్పాండవమధ్యమునకు, నొప్పమి పుట్టఁగ
వలయు నల్లము కలఁగెక్, దప్పదు నాకల
నీసఖు, నొప్పి పరిహరించి దయఁ గనుంగొను
మనినక్. జై. భా. ౭. ౧౧౭.

౨. ప్రసవవేదన.

సీ. నొప్పులు దఱచయ్యె నిప్పుడె చని వేగ
పెద్ద లౌముదుపల్లెఁ బిలిచి రారె. ఇందు.
౨. ౫.

నొప్పించు=నొంచు. స. క్రి. (√నొచ్చు.) నొ
వ్వఁజేయు.

ఉ...విల్ద్రుంచి తురంగరక్తములఁ దూపులు
నించి యలంచి మేను నొప్పించినఁ దేరితో
డ నటుపైనఁగు నీడ్చికొంచుఁ బాఱె...
భా.ర.ద్రో.౨ ౭౪. (ఇట 'మూర్ఛనొందించు'
అని భావము.)

ద్వి. ఏసియుఁ గోసియుఁ జీరీతిఁ గపుల, నొప్పింప
నెంచియు నచ్చి భీతిల్లి, యప్పుడు కరుగిరు
లవనిపై పైచి. ... యు. ౪౭౩ పా.
౨౫ పం.

నొప్పిఁబ(వ)డు. అ. క్రి. (నొప్పి+పడు.)
బాధపడు.

క.కోణపవను లప్పిఁబడి, బాణపరంపరల నొప్పిఁ
బడక రిపుల, తోఁటిపరములు కుంభద్రోణా
సారముఁ గలఁగి తొలఁగనిభంగిక్. కాశ.
౨. ౫౦.

క. ఇప్పగిది నాఁడు నాఁటికి, నప్పాపములు సం
హరింప హతశేషజనుల్, నొప్పిపడి పోయి
నలువకుఁ, జెప్పిన నతఁ డాగ్రహంబు చిప్పి
లుకుదితోఁక్. వరాహ. ౬. ౭౨.

నొప్పిగుంటి. విశే. (నొప్పి+కుంటి.) వ్యాధిగ్ర
స్తుఁడు. (శ. ర, చి. ని.)

నొల్లు[1]. స. క్రి. (బిడ్డలు నోట వ్రేలిడుకొని)
చప్పరించు.

సీ. వ్రేళ్లులు గఱవంగ జెర వర్ణించిరో నోరఁ
జేతులు గ్రుక్కి నొల్లువాఁడ. నిర్వ. ౧.౪౦.

నొల్లు[2]. స. క్రి. ప్రోగుచేయు.

(వ్యవ.) ఆగడ్డి నొల్లి ఆవుముందటఁ వేయుము.

నొల్లుకొను. స. క్రి. (√నొల్లు[2].) అత్యాశతో
ప్రోగు చేసికొను.

(వ్యవ.) అది యంతయు వాఁడే నొల్లుకొన్నాఁడు.

నొవులు=నొగులు.

(బాధపడు.)

సీ. ప్రచురముక్తాచ్ఛత్త్రరుచి కొంతవడి నేఁగి
యవి గూలఁ దడఁబడి నొవులుకరులు.
చెన్న. ౫. ౫౫.

నొవ్వి=నొవ్వు. వి. (√నొచ్చు.) ౧. వేదన, బాధ.

ఉ. త్రెవ్వుకంటులం గురువు దేరకు నెత్తుర
లాకమున్న యో, నొవ్వియు నేదికారము మ
నోగతిఁ జెందకమున్న...ఉవ్వన నుప్పతిల్లె
నసురోద్వహమార్గచయంబు గ్రక్కునక్.
భా. రా. యు. ౨౧౪౫. విజ్ఞా. ప్రా. ౫౦.

చ. వరుణుఁడు వైచెఁ బాశమున వైచిన నబ్బలి తంపుఁ గైదువుం, గరమునఁ బట్టి దానవుఁడు క్రమ్మఱ వైచెఁ జదత్రి మఁబుధీశ్వరునకు నొవ్వి సేయుచు... ఉ. హరి. ౧. ౩౦.

౨. వ్యాధి, రోగము.

క... నా మెయిఁ, గ్రొవ్విసమాంసంబు గలదు కొను మాఁకలియుఁ, నొవ్వియును దీఱు నఁతటన్ నక్కల నారోగ్య మగు మృగాధిప నీకున్. నా. పంచ. ౧. ౩౯౯.

నొవ్వ=నొవ్వి, నోవు. (√నొచ్చు.) వేదన, బాధ.

క. ఇవ్విధమున నిత్యంబును, నవ్వసుధాధిపుఁడు ప్రజల కనురాగలతల్, నివ్వటిలఁ జేయుఁ దనమది నొవ్వెఱుఁగకయుండ బహువినోదపరుం డై. నిర్వ. ౯. ౭౫.

ఆ. తనతలంపువెంటఁ దమకించి ప్రజకు నొ, వ్వగఁ జరించుటయును దగదుపతికి. భార. శాం. ౨. ౧౪౭.

గీ. వారయు వంగంబునందు దుర్వ్యాప్తిఁ గదిరి, నొవ్వుఁ దెవులును బుట్టించుఁ గ్రొవ్వుఁ జెఱుచు. భార. అశ్వ. ౧. ౧౭౫. భార. భీష్మ. ౨. ౧౪౧.

౨. వ్యాధి, తెవులు.

ఆ. ఇన్ని సంకటముల నిబ్బంగి నెంతయు, నొగిలించి త్రిప్పి తీనొవ్వ దీర్ప, వెజ్జ వీవ కావె రోల యోగతి, నడపఁ దలఁచి తదియ నాకుఁ బ్రియము. భార. ఉద్యో. ౩. ౨౬.

నొవ్వాఱు=బాధనొందు.

ఉ. కౌరవకోటి నేఁ బొడిచి క్రిందుగఁ గయ్యము సేయుఁ గర్ణుఁడా, భూరమణుల్ వడిం గదిసి భూరిశరంబులు మేననింప, నొవ్వాఱుటయుఁ దోలంగ నతఁ డాహవరంగము నఁదు లేఁడు... భార. కర్ణ. ౩. ౨౧.

నొసలిచూపువేల్పు. వి. (√నొసలు.) ఫాలాక్షుఁడు, శివుఁడు.

క. అనిన నయ్యుర్వశ్వలకున్న యప్పతియుండం జిత్తం బొప్పింగ కన్క డెకిసి యాచాయు నొక్క నృపతి జూచి నొసలిచూపువేల్పు జవరా లాచి వృరాల బోఁడి కి ట్లనియె. చంద్రి. ౫. ౧౦౫.

నొసలు. వి. దే. (క. నొసలు, నొసల్.) నుదురు, లలాటము. (బ. నొసళ్లు, నొసళులు.)

గీ. భసితరేఖా త్రిపుండ్రంబు నొసటఁ దీర్చి. హర. ౨. ౧౦౪.

ద్వి. పసుపులు పంకించి పచ్చ్రి సేస, నొసలారఁ బెట్టి సన్నుతులు గావించి. ద్వి. భాగ. ౧౦. (చి. సి.)

ఉ. కట్టిననీలికింట్లు పెలకిట్టియవిఁడ్డను విండ్ల గాసెనల్, చుట్టి నొసళ్లపై నిడిన జుంజులుఁ బల్లసిగల్... మనుచ. ౪. ౩౩.

సీ. తిగరేక లేర్పడ దిద్దిననొసలినున్నోలిబూది బొట్టురంగులు నెలంగ. నీలా. ౧. ౭౦. ఆం. భా. ౨. ౧౪౩.

జ: నొసలిచూపువేల్పు.

## నో

నోఁచు=నోము. స. క్రి. (వ్రతము, యజ్ఞము మొ.) ఆచరించు.

మధ్యాక్కర. నుదువులు వేయు నిం కేల యిప్పాటినోములు దొల్లి కడఁగి నోఁచితిని గాకేమి యనుచును గందె డెందమున. భార. ఆది. ౪. ౧౦౨.

ఉ. నోఁచినవారి సొమ్ము లవి నోమనివారికి వచ్చునే ధరన్. ఉ. హరి. ౧. ౧౬౯.

ఉ... ఇంతఁగా, నోఁచితి నింక నెట్టివి కనుంగొన నిమ్మెయి నున్న దాననో. పారి. ౧. ౯౦.

చ. వనరుహగంధినీపలుకుపద్ధతి చాలదు వాఁడు దివ్యులన్, మునులను దిల్చి నోము నెపమూ జతనోఁచిననోముఁగాక... వీర. ౧. ౧౧౪.

జః నోఁత.

నోఁత. వి. (√నోఁచు. త. నోన్ఱు.) నోఁచుట, (వ్రతము) ఆచరించుట.

చ. వెలిచవిఁ గోరుచుండఁగఁ బువేఁడుకకై తెలనోము నోఁత...చీకటి పర్వ సుర్వరన్. కవిక. ౪. ౭౬. ('వ్రతఫల' మని భావము.)

నోటిగయ్యాళి. వి. (నోరు+గయ్యాళి.) నోటి దురుసుఁదనము కలది.

సీ. మాటనూ తెలియఁగదో నోటిగయ్యాళియో యాచారహీనయో యలసురాలొ. చెన్న. ౪. ౩౯.

నోటిబీగము=నోరితాళము. వి. (నోరు+బీగము.) దేవతలకు మ్రొక్కుబడిగా మౌనవ్రత మవలంబించుటకై దవుడలయందు కుట్టుకొను లోహపుకడ్డీ.

వ...కొందఱు నోటిబీగముల దాసల్లెల్లున నోరులఁ బూరులు గఱచువారును...ప్రబంధ. ౩౨౫.

సీ. అనశనవ్రతముచే నతులకార్శ్యంబుచేఁ గనుపట్టు నోటిబీగములవారు. చంద్ర. ౫. ౪౧. (చి. ని. పా.)

నోటుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) నటుఁడు.

నోతవ్యము. సం. విణ. (అ. ఆ. అ.) నుతింపఁ దగినది, నవనీయము.

నోత్తృ. సం. విణ. (ఋ. త్రీ. ఋ.)=నోదకుఁడు.

నోత్తవ్యము. సం=నోదనీయము.

నోదకుఁడు. సం. విణ. (అ. దికా. అ.) ౧. ప్రేరకుఁడు. ౨. తొలఁగించువాఁడు.

నోదన. సం. వి. ఆ. స్త్రీ=నోదనము.

నోదనము. సం. విణ. (అ.ఆ.అ.) ౧. ప్రేరించునది. ౨. తొలఁగించునది. (అ.ఈ.అ.) నోదనసాధన మైనది. వి. అ. న. ౧. చోదనము, ప్రేరణము. ౨. తొలఁగించుట, తరిమివేయుట. ౩. (తర్క.) శబ్దాజనకసంయోగము, ధ్వనిని కలిగింపనిసంయోగము.

నోదనీయము. సం. విణ. (అ.ఆ.అ.) ౧. ప్రేరింపఁ దగినది. ౨. తొలఁగింపఁదగినది.

నోదయితృ. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) ౧. తొలఁగింపఁజేయువాఁడు. ౨. ప్రేరకుఁడు.

నోది. సం. విణ. (న్. నీ. న్.)=నోదకుఁడు.

నోద్యము. సం=నోదనీయము.

నోపస్థాత. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) దగ్గఱలేని వాఁడు, దూరమందున్నవాఁడు. (వాచ.)

నోము=నోఁచు; స. క్రి. (త. నోము.) ౧. (నోము) నోఁచు, (వ్రతము, యజ్ఞము) ఆచరించు.

గీ. మతియుఁ నాదిమరాజులు మత్తవైరిరాజిఘోరాజిసీమఁ బరాజితంబు, చేసి నిష్కంటకంబుగా నాసముద్రభూమి యేలిరి యీ నోము నోమి కాదె. వరాహ. ౯. ౫౫.

గీ. వ్రతము నోమించుదినవాసరములు దెలుపు. కాశీ. ౫. ౫౦.

వ...క్రీడదళిధూపధూమంబులుం బరిఢవిల్ల నోమినసుధాధౌతనూతనపూర్ణకలశంబుల సొంపు సంపాదించునమందమకరందపూరితోదరదరవికస్వరపుండరీకషండంబుల నెందునవకనిండుపేడుక వెరవుచు...వసు. ౩. ౧౫౪.

౨. పూజించు, అర్చించు.

క. అంగన లపుడు చతుర్విధశృంగారము లలవరించి చెఱకువిలుతు నోమ్, మంగళవిమయతత్సరసీప్రాంగణనిద్రితుని జంద్రహాసునిఁగాంచెన్. ... భా. ౧౦. ౭౫.

క. అన్నెలఁతి విన్నునున్నత, సన్నుతమణిచంద్రసౌధశాలలలోనన్, గ్రొన్ననవిలుతుని నో

ముచు, వెన్నెల నెచ్చెలులుఁ దాను విహ
రించుచుండెన్. విక్ర. ౧. ౧౨౦.

౩. పోఁగొట్టు. (చి. ని, శ. ర.)

వి. ౧. వ్రతము.

శా. నానోముల్ ఫలియించె నావయసు ధన్యం
బయ్యె విప్రోత్తమా. మనుచ. ౩. ౧౦౮.

ద్వి. మానసంబున రంగమందిరం జేరి, యానోము
తా నోఖి యానోముకరణి. ద్వి. పరమ.
౫. ౪౦౯ పా.

౨. యజ్ఞము.

ఉ. పాచ్చెము లేదు కన్యలకుఁ బుట్టినయిండ్లకుఁ
బోవ లోకమున్, మెచ్చున బొమ్మ నోము
నకు మీతలిదండ్రులఁ జూడఁ బైదలీ. వీర.
౧. ౧౧౫.

చ...వాఁడు దివ్యులన్, మునులను బిల్చి నోము
పెనుమూఢత నోచిన నోముఁ గాక...వీర.
౧. ౧౧౪.

౩. వ్రతఫలము.

వ...వీరపత్నీనికూంతులు అక్కా సాన్కా నో
ముగా అర్జునదేవుండు ధారాపూర్వక
(కము) చేసి ఆచంద్రార్కర్క ముగం బెట్టిన
మడువా డ [ను] యూరు ఒక్కండు...
దా. శా. ౪. ౧౩౮౩.

నోయు. అ. క్రి. (క. నో. నోయ్. నోయు, త.
నో.) నోచ్చు, బాధపడు; కష్టమనుభవించు.

వ. వినత యోటుపడి కద్రువకు దాసియై నోసి
పనులు సేయుచు చున్నంత...భార. ఆది.
౨. ౩౮.

క. నాయాఁకలి కోర్వ నెపుడు, నే నైనను నేఁ
గోనంగ వెండి యనుభవిం, తాయాసపడు
టఁ గనుఁగొని, నోయుదు నను బాపి
యిటు సనుట తగ వగునే. భార. శాం.
౩. ౩౩౦.

సీ. క్రొవ్విరితోడకంటెఁ గోమలం బగుమోము
రేయెండ ముట్టిననోయుఁ దద్ద. కు. సం. ౨.
౨౮౦.

సీ. వేసవి వడగాలి నోసిననేఁడిఁగ క్రొక్కారు
గని మవ్వ మెక్కినట్లు. కు.సం.౭.౧౯౮.

నోరఁబట్టు. స. క్రి. (నోరన్ + పట్టు.) ప్రక్కటఁ
బట్టు, త్రాఁగు.

ఉ...అగస్త్యమూర్తియై, యీశ్వవకేతసుందరి
మహోశబలాంబుధి నోరఁబట్టెడున్. జై.
భా. ౧. ౧౦౦.

నోరితాళము=నోటిబీగము.

గీ. లలన యొక్కర్తు నోరితాళంబు లిచ్చె, శక్తి
జాకర సద్భక్తి శక్తు లెనఁగ. పాండు. ౩.
౮౮.

నోరిసని. వి. (√నోరు.) నోటిశని, తినుటకు రో
గము లేకపోవుట, అనుభవించుటకు అదృష్టము
లేకపోవుట.

క. నోరిసని సుండ కే నో, రోరి యకట మాప
మీవపూరణె మనియుం, దూరము వోయి
తివే సా, మ్మేరీతిని నీకు దక్కనే కానీరా.
ఆము. ౫. ౮౨.

నోరు. వి. ఔ. (బ. నోరులు, నోళులు, నోళ్లు.)

౧. వాయి, ఆస్యము.

క. కాని తెఱఁగైన నింతటి, మానిసిఁ గా నేల
చేయు మనుజేంద్రుఁడు న, న్నీనెఱి దప్పిన
మాటలు, నీనోరన్ వెడలఁదగునె నిండిన
సభలోన్. భార. ఉద్యో. ౨. ౧౫౯.

చ. వెడలఁపుగల్గునోరు లొకవేయి ధరించి వియ
న్నదీజలం, బడరఁగఁ బుక్కిలించి రయమా
రఁగఁ దెచ్చి మహానిలంబునై, నెడపడకుండఁ
జల్ల...హరి. ఉ. ౭. ౮౨.

క. పలుఁడు ఘనాశేషుండును, బ్రకటభుజాస్ఫు
రణమున నరాతిబలము నేలకుఁ గోలకు

దెత్తురు న్నోరికి వచ్చినయట్లు లాడిరే యి
బ్బంగిన. భార. కర్ణ. ౩. ౨౭.

౨. పశులమూఁతి; పశ్వాదులమూతి.

సీ. ఛేదోయిరొత్తునఁజేసి నెత్తురు లైనయవ
యవంబులు నోర నవరఁ జేయు. నైష. ౨. ౫.

౩. మాటలాడుశక్తి.

క. అన నయ్యంగన నా కేమన నోరున్నయది
మీర లనినంతయుఁ జెల్లున మీ కొఁగా
ములు దెల్ప నుపాయం బొకటి గానఁబడ
నంచాఁకన్. కళా. ౩. ౧౭౦.

నోటఁ(ర)గాయవేయు=ఊరకుండు.

ఆ. రక్తముఖులు కావరపుఁజాతులు కజా, తా
శ్రయములు మీర లగుటఁ జపలవృత్తి నో
టఁగాయవేయక కదరుచుఁ, గలఁచెదరు
లతాంగిఁ జిలుకలార. కవిరా. ౩. ౧౮౫.

క. అంగంబులు నులియంగను, నుంగేయుఁగే య
టంచు నొకనిమిషము నోరంగాయవేయ
కేడ్చుచు, నంగీకృతబాల్యచేష్ట నతఁడట్లుం
డన్. పరమ. ౧. ౧౨౫.

నోటనాలుకకలుగు=మాటాడనేర్చు.

సీ. నరునకుఁ దననోట నాలుక గలిగిన వింతదే
శంబు లెవ్వియును లేవు. రామలిం. ౩౨.

నోటిమాట నోటనెయుండ=నోటిలోమాటనోటి
లో నుండఁగానే, అవ్యవధానముగా.

గీ. తన్ను ధరణికిఁ బొమ్మన్న ధాతనోటిమాట
నోటనెయుండ భూమండలంబుఁ, జేరఁజను
దెంచె సింగంపుఁదేరిజోదు,వింధ్యగిరి నున్న
రాక్షసవితతిమీఁద. కాశీ. ౨. ౩౬.

నోరదుము=నోరునొక్కు. మాటలాడనీయకుండు.

గీ. అత్తమామల కృపాకర్తలగుచు మెలఁగు,
నట్టిభూర్తుల నెల్ల నోరదిమి గదిమి, పొంచి
యుపనాథుతోడఁ గ్రీడించి...శుక. ౧.
౫౫.

నోరాడు=నోరు మెదలు, మాటవెలువడు.

క. బవరము గీడని యెఱుఁగుదు, నవినీతుం
డైన కొడుకు నదలిఁచి యుడుపం, దివిరియు
నోరాడమి దైవ, మపళం బప్పనికి వగవ గ
పిం కేలా. భార. ఉద్యో. ౪. ౧౭౩.

ద్వి. మిముఁబోఁదు మన నెట్లు మీకునోరాడె.
ద్వి. హరిశ్చ. పూ. ౧౦౩౬.

గీ. చెప్ప నోరాడ దేమని చెప్పవాఁడ, నెటిఁ
గినరంబు చెప్పెనె యొట్టడఁతు. కాశీ. ౪.
౩౫.

నోరార్చు=నోరాడించు, బూకరించు, బొంకు.

ద్వి. దంటమాటలు గొన్ని తడవాటి వన్ని, గం
టక నోరార్చి గెల్వఁ జూచెదవు. ద్వి.
హరిశ్చ. పూ. ౩౦౦.

నోరికిఁబోవు=నోరి కింపగు, ఇష్టమగు.

ఉ. తుప్పలు పట్టె నేర బలుతూపులు నీగురి
గింజదండకున్, దప్పితి నేమి నావుడు నతం
డాను దిగ్గన లేచి దేవరా,యిప్పటి కమ్ము
లింత చెడియెం గడి నోరికిఁ బోదు దూప
కుం,దప్పలనీరె మాగురులకీయనిపోలు రు
చింప క్షమియున్. కవి. ౪. ౫౧.

నోరికివచ్చినట్లుపలుకు=ముందు వెనుక లరయక
మాటలాడు.

ఉ. పాండవపక్షపాతమునఁ బల్కుఁడు నోరికి
వచ్చినట్లు ని,న్నొంద దనరామిఁజేసి యిది
యొప్పునె...భార. విరా. ౪. ౬౭.

నోరిమాట నోరన వసియించు=నోటిమాట నోట
నె యుండు.

చ. మనుజకుండు పద్మజుమారుఁ గనుంగొని
నోరిమాట నోరన వసియించు వచ్చె రథ
రాజసమాజము...కవి. ౨. ౯౫.

నోరిమాట నోరనె యుండగన్=చెప్పియుఁ జెప్పక
ముందే, అవ్యవధానముగా.

గీ. అది కనుంగొని నిదియు మాయాబలంబు, వి
శ్వరూపధరుండు శ్రీవిష్ణుఁ డనుచు, ధారుణి

భర్త పలికిన నోరిమాట, నోరసేయుండ దత్ప
భాగారమునను. వరాహ. ౧. ౧౮౫.

నోరఁగోలఁది=దుర్భాషణము. దు. సం. ౧. ౩౬.

నోరు కాయు=నోటికి కష్టమైన దెల్లఁ దినకుండు పథ్యము చేయు.

(వ్యవ.) మాపిల్లవాఁడు జ్వరపడి నోరుకాయ లేఁడు.

నోరు కాయలు గాచు=పలుమాఱు పిలుచుటచే నోరునొప్పిచెందు.

(వ్యవ.) నిన్ను పిలిచి పిలిచి నోరుకాయలు గాచినది.

నోరుచేయు=మాటలాడు. (ఇది ఇతరపదవ్యవధానముగాను గన్పట్టుచున్నది.)

సీ. కూడనిత్తునె మాఱుకొని మోఱ యెత్తినఁ
గదిమెద నోరింతకంటెఁ జేయ. బహు.
౫. ౫౧.

నోరుమాలినది=౧. నోరు లేనిది, మాట లాడ లేనిది. (తిర్యగ్జంతువు.)

గీ. శర్వ యీనోరుమాలినజంతువునకు, మెందల
వర మిమ్ము వర మిమ్ము పిదప నాకు. కాశీ. ౫.
౩౩౫.

౨. నోరు లేనివాఁడు, గడుసుఁదనముతో మాట
లాడ నేరనివాఁడు.

(వ్యవ.) ఆనోరుమాలిన వాని సెగతాళి చేయకుము.

నోరుమెదపు=మాటాడు.

(వ్యవ.) వాఁడీమధ్య కొంచెము నోరుమెదపుచున్నాఁడు.

నోరుమెదల్చు=నోరెత్తి మాటాడు, చెప్పు.

ఉ. ఎన్నఁగ నింత రత్నచయ మింక గభీరిమ
యింత దానసంపన్నత యింత శుద్ధి యని
బ్రహ్మయు నోరుమెదల్ప లేనియట్టున్నతిఁ
గన్నచెన్నడలి నుతిత మై శలిదీవి చెన్న
గున్. పాండు. ౩. ౧౫౧.

నోరు లేనివాఁడు=పొంకికగా మాటలాడ లేని వాఁడు.

(వ్యవ.) వాఁడు బొత్తిఁ నోరులేనివాఁడు.

నోరు వాయెత్తు=నోరెత్తు.

గీ. తపసిజనములు నుతిమంత్రజపము లుడిగి,
వచ్చి యుండక పికశిఖావళులు లాడి,గా
వనంబునఁ గలవిహంగములంబు, తత్తరము
నొంది నోరు వాయెత్త వెఱచు. పి. శకుం.
౨. ౪౫.

నోరువాయిలేనిది= అధికముగా మాటలాడ నేరనిది.

(వ్యవ.) ఆమెనోరు వాయి లేనిది.

నోరువ్రీఁగ్లూరు=నోరూరు, తినవలె నను నాస కలుగు.

క. గువ్వలు కోఁజులు కూఁకటి,మువ్వలు లావు
కలు కోళ్లుపూరేళ్లు మొదల్,క్రొవ్విననపులుఁ
గులగమి నోళ్లువ్రీఁగ్లూరంగ నప్పు డుర్వీశ్వ
రాలె. ఇందు. ౨. ౭౦.

నోరూరు=౧. అపేక్ష కలుగు. see on page 912.

గీ. గబ్బిగుబ్బలఁ బతియెదఁ గ్రమ్మి క్రమ్మియు
న్న సకియలఁ జూచి నోరూరసాగె. కలు.
౬. ౨౨.

౨. పులుపుగాని కారముగాని గలవస్తువులను చూచినప్పుడును తలఁచినప్పుడును నోట ద్రవము పుట్టు.

క. శ్రీరామునిదయచేతను, నారూఢిగ సకలజ
నులు నారా యనఁగా,ధారాళ మైననీతులు,
నోరూరఁగఁ జవులు పుట్ట నుడివెద సుమతీ.
సు. శ. ౨. (రెండర్థములకు నిది యుదాహ
రణము.)

నోరోన్నరన్=నోటిలోనుండి నోటిలోనికి.

సీ. హంస పెరుకన నిచ్చె హంసికి నోరోన్నర
[illegible]. దు. సం. ౪. ౪౫.

దెత్తుర నోరికి వచ్చినయట్టు లాడిరే యి
బ్భంగిన్. భార. కర్ణ. ౩.౨౨.

౨. పక్షులముక్కు; పక్ష్యాదులముక్కు.

సీ. చేదోయిమొత్తునఁజేసి నెత్తుర లైనయవ
యవంబులు నోర నవరఁ జేయు. నైష. ౨.౫.

౩. మాటలాడుశక్తి.

క. అన నయ్యంగన నాకే, మన నోరున్నయది
మీర లనినంతయుఁ జెల్లున మీ కొఁగా
ములు దెల్ప నుపాయం బొకటి గానఁబడ
నందాఁకన్. కళా. ౩. ౧౭౦.

నోట(ర)ఁగాయవేయు=ఊరకుండు.

ఆ. రక్తముఖులు కావరపుటిజాతులు కజా, తా
శ్రయములు మీర లగుటఁ జపల,వృత్తి నో
టఁగాయవేయక నదరుచుఁ, గలఁచెదరు
లతాంగిఁ జిలుకలార. కవిరా. ౩. ౧౪౫.

క. అంగంబులు నులియంగను, ముంగేయుఁగే య
టుంచు గోకనిమిష మా నో,రంగాయవేయ
కేడ్చుచు, నంగీకృతబాల్యచేష్ట నతఁడ ట్లుం
డన్. పరమ. ౧. ౧౭౪.

నోటనాలుక కలుగు=మాటాడనేర్చు.

సీ. నరునకుఁ దననోట నాలుక గలిగిన వింతదే
శంబు లెవ్వియును లేవు. రామలిం. ౭౨.

నోటిమాట నోటనెయుండ=నోటిలోమాటనోటి
లో నుండఁగానే, అవ్యవధానముగా.

గీ. తన్ను ధరణికిఁ బొమ్మన్న ధాత నోటి,మాట
నోటనెయుండ భూమండలంబుఁ, జేరఁజను
దెంచె పింగంపుఁదేహిజోదు,వింధ్యగిరి నున్న
రాక్షసవితతిమీఁద. కాళ. ౨.౩౭.

నోరడచు=నోరునొక్కు, మాటలాడనీయకుండు.

గీ. అత్తమామల గృహాకర్తలగుచు మెలఁగు,
నట్టిభూర్తుల నెల్ల నోరడిమి గదిమి,పొంచి
యుపనాథుతోడఁ గ్రీడించి...శుక. ౧.
౫౫.

నోరాడు=నోరుమెదలు, మాటవెలువడు.

క. బవరము గీడని యెఱుఁగుదు, నవనీతుం
డైన కొడుకు నగలించి యుడుమఁ, దివిరియు
నోరాడమి దై, వవశం బప్పనికి వనకు వగ
పిం కేలా. భార. ఉద్యో. ౪. ౧౭౩.

ద్వి. మిముఁబోఁదు మన నట్లు మీకునోరాదె.
ద్వి. పారిజా. పూ. ౧౦౩౭.

గీ. చెప్ప నోరాద దేమని చెప్పవాఁడ, నెటుఁ
గినరంబు చెప్పక యెుట్టుడంతు. కాశీ. ౪.
౩౫.

నోరార్చు=నోరాడించు, బూకరించు, బొంకు.

ద్వి. దఁటమాటలు గొన్ని తడవాటి వన్ని,గం
టుక నోరార్చి గెల్వఁ జూచెదవు. ద్వి.
పారిజా. పూ. ౩౦౦.

నోరికిఁబోవు=నోరికింపగు, ఇష్టమగు.

ఉ. తుప్పలు ప్రబ్బె నేర బలుతూపులు నీగురి
గింజదండలున్, దప్పితి నేమి నావుడు నతం
డును దిగ్గన లేచి దేవరా,యిప్పటి కమ్మ
లింత చెడిగొంగడి నోరికిఁ బోదు దూప
కుం,డిప్పలనీరె మాగురులతీయనిపాలు ర
చింప క్షేమియున్. కళా. ౪. ౫౧.

నోరికివచ్చినట్లుపలుకు=ముందు వెనుక లరయక
మాటలాడు.

ఉ. పాండవపక్షపాతమునఁ బల్కుదు నోరికి
వచ్చినట్లు ని,న్నొంం దనరామిఁజేసి యిది
యొప్పునె...భార. విరా. ౪. ౭౮.

నోరిమాట నోరన వసియించు=నోటిమాట నోట
నె యుండు.

చ. మనుజకుభుండు పద్మజకుమారుఁ గనుంగొని
నోరిమాట నో,రన వసియింప వచ్చె రథ
రాజసమాజము...శుక. ౨. ౯౫.

నోరిమాట నోరనె యుండఁగ=చెప్పియుఁ జెప్పక
ముందే, అవ్యవధానముగా.

గీ. అది కనుఁగొని యదియు మాయాబలంబు, వి
శ్వరూపధరుండు శ్రీవిష్ణుఁ డనుచు,ధారుణీ

భర్త పలికిన నోరిమాట, నోరసేయుండ దత్న
భాగారమునను. వరాహ. ౧. ౧౭౪.

నోరఁగోలఁడి=దుర్భాషణము. కు. సం. ౧. ౩౭.

నోరు కాయు=నోటి క్లిష్టమైన దెబ్బఁ జిగకుండుప
థ్యము చేయు.

(వ్యవ.) మాపిల్లవాఁడు జ్వరపడి నోరుకాయ
లేఁడు.

నోరు కాయలుగాచు=పలుమారు పిలుచుటచే
నోరునొప్పిచెందు.

(వ్యవ.) నిన్ను పిలిచి పిలిచి నోరుకాయలు
గాచినది.

నోరుచేయు=మాటలాడు. (ఇది ఇతరపదవ్యవ
ధానముగాను గన్పట్టుచున్నది.)

సీ. కూడనిత్తునె మాఱుకొని మోఱు యెత్తినఁ
గదిమెద నో రింతకంటెఁ జేయు. బహు.
౨. ౮౧.

నోరుమాలినది=౧. నోరు లేనిది, మాట లాడ
లేనిది. (తిర్యగ్జంతువు.)

గీ. శర్వ యీ నోరుమాలినజంతువునకు, మొదల
వర మిమ్ము వర మిమ్ము పిదప నాకు. కాశీ. ౫.
౩౩౫.

౨. నోరు లేనివాఁడు, గడుసుఁదనముతో మాట
లాడ నేరనివాఁడు.

(వ్యవ.) ఆనోరుమాలిన వాని నెగతాళి చేయ
కుము.

నోరు మెదపు=మాటాడు.

(వ్యవ.) వాఁ డీమధ్య కొంచెము నోరుమెదపు
చున్నాఁడు.

నోరుమెదల్చు=నోరెత్తి మాటాడు, చెప్పు.

ఉ. ఎన్నఁగ నింత రత్నచయ మింక గభీరిమ
యింత దానసంపన్నత యింత శుద్ధి యని
బ్రహ్మయు నోరుమెదల్ప లేనియత్యున్నతిఁ
గన్నచెన్నడలి నుతిత మై వెలిదీవి చెన్న
గుణా. పాండు. ౩. ౧౫౧.

నోరు లేనివాఁడు = పొందికగా మాటలాడలేని
వాఁడు.

(వ్యవ.) వాఁడు బొత్తిగ నోరులేనివాఁడు.

నోరు వాయెత్తు=నోరెత్తు.

గీ. తపసిజనములు నుతిమంత్రజపము లుడిగి,
వచ్చి యుండక పికశిఖావళులు లాదిగా
వనంబునఁ గలవిహంగమకులంబు, తత్తరము
నొంది నోరు వాయెత్త వెఱచు. పి. శకుం.
౨. ౪౫.

నోరువాయిలేనిది= అధికముగా మాటలాడ నే
అనిది.

(వ్యవ.) ఆమెనోరు వాయి లేనిది.

నోరువ్విళ్లూరు=నోరూరు, తినవలె నను నాస
కలుగు.

క. గువ్వలు కౌఁజులు కూఁకటి, మువ్వలు లావ
కలు కోళ్లుపూరేళ్లు మొదల్, క్రొవ్వినపులుఁ
గులగమి నోళ్లువ్విళ్లూరంగ నప్పు డుర్వీశ
వ్రాతెక్. ఇందు. ౨. ౪౦.

నోరూరు=౧. అపేక్ష కలుగు.

See on page 912.

గీ. గబ్బిగుబ్బలఁ బతియెదఁ గ్రమ్మి క్రమ్మి, యు
న్న సకియలఁ జూచి నోరూరసాగె. కళా.
౪. ౨౨.

౨. పులుపుగాని కారముగాని గలవస్తువులఁ
చూచినపుడును తలఁచినపుడును నోట ద్రవ
పుట్టు.

క. శ్రీరాముని దయచేతను, నారూఢిగ సకల
నులు నౌరా యనఁగా, ధారాళమైననీతుల
నోరూరఁగఁ జవులు పుట్టనుడివెద నుమతీ
సు. శ. ౨. (రెండర్థములకు నిది యుదా
రణము.)

నోరోన్నరన్=నోటిలోనుండి నోటిలోనికి.

సీ. హంస పెన్నుర్వ నిచ్చె హంసికి నోరోన్న
నెలదూఁడు... కు. సం. ౪. ౪౮.

సీ. సంపెంగపాదరింటిచక్కి గోరంటఁగాంచి
యును రంచు మగిడి నోరూరునవియు.ఆ.
అగుచుఁ దేఁటికదుపు లామనిఁ దలసూపెఁ.
పారి. ౩. ౫౨.

నోళ్లఁబడు=పదుగురు చెప్పుకొను, నిందాపాత్రమగు.

సీ. నీమాట వినలేక నిర్మోహపాశులై ప్రాణికోటులనోళ్లఁబడిరి వసనె. కలు. ౪. ౭౪.

సా:-నోరున్న తల గాచును.(మాటలనేర్పున్నచో మరణదండనము నైనతప్పించుకొనవచ్చు.)

సా: నోరుమంచిదైన నూరు మంచిదగును.(మంచిమాటలాడిన నందఱు ప్రేమింతురు.)

జ: నోటిగయ్యాళి,నోటిబీగము,నోరఁబట్టు, నోరితాళము,నోరిసని,నోరుగొట్టు, నోరుదెఱచు, నోరునొక్కు, నోరుమూయు, నోరుమెంగ, నోరెత్తు.

నోరుగొట్టు. స. క్రి. (నోరు+కొట్టు.) అనుభవింపకుండఁ జేయు, తినకుండఁ జేయు.

సీ. కొలుచువారల నోరుగొట్టి లెక్కలు వ్రాసి హరువుమీఱఁగ మణియములుచేసి. శుక. ౩. ౩౪౫, ౩౫౩.

నోరుదెఱచు. అ. క్రి. (నోరు+తెఱచు.) ౧. మాటలాడు.

ఆ. శిఖలు చూపకుండ శిక్షించి హాతికినై, నోరు దెఱవకుండ మేరవెట్టి, పేఁడి యెల్ల నుడిపి విబుధారికిని కప్పె, భీతిపాత్రుఁ జేసె వీతిహోత్రు. నృసిం. ౨. ౧౧౮.

౨. అత్యాశపడు, ఆశపెట్టుకొను.

క. గతమునకును వగవక కాం,గతమునకును నోరు దెఱచి కడుఁ గోరక దీనతఁ బొందక దైవం బే,గతిఁ బుచ్చిన దానఁ బోదుఁగా కవివల యుఁగా. భార. శాం. ౩. ౩౦.

౩. బదులుచెప్పకుండు, నిరుత్తరుఁడగు.

(వ్యవ.) నేనట్లనుగఁగా సమాధానము చెప్పలేక వాఁడు నోరుదెఱచెను.

నోరునొక్కు. స. క్రి. (నోరు+నొక్కు.) మాటాడకుండఁజేయు.

గీ. ఎవ్వ డిది యని పల్కిన నవ్వధూటి, నోరు నొక్కుదుఁ గౌఁగిటఁ జేరఁ దిగిచి,మగువ చెవిలోన నలుకకు మాను మేను,వాసవుఁడ నిన్నుఁ గని కూర్మి వచ్చెఁ గాఁడ. జాహ్నవీ. ౪. ౭౭.

నోరుమూయు. అ. క్రి. (నోరు+మూయు.) మాటాడకుండు.

ఆ. అనిన నాఁడు గఱచి యసురద్వేషుం డోరి, పడుచ నాకుఁ బుట్టి చెడుగ వైతి,పేర్చి నోరుమూయు పెడతల వాపోయి, దిట్టదర గలఁడె యుచటనైన. నృసిం. ౪. ౩౪.

నోరుమెంగ. విణ. (√నోరు.) మూఁగ.

క. తన్నట్టు పలికి ప్రొబ్బఁగ, మిన్నక చన నంతనోరుమెంగయొ యది యా, మున్నాడిన మాటలబిరు, సన్నఁగ నిది గనియె యుతఁడు పేక్ష యొనర్చెన్. కళా. ౩. ౨౩౮.

నోరెత్తు. అ. క్రి. (√నోరు.) మాటాడు.

ఉ. అత్తఱి భీష్మముఖ్యు లగు నచ్చటివృద్ధజనంబు లెల్ల నోరెత్తక యూరకుండిరి మహీశ్వరుచిత్తమెఱుంగకున్కి... భార. ఉద్యో. ౧. ౩౪౮.

ఉ. అత్తఱి నీవు మార్పలుక మాయమువచ్చి తము లోనివారి మెప్పత్తము పెద్దవారు గలవారికి నన్నియుఁ జెల్లుఁగాక నేఁ, డిత్తఱి మమ్ముఁ బుచ్చి పని యెవ్వరు గొందురు మిమ్ముఁ జూచి నోరెత్తఁగ నోడి యేపలుకు లెన్నఁడుఁ జెప్ప మెఱింగి యుండియున్. భోజరా. ౬. ౧౨౬.

నోవరి విణ. (నోవు+అరి.) వ్యాధి కలవాఁడు. (శ. ర.)

నోవి=నొవ్వి. వి. (√నొచ్చు.) బాధ, నొప్పి. (శ. ర, చి. ని.)

నోవిక. వి. ఉసులు, అనుకూల్యము.

సీ. జీరాల జంటించి సికశాలి నెప్పేవ వైచుక నోవికల్ చూచువారు. మల్లుపు. ౨. ౪.

నోవు=నొవ్వు. (క. త. నోవు.)

(వ్యాధి.)

ఉ...జింకలు నక్కలు గొంకనక్కలు, న్దోమలు మ్రాఁకులుం బొదలు నోవులఁ బీడలఁ బొందువారముల్, తామసభాగు లట్లు మఱి తద్విధ జంతువు లెన్ని యన్నియున్. భార. అశ్వ. ౨. ౧౧౪.

(బాధ.)

క. చావును నోవును మనయో, ధావలికిన్ గెలుపు నుబ్బు నావలికిని నీ,చే వినియెదఁ దుది నెట్టులు, శ్రీవిభవము పాండవులకుఁ జేపడుఁన కదే. భార. భీష్మ. ౨. ౧౯౯.

జః నోవరి.

## నౌ.

నౌ=నవు, నవ్వు. (శ. ర.)

నౌక. సం. వి. ఆ. స్త్రీ. ౧. నావ, ఓడ. ౨. చిన్న పడవ.

నౌకర్ణధారుఁడు. సం. వి. అ. పుం. మాలిమికాఁడు, ఓడ నడపువాఁడు.

నౌకర్మము. సం. వి. న్. న. నావికవృత్తి, పడవ నడపువ్యాపారము.

నౌకాదండము. సం. వి. అ. పుం. క్షేపణి, నావను నడపు తెడ్డు; ఓడ నడపుగడ.

నౌకు=నవుకు.

ద్వి. వల్లవుల్పుకుఁ గ్రింద నౌకుదాపునను, వెల్లివాల్పుక్కు తెగి పడ్డరీతిఁ, గనిపించె... ద్వి. శ. సా. ౧. ౨౩౪, ౩౭ పం. ('నాకు.' ముద్రి.)

నౌచరుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) -పడవతో తిరుగువాఁడు- నావికుఁడు, పడవవాఁడు.

నౌజీవికుఁడు. సం. వి. అ. పుం. ఓడ నడపు వృత్తిచే జీవించువాఁడు.

నౌజు. వి. భక్ష్యవిశేషము.

(వ్యవ.) కొబ్బెరనౌజు పిల్లలకు ఇష్టము.

నౌడుకొట్టు=నవుడుకొట్టు. (శ. ర.)

నౌతార్యము. సం. విణ. (అ. ఆ. అ.) నావ్యము, ఓడచే దాఁటఁదగినది. (నది మొ.)

నౌదండము. సం=నౌకాదండము.

నౌబత్తు=నవుబత్తు. వి. (హిం. నౌబత్.) చర్మవాద్యవిశేషము.

సీ. నత్తందివంబును నాదు పాదుకొనంగ సాహేబు నౌబత్తు చఱవఁ బనిచి. రంగా. ౨. ౧౯౭.

నౌయానము. సం. వి. అ. న. నౌకాయాత్ర, ఓడలో పయనము చేయుట.

నౌయాయి. సం. విణ. (న్. నీ. న్.) ఓడలో పోవువాఁడు, నావలో ప్రయాణము చేయువాఁడు.

నౌరు=నవురు. విణ. మృదువు. (శ. ర.)

నౌవాహుఁడు. సం. వి. అ. పుం. ఓడనడపువాఁడు.

## న్య.

న్యంకుభూరుహము. సం. వి. అ. పుం. -ఇఱ్ఱి కొమ్ములవంటి చిక్కు శాఖలు కలది- శ్లేష్మాతకము దుండిగము.

న్యంకువు. సం. వి. ఉ. పుం. గు. ఇఱ్ఱి. ౨. ఒకా నొకముని.

న్యంచనము. సం. వి. అ. న. గు. న్యగ్భావము, తక్కువపాటు. ౨. వంపు, వంకర. ౩. పల్లము.

న్యంచితము. సం. విశ. (అ. ఆ. అ.) గు. అధః క్షిప్తము, క్రిందికి త్రోయఁబడినది. ౨. వంపఁబడినది.

న్యంతము. సం. వి. అ. పుం. చరమభాగము, చిట్టచివరభాగము.

న్యక్కరణము. సం. వి. అ. న. తిరస్కారము, అవమానము.

న్యక్కారము. సం. వి. అ. పుం=న్యక్కరణము.

న్యఙ్క్. సం. విశ. (చ్. నీచీ. చ్.) గు. క్రిందికి పోవునది; క్రిందికి వంగునది. ౨. నిమ్నము, పల్లము. ౩. నీచము.

న్యక్కృతము. సం. విశ. (అ. ఆ. అ.) తిరస్కృతము, అవమానింపఁబడినది.

న్యక్కృతి. సం. వి. ఇ. స్త్రీ=న్యక్కరణము.

న్యక్తము. సం. విశ. (అ. ఆ. అ.) మిక్కిలి చెక్కఁబడినది, మిక్కిలి పూయఁబడినది.

న్యక్షము. సం. విశ. (అ. ఆ. అ.) గు. నీచము, తక్కువైనది. ౨. అంతయు, సమస్తము. వి. అ. పుం. మహిషము, దున్నపోతు. న. గు. సాకల్యము, పూర్ణత. ౨. మహిషతృణము.

న్యత్ఖుఁడు. సం. వి. అ. పుం. పరశురాముఁడు. (వాచ.)

న్యగ్భావము. సం. వి. అ. పుం. గు. నీచత్వము, తక్కువపాటు; అవమానము, తిరస్కారము. ౨. నీచముగా చేయుట, క్రిందుపఱుచుట.

న్యగ్భావితము. సం. విశ. (అ. ఆ. అ.) గు. నీచముగా చేయఁబడినది, క్రిందుపఱుపఁబడినది. ౨. గుణీకృతము, అప్రధానముగా చేయఁబడినది.

న్యగ్భూతము. సం. విశ. (అ. ఆ. అ.) గు. నీచమైనది ౨. అవమానము నొందినది, తిరస్కారము నొందినది.

న్యగ్రోధపరిమండల. సం. వి. ఆ. స్త్రీ. కఠినస్తనములును విశాలనితంబమును సూక్ష్మమధ్యమును కలస్త్రీ.

శ్లో. స్తనౌ సుకఠినౌ యస్యా నితంబే చ విశాలతా, మధ్యే క్షీణా భవేద్యా సా న్యగ్రోధపరిమండలా. (వాచ.)

న్యగ్రోధపరిమండలుఁడు. సం. వి. అ. పుం. వ్యామపరిమితమైనయుచ్ఛ్రాయమును పరిణాహమును కలపురుషుఁడు, బారెఁడు ఒడ్డును పొడవును కలవాఁడు, బారముట్టుకొలత కలదేహము కలవాఁడు.

శ్లో. న్యగ్రోధౌ తు స్మృతౌ బాహూ వ్యామో న్యగ్రోధ ఉచ్యతే, వ్యామేన ఉచ్ఛ్రయో యస్య అధ ఊర్ధ్వం చ దేహినః, సమోచ్ఛ్రయపరీణాహో న్యగ్రోధపరిమండలః. మత్స్యపురాణము. (వాచ.)

న్యగ్రోధము. సం. వి. అ. పుం. గు. మఱ్ఱిచెట్టు. ౨. శమి, జమ్మిచెట్టు. ౩. వ్యామము, బార.

న్యగ్రోధి. సం. వి. ఈ. స్త్రీ. మూషికపర్ణి, ఎలుకచెవిచెట్టు.

న్యచ్ఛము. సం. వి. అ. న. దేహముమీఁది పుట్టుమచ్చ.

న్యయము. సం. వి. అ. పుం. గు. నాశము. ౨. అపచయము, తఱుగుట.

న్యర్బుదము. సం. విశ. (అ. ఆ. అ.) పదియర్బుదములయందుండు సంఖ్య కలది. వి. అ. న. పదియర్బుదములు.

న్యసనము. సం. వి. అ. న. ౧. ఉంచుట. ౨. అప్పగించుట. ౩. ఇల్లడపెట్టుట. ౪. విడిచిపెట్టుట.

న్యసనీయము. సం. విణ. (అ. ఆ. అ.) న్యసింపఁదగినది, ఉంచఁదగినది.

న్యసించు. సం. స. క్రి. ౧. ఉంచు. ౨. ఇల్లడపెట్టు. ౩. జపాదిసమయమున దేహావయవములయందు మంత్రబీజాక్షరము లుంచు, న్యాసము చేయు. ౪. స్పృశించు, తాఁకు.

వ... కేశవాదినామంబులతోడ గోకర్ణహస్తంబున మాషమజ్జనపరిమితశుద్ధోదకంబుల ముమ్మాఱు లోనికింగొని యనుమాఱు పరిమార్జనంబు చేసి దక్షిణపూర్వకంబుగా నేత్రనాసాశ్రోత్రద్వయశిరోబాహుద్వయనాభి హృదయంబుల న్యసించి యాచమనంబు చేసి... వి. పు. ౪. ౧౯౭.

న్యసిత. సం.విణ. (బు. త్రి.బు.) న్యాసకుఁడు.

న్యసితవ్యము. సం=న్యసనీయము.

న్యస్తదేహుఁడు. సం.విణ. (అ. ఆ. అ.) దేహమును విడిచినవాఁడు, మృతుఁడు.

న్యస్తము. సం.విణ. (అ.ఆ. అ.) ౧. నిహితము, ఉంచఁబడినది. ౨. క్షిప్తము, త్రోయఁబడినది. ౩. త్యక్తము, విడువఁబడినది. ౪. అప్పగింపఁబడినది. ౫. ఇల్లడపెట్టఁబడినది. ౬. మంత్రోచ్చారణముతో అంటఁబడినది. (నైత్రాది.)

న్యస్తశస్త్రుఁడు. సం.విణ. (అ.ఆ. అ.) సన్న్యస్తశస్త్రుఁడు, శస్త్రములను విడిచినవాఁడు, అస్త్రసన్న్యాసము చేసినవాఁడు.

న్యస్యత్. సం. శత్ర. న్యసించుచున్న.

న్యస్యమానము. సం.విణ. (అ. ఆ. అ.) న్యసింపఁబడుచున్నది.

న్యస్యము. సం. = న్యసనీయము.

## న్యా.

న్యాక్యము. సం. వి. అ. న. భృష్టతండులము, వేఁపుడుబియ్యము. (వాచ.)

న్యాదము. సం. వి. అ. పుం. ౧. భోజనము తినుట. ౨. ఆహారము.

న్యాయపథము. సం. వి. అ. పుం. ౧. ధర్మమార్గము; నీతిమార్గము. ౨. మీమాంసాశాస్త్రము.

న్యాయము. సం. వి. అ. పుం. -దీని ననుసరించి ప్రవర్తింతురు.- ౧. పద్ధతి. ౨. పాడి, ధర్మము. ౩. వ్యవహారము, తగవు; దాయభాగాదివ్యవహారము. ౪. వేదార్థనిర్ణయసాధన మగు అధికరణము. ౫. గౌతమముని ప్రణీత మగుతర్క-న్యాయ-శాస్త్రము. ౬. (న్యాయ.) ప్రతిజ్ఞాహేతూదాహరణోపనయనిగమము లనుపంచావయవములు కలవాక్యసముదాయము. ౭. లోకమందును శాస్త్రమందును ప్రసిద్ధమగుదృష్టాంతవిశేషము. ఉదా:-

అండకుక్కుటీన్యాయము:- గ్రుడ్డు ముందా? కోడి ముందా? (చూ. బీజాంకురన్యాయము.)

అంధకూపపతనన్యాయము:- ౧. నాలుగురు అంధులు కలసి పోవుచుండఁగా వారిలో మొదటియంధుఁడు ఒక నూతిలోఁ బడెను. వాఁడట్లు నూతిలోఁ బడినట్లు ఎఱుఁగని మిగిలినయంధు లందఱు నొకరివెంట నొకరు నూతిలోఁ బడిరి. ఒక అజ్ఞుని అనుసరించి పోవుమిగిలినఅజ్ఞులుకూడ మొదటివానివలెనే హానిఁ బొందుదురు.

౨. మార్గదర్శి చెప్పినత్రోవ వదలి గ్రుడ్డివాఁడు నూతిలోఁ గూలినట్లు వేదాదిసదుపదేశములను వదలి అజ్ఞుఁడు నరకమునఁ బడును. (వాచ.)

న్యంకువు. సం. వి. ఉ. పుం. గ. ఇఱ్ఱి. జ. ఒకా నొకమని.

న్యంచనము. సం. వి. అ. న. గ. న్యగ్భావము, తక్కువపాటు. జ. వంపు, వంకర. 3. పల్లము.

న్యంచితము. సం. విణ. (అ. ఆ. అ.) గ. అధః క్షిప్తము, క్రిందికి త్రోయఁబడినది. జ. వంపఁబడినది.

న్యంతము. సం. వి. అ. పుం. చరమభాగము, చిట్టచివరభాగము.

న్యక్కారణము. సం. వి. అ. న. తిరస్కారము, అవమానము.

న్యక్కారము. సం. వి. అ. పుం=న్యక్కారణము.

న్యక్కు. సం. విణ. (చ్. నీచీ. చ్.) గ. క్రిందికి పోవునది; క్రిందికి వంగునది. జ. నిమ్నము, పల్లము. 3. నీచము.

న్యక్కృతము. సం. విణ. (అ. ఆ. అ.) తిరస్కృతము, అవమానింపఁబడినది.

న్యక్కృతి. సం. వి. ఇ. స్త్రీ=న్యక్కారణము.

న్యక్తము. సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి చఱచఁబడినది, మిక్కిలి పూయఁబడినది.

న్యక్షము. సం. విణ. (అ. ఆ. అ.) గ. నీచము, తక్కువైనది. జ. అంతయు, సమస్తము. వి. అ. పుం. మహిషము, దున్నపోతు. న. గ. సాకల్యము, పూర్ణత. జ. మహిషతృణము.

న్యక్షుఁడు. సం. వి. అ. పుం. పరశురాముఁడు. (వా చ.)

న్యగ్భావము. సం. వి. అ. పుం. గ. నీచత్వము, తక్కువపాటు; అవమానము, తిరస్కారము. జ. నీచముగా చేయుట, క్రిందుపఱుచుట.

న్యగ్భావితము. సం. విణ. (అ. ఆ. అ.) గ. నీచముగా చేయఁబడినది, క్రిందుపఱుపఁబడినది. జ. గుణీకృతము, అప్రధానముగా చేయఁబడినది.

న్యగ్భూతము. సం.విణ. (అ. ఆ. అ.) గ. నీచమైనది జ. అవమానము నొందినది, తిరస్కారము నొందినది.

న్యగ్రోధపరిమండల. సం. వి. ఆ. స్త్రీ. కఠిన స్తనములును విశాలనితంబమును సూక్ష్మమధ్యమును కల స్త్రీ.

శ్లో. స్తనౌ సుకఠినౌ యస్యా నితంబే చ విశాలతా, మధ్యే క్షీణా భవేద్యా సా న్యగ్రోధపరిమండలా. (వా చ.)

న్యగ్రోధపరిమండలుఁడు. సం. వి. అ. పుం. వ్యామపరిమితమైనయుచ్ఛ్రాయమును పరిణాహమును కలపురుషుఁడు, బారెడు ఒడ్డును పొడవును కలవాఁడు, బారచుట్టుకొలత కలదేహము కలవాఁడు.

శ్లో. న్యగ్రోధౌ తు స్మృతౌ బాహూ వ్యామో న్యగ్రోధ ఉచ్యతే, వ్యామేన ఉచ్ఛ్రయో యస్య అధ ఊర్ధ్వం చ దేహినః, సమోచ్ఛ్రయపరిణాహో న్యగ్రోధపరిమండలః. మత్స్యపురాణము. (వా చ.)

న్యగ్రోధము. సం. వి. అ. పుం. గ. మఱ్ఱిచెట్టు. జ. శమి, జమ్మిచెట్టు. 3. వ్యామము, బార.

న్యగ్రోధి. సం. వి. ఈ. స్త్రీ. మూషికపర్ణి, ఎలుకచెవిచెట్టు.

న్యచ్ఛము. సం. వి. అ. న. దేహముమీఁది పుట్టుమచ్చ.

న్యయము. సం. వి. అ. పుం. గ. నాశము. జ. అపచయము, తఱుగుట.

న్యర్బుదము. సం. విణ. (అ. ఆ. అ.) పదియర్బుదములయందుండు సంఖ్య కలది. వి. అ. న. పది యర్బుదములు.

న్యసనము. సం. వి. అ. న. ౧. ఉంచుట. ౨. అప్పగించుట. ౩. ఇల్లడపెట్టుట. ౪. విడిచిపెట్టుట.

న్యసనీయము. సం. విణ. (అ. ఆ. అ.) న్యసింపఁదగినది, ఉంచఁదగినది.

న్యసించు. సం. స. క్రి. ౧. ఉంచు. ౨. ఇల్లడపెట్టు. ౩. జపాదిసమయమున దేహావయవములయందు మంత్రబీజాక్షరము లుంచు, న్యాసము చేయు. ౪. స్పృశించు, తాఁకు.

వ... కేశవాదినామంబులతోడ గోకర్ణహస్తంబున మాషమజ్జనపరిమితశుద్ధోదకంబుల ముమ్మాఱు లోనికింగొని యినుమాఱు పరిమార్జనంబు చేసి దక్షిణపూర్వకంబుగా నేత్రనాసాశ్రోత్రద్వయశిరోబాహుద్వయనాభి హృదయంబుల న్యసించి యాచమనంబు చేసి... వి. పు. ౪. ౧౯౩.

న్యసిత. సం.విణ. (బు. త్రి. బు.) న్యాసకుఁడు.

న్యసితవ్యము. సం=న్యసనీయము.

న్యస్తదేహుఁడు. సం.విణ. (అ. ఆ. అ.) దేహమును విడిచినవాఁడు, మృతుఁడు.

న్యస్తము. సం.విణ. (అ.ఆ. అ.) ౧. నిహితము, ఉంచఁబడినది. ౨. క్షిప్తము, త్రోయఁబడినది. ౩. త్యక్తము, విడువఁబడినది. ౪. అప్పగింపఁబడినది. ౫. ఇల్లడపెట్టఁబడినది. ౬. మంత్రోచ్చారణముతో అంటఁబడినది. (నేత్రాది.)

న్యస్తశస్త్రుఁడు. సం.విణ. (అ.ఆ. అ.) సన్న్యస్తశస్త్రుఁడు, శస్త్రములను విడిచినవాఁడు, అస్త్రసన్న్యాసము చేసినవాఁడు.

న్యస్యత్. సం. శత్ర. న్యసించుచున్న.

న్యస్యమానము. సం.విణ. (అ. ఆ. అ.) న్యసింపఁబడుచున్నది.

న్యస్యము. సం. = న్యసనీయము.

## న్యా.

న్యాక్యము. సం. వి. అ. న. భృష్టతండులము, వేఁపుడుబియ్యము. (వాచ.)

న్యాదము. సం. వి. అ. పుం. ౧. భోజనము తినుట. ౨. ఆహారము.

న్యాయపథము. సం. వి. అ. పుం. ౧. ధర్మమార్గము; నీతిమార్గము. ౨. మీమాంసాశాస్త్రము.

న్యాయము. సం. వి. అ. పుం. -దీని ననుసరించి ప్రవర్తింతురు.- ౧. పద్ధతి. ౨. పాడి, ధర్మము. ౩. వ్యవహారము, తగవు; దాయభాగాదివ్యవహారము. ౪. వేదార్థనిర్ణయసాధన మగు అధికరణము. ౫. గౌతమమునిప్రణీత మగుతర్క-న్యాయ-శాస్త్రము. ౬. (న్యాయ.) ప్రతిజ్ఞాహేతూదాహరణోపనయననిగమము లనుపంచావయవములు కలవాక్యసముదాయము. ౭. లోకమందును శాస్త్రమందును ప్రసిద్ధమగుదృష్టాంతవిశేషము. ఉదా:-

ఆఁడకుక్కుటీన్యాయము:- గ్రుడ్డు ముందా? కోడి ముందా? (చూ. బీజాంకురన్యాయము.)

అంధకూపపతనన్యాయము:- ౧. నూఱుగురు అంధులు కలసి పోవుచుండఁగా వారిలో మొదటియంధుఁడు ఒక నూతిలోఁ బడెను. వాఁడట్లు నూతిలోఁ బడినట్లు ఎఱుఁగని మిగిలినయంధు లందఱు నొకరివెంట నొకరు నూతిలోఁ బడిరి. ఒక అజ్ఞుని అనుసరించి పోవుమిగిలినఅజ్ఞులుకూడ మొదటివానివలె నే హానిఁ బొందుదురు.

౨. మార్గదర్శి చెప్పినత్రోవ వదలి గ్రుడ్డివాఁడు నూతిలోఁ గూలినట్లు వేదాదిసదుపదేశములను వదలి అజ్ఞుఁడు నరకమునఁ బడును. (వాచ.)

